30 రోజులలో సమగ్ర విజ్ఞాన స్వబోధిని

## వసుంధర

# పెద్ద బాలశిక్ష



30 రోజులలో సమగ్ర విజ్ఞాన స్వబోధిని వసుంధర పెద్ద బాలశిక్ష

# సమగ్ర విజ్ఞాన స్వబోధిని
# వసుంధర వారి పెద్దబాలశిక్ష

## విషయసూచిక

శ్రీరస్తు    శుభమస్తు    అవిఘ్నమస్తు

## గురుప్రార్థన



శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః!
గరుర్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః!!

## విఘ్నేశ్వర ప్రార్థన



శ్లో॥ శుక్లాం బరధరం విష్ణుం
శశివర్ణం చతుర్భుజమ్!
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ
విఘ్నోపశాంతయే!!

## సరస్వతీ ప్రార్థన



శ్లో॥ సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మేసదా
పద్మపత్ర విశాలాక్షి! పద్మకేసర వర్ణిని!
నిత్యంపద్మాలయాదేవి సామాంపాతుసరస్వతీ
భగవతీ! భారతీ! పూర్ణేందు బింబాననా!
శ్లో॥ శరవిందు సమాకారే పరబ్రహ్మ స్వరూపిణీ!
వాసరా పీఠనిలయే సరస్వతీ నమోస్తుతే!!

## హయగ్రీవోపాసన

శ్లో॥ జ్ఞానానంద మయం దేవం నిర్మలః స్పటికాకృతిం!
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే!!

## శ్రీనివాస ప్రార్థన



శ్రీ వేంకటాచలాధీశం, శ్రియాధ్యాసిత వక్షసం!
శ్రిత చేతస మందారం, శ్రీనివాస మహంభజే!!
కరద్వయేన కమలే, ధారయంతీం స్వలీలయా!
హారనూఫర సంయుక్తాం, లక్ష్మీదేవీం నమామ్యహమ్!!

**మాతృదేవోభవ, పితృదేవోభవ**
**ఆచార్యదేవోభవ, అతిధి దేవోభవ.**

## జాతీయ గీతము
కవి : రవీంద్రనాథ్ ఠాగూర్

జనగణమన అధినాయక జయహే భారత భాగ్య విధాతా
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా, ద్రావిడ, ఉత్కల, వంగా!
వింధ్య, హిమాచల, యమునా, గంగా, ఉచ్చల జలధితరంగా!
తవశుభనామే జాగే! తవశుభ ఆశిష మాగే! గాహే తవ జయగాధా!
జనగణ మంగళదాయక జయహే భారత భాగ్యవిధాతా
జయహే! జయహే! జయహే జయ జయ జయ జయహే

## వందేమాతరం
కవి: బకిం చంద్ర చటర్జీ

వందేమాతరం - వందేమాతరం
సుజలాం, సుఫలాం - మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం - వందే మాతరం
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం-పుల్లకుసుమిత, ద్రుమదళ శోభినీ
సుహాసినీ సుమధుర భాషిణీ-సుఖదాం వరదాం మాతరం - వందేమాతరం

## సారే జహాఁసే అచ్ఛా
కవి: మహమ్మద్ ఇక్బాల్

సారే జహాఁసే అచ్ఛా హిందుస్థాన్ హమారా, హమారా
హమ్ బుల్ బులేహై ఇస్‌కే, యేగుల్ సితాఁహమారా, హమారా ॥సారే॥
పర్వత్ వో సబ్‌సే వూఁఛా హమ్‌సాయా ఆస్‌మాన్ కా
వో సంతరీ హమారా, వో పాస్‌బాఁ హమారా, హమారా ॥సారే॥
గోదీ మేఁ ఖేల్‌తీహైఁ జిస్‌కీ హజారోఁ నదియాఁ
గుల్షన్ హై జిన్‌కే దమ్‌సే రష్కే జినాఁ హమారా ॥సారే॥
మజ్-హబ్ నహీఁసిఖాతా ఆపస్ మేఁబైర్ రఖనా
హిందీ హైఁహమ్, వతన్‌హైఁ హిందుస్థాన్ హమారా, హమారా ॥సారే॥

## ప్రతిజ్ఞ

భారతదేశం నా మతృభూమి, భారతీయులందరు నా సహోదరులు, నేను నా దేశమును ప్రేమించుచున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారము. దీనికి అర్హత పొందుటకై సర్వదా నేను కృషి చేయుదును.

నా తల్లిదండ్రులను, ఉపాధ్యాయులను, పెద్దలందరిని గౌరవింతును. ప్రతి వారితోను మర్యాదగా నడుచుకొందును.నా దేశము పట్లను,నాప్రజలపట్లనుసేవానిరతికలిగియుందునని ప్రతిజ్ఞచేయుచున్నాను. వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందమునకు మూలము.

## దేశభక్తి గీతం

కవి : గురజాడ అప్పారావు

దేశమును ప్రేమించుమన్నా-మంచి అన్నది పెంచుమన్నా
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్-గట్టిమేల్ తలపెట్టవోయి!
పాడిపంటలు పొంగి పొర్లే-దారిలో నువు పాటు పడవోయ్,
తిండి కలిగితె కండకలదోయ్-కండకలవాడేను మనిషోయి!
ఈసురోమని మనుషులుంటే-దేశమేగతి బాగు పడునోయ్?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు-దేశి సరుకులు నించవోయి!
అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్-దేశి సరుకుల నమ్మవలెనోయ్
డబ్బు తేలేనట్టి నరులకు-కీర్తి సంపదలబ్బవోయి!
వెనుక చూసిన కార్యమేమోయ్-మంచి గతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్-వెనుక పడితే వెనుకేనోయి!
పూను స్పర్థను విద్యలందే-వైరములు వాణిజ్యమందే
వ్యర్థ కలహం పెంచబోకోయ్-కత్తివైరం కాల్చవోయి
దేశాభిమానం నాకు కద్దని-వట్టి గొప్పలు చెప్పుకోకోయ్;
పూని యేదైనాను వొకమేల్ - కూర్చి జనులకు చూపవోయి!

## రాష్ట్ర గీతం

కవి : శంకరంబాడి సుందరాచార్యులు

మా తెలుగు తల్లికి మల్లె పూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తీయందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి కృష్ణరాయలకీర్తి
మా చెవులు రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం; నీ ఆటలే ఆడుతాం
జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ!



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు





## ఓం నమః శ్శివాయః సిద్ధం నమః

## ఆంధ్ర భాషకు అక్షరములు - 56

## అచ్చులు (సర్వములు) - 16

## అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ,ౠ

## ఎ,ఏ,ఐ,ఒ,ఓ,ఔ,అం,అః

ఌ ౡ లు పూర్వముఉండెడివి, ఇవి ప్రస్తుతము వాడుకలో లేవు.

అచ్చులను స్వరములని, ప్రాణములని అందురు.

## ఇందలి అచ్చుల విభాగములు

హ్రస్వములు : అ,ఇ,ఉ,ఋ,ఎ,ఒ

దీర్ఘములు : ఆ,ఈ,ఊ,ౠ,ఏ,ఐ,ఓ,ఔ

వక్రములు : ఎ,ఏ,ఒ,ఓ

వక్రతమములు : ఐ,ఔ

## హల్లులు (వ్యంజనములు)

క ఖ గ ఘ ఙ

చ ఛ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ల వ శ ష స హ ళ క్ష ఱ

ఇందలిపరుషాక్షరములు : క చ ట త ప
సరళములు : గ జ డ ద బ
ద్రుతము : న కారము
అనునాశికములు : అనగా ముక్కుతో పలుకునవి
ఙ ఞ ణ న మ
స్థిరములు : ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ ద థ న ఫ
భ మ య ర ఱ ల వ శ ష స హ
అంతస్థములు : య ర ఱ ల ళ వ
ఊష్మములు : శ ష స హ
ప్రథమ వర్గములుపరుపాక్షరములు : క, చ, ట, త, ప
ద్వితీయ వర్గములు : ఖ, ఛ, ఠ, థ, ఫ
తృతీయ వర్గములు, సరళములు: గ, జ, డ, ద, బ
చతుర్వర్గములు : ఘ, ఝ, ఢ, ధ, భ,
పంచమ వర్గాలు, అనునాశికాలు : ఙ, ఞ, ణ, న, మ
కంఠ్యములు : అ ఆ క ఖ గ ఘ ఙ హః
తాలవ్యములు : ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ
మూర్ధవ్యములు : ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ఱ ష ళ
దంత్యములు : త థ ద ధ న ల స చ జ
ఓష్ఠ్యములు : ఉ ఊ ప ఫ బ భ మ
కంఠతాలవ్యములు : ఎ ఏ ఐ
దంతోష్ట్యము : వ
నాసిక్యము : ం
కంఠౌష్ట్యములు : ఒ ఓ ఔ
ఉభయాక్షరములు : ం, ఁ, ః (సున్నా, అరసున్నా, విసర్గ)
చే, జే (ప్రస్తుతము ఇవి వాడుకలో లేవు)

హల్లులను, వ్యంజనములు, ప్రాణులు అనికూడా అందురు.
పరుషములు, సరళములు కాక మిగిలిన హల్లులు స్థిరములు.

కేవలము అచ్చులతోటి పదాలను (అనగా మాటలు) వ్రాయలేము. అచ్చుల, హల్లుల కలయికతో పదాలను వ్రాయగలము.

అచ్చులలో మొదటి అక్షరమైన 'అ'కారమును తీసుకొని హల్లుతో జతపరచి కొన్ని అర్థవంతమైన మాటలను సృష్టించవచ్చు.

# అచ్చులు

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః

# హల్లులు

క, ఖ, గ, ఘ, ఙ
చ, ఛ, జ, ఝ, ఞ
ట, ఠ, డ, ఢ, ణ
త, థ, ద, ధ, న
ప, ఫ, బ, భ, మ

య ర ల వ శ ష స హ ళ క్ష ఱ

అల, ఆట, ఇల, ఈశ, ఉష, ఊహ (ఋ), (ౠ), ఎద, ఏక, ఐదవ, ఒక, ఓడ, ఔషధ, అంక, (అః)

**ఇందలి అచ్చుల ప్రక్కన సున్నా చేర్చి పలికిన**

అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ఎం ఏం ఐం ఒం ఓం ఔం
అంక, ఆంక్ష, ఇంత, ఎంత, ఈ విధముగా పలుక వచ్చును.
హల్లులలో అచ్చులు ధ్వనించును గాని అచ్చులలో హల్లు ధ్వనించదు.
'క' అనగా అందు అకారము ధ్వనించును.
'అ' అనగా 'క' అను అక్షరములు ధ్వనించదు.

**హల్లులలోనిహ్రాస్వములకు హ్రస్వములుకలిపినచో కొన్నిపదాలు రూపొందును.**
కల, గద, మర, వర, తల, వల, పలక, మరల, కళ, మడత, పడక, నడక కథ, కడవ, మమత, నటన, వరద, నవ, వన, నలక, ఘనత, మదన

**హల్లులకు సున్నా చేర్చి పలికిన**

కం, ఖం, గం, ఘం చం, ఛం, జం, ఝం
టం, ఠం, డం, ఢం, ణం తం, థం, దం, ధం, నం
పం, ఫం, బం, భం, మం యం, రం, లం, వం, శం,
షం, సం, హం, ళం, క్షం

వీటికి హ్రస్వాక్షరములు కొన్ని చేర్చిన అర్ధవంతమైన కొన్ని పదములు ఏర్పడును.
కంట, గంట, వంట, మంట, తంట, పంట, జంట, శంక

ఉచ్చరించుటకు మరియు అర్థవంతములైన పదములను మాత్రమేకూర్చవలెను. గాని అస్తవ్యస్తముగా కలిపి పలికిన నిష్ప్రయోజనములు.
**ఉదా :** రంట, లంట, శంచ, ఛంత అర్థములేనివగును
**ద్విత్వములు :** అనగా హల్లు క్రింద అదే హల్లు వత్తు వచ్చుట
**సంయుక్తములు :** అనగా హల్లు క్రింద వేరే హల్లు వత్తు వచ్చుట

# గుణింతములు

అచ్చుల వరుసక్రమాన్ని దృష్టిలో ఉంచుకొని హల్లును పలుకుట

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ

ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః

క కా కి కీ కు కూ కృ కౄ

కె కే కై కొ కో కౌ కం కః

## అచ్చులు గుణిత చిహ్నములు

| | | | |
|---|---|---|---|
| అ | క | ా | తలకట్టు |
| ఆ | కా | ా | దీర్ఘము |
| ఇ | కి | ి | గుడి |
| ఈ | కీ | ీ | గుడిదీర్ఘము |
| ఉ | కు | ు | కొమ్ము |
| ఊ | కూ | ూ | కొమ్ముదీర్ఘము |
| ఎ | కె | ె | ఎత్వము |
| ఏ | కే | ే | ఏత్వము |
| ఐ | కై | ై | ఐత్వము |
| ఒ | కొ | ొ | ఒత్వము |
| ఓ | కో | ో | ఓత్వము |
| ఔ | కౌ | ౌ | ఔత్వము |
| అం | కం | ం | పూర్ణానుస్వరము |
| అః | కం | ః | విసర్గ |

ఒక గుణింతమును తీసుకొని దానిలో పదనిర్మాణమును కొంతవరకు చేయవచ్చును. కాకి, కూకు, కేక, కోక, కైక ఈ విధముగా ప్రయత్నము చేసిన అర్థవంతమైన పదములు లభ్యమగును.

లాలి, లీల, లోల, లలలా, లాల, పాపి, పీప, పాప, పైపై, పైపు

## హల్లునకు వచ్చు వత్తులు - రూప భేధములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| క | - ్క | కావత్తు | న | - ్న | నావత్తు |
| ఖ | - ్ఖ | ఖావత్తు | ప | - ్ప | పావత్తు |
| గ | - ్గ | గావత్తు | ఫ | - ్ఫ | ఫావత్తు |
| ఘ | - ్ఘ | ఘావత్తు | బ | - ్బ | బావత్తు |
| ఙ | - ్ఙ | ఙవత్తు | భ | - ్భ | భావత్తు |
| చ | - ్చ | చావత్తు | మ | - ్మ | మావత్తు |
| ఛ | - ్ఛ | ఛావత్తు | య | - ్య | యావత్తు |
| జ | - ్జ | జావత్తు | ర | - ్ర | రావత్తు |
| ఝ | - ్ఝ | ఝావత్తు | | (దీనినే క్రావడిఅందురు) | |
| ఞ | - ్ఞ | ఞవత్తు | ల | - ్ల | లావత్తు |
| ట | - ్ట | టావత్తు | వ | - ్వ | వావత్తు |
| ఠ | - ్ఠ | ఠావత్తు | శ | - ్శ | శావత్తు |
| డ | - ్డ | డావత్తు | ష | - ్ష | షావత్తు |
| ఢ | - ్ఢ | ఢావత్తు | స | - ్స | సావత్తు |
| ణ | - ్ణ | ణావత్తు | హ | - ్హ | హావత్తు |
| త | - ్త | తావత్తు | ళ | - ్ళ | ళావత్తు |
| థ | - ్థ | థావత్తు | క్ష | - ్క్ష | క్షవత్తు |
| ద | - ్ద | దావత్తు | న | - ౝ | నకారపు పొల్లు |
| ధ | - ్ధ | ధావత్తు | ఖ, ఙ, జ, ఞ, ణ, అ | | |

ఈ ఆరు హల్లు వత్తులగునప్పుడు మార్పురాదు.

వత్తులను ప్రయోగించునప్పుడు ఒక హల్లు క్రింద వేరే హల్లు ప్రయోగించి వ్రాసి పలికినచో తెలుగు సంస్కృత భాషలే కాక ఏ ఇతర భాషనైనా తెలుగులోనికి తర్జుమా చేయవచ్చును.

| ఉదా : | ఉదా : | ఉదా : | ఉదా : | ఉదా : | ఉదా : |
|---|---|---|---|---|---|
| క్ల | క్న | క్వ | గ్ల | గ్న | గ్ద |
| క్లా | క్నా | క్వా | గ్లా | గ్నా | గ్దా |
| క్లి | క్ని | క్వి | గ్లి | గ్ని | గ్ది |
| క్లీ | క్నీ | క్వీ | గ్లీ | గ్నీ | గ్దీ |
| క్లు | క్ను | క్వు | గ్లు | గ్ను | గ్దు |
| క్లూ | క్నూ | క్వూ | గ్లూ | గ్నూ | గ్దూ |
| క్లృ | క్నృ | క్వృ | గ్లృ | గ్నృ | గ్దృ |
| క్లౄ | క్నౄ | క్వౄ | గ్లౄ | గ్నౄ | గ్దౄ |
| క్లె | క్నె | క్వె | గ్లె | గ్నె | గ్దె |
| క్లే | క్నే | క్వే | గ్లే | గ్నే | గ్దే |
| క్లై | క్నై | క్వై | గ్లై | గ్నై | గ్దై |
| క్లొ | క్నొ | క్వొ | గ్లొ | గ్నొ | గ్దొ |
| క్లో | క్నో | క్వో | గ్లో | గ్నో | గ్దో |
| క్లౌ | క్నౌ | క్వౌ | గ్లౌ | గ్నౌ | గ్దౌ |
| క్లం | క్నం | క్వం | గ్లం | గ్నం | గ్దం |
| క్లః | క్నః | క్వః | గ్లః | గ్నః | గ్దః |

ఈ విధంగా ప్రతి గుణింతమునకు వేరే హల్లు వత్తు పలుక గలిగినది (సంయుక్తములు) ప్రయోగించి మాటలను ఈ క్రింది విధముగా వ్రాయవచ్చును. జ్యోతి, వాగ్ధార, నర్మద, ముగ్ధ, వాక్యము, పిగ్మి, నగ్మ, సిగ్నలు, ఇంగ్లీషు, క్లాక్ క్లాత్, క్లీనింగ్, క్లిక్, క్వారి ఇదే విధంగా హల్లు క్రింద రెండు మూడు వత్తులను కలిపి పదాలను సృష్టించుట ఉదా :- కక్ష్య, హర్మ్యము, లక్ష్యము, మహోత్త్వము

# బొమ్మలను గుర్తించి పేర్లను వ్రాయుము


























































(ఘటము)













(ఝషము)



| | | | |
|---|---|---|---|
| ఠ (పఠనము) | డ | ఢ | ణ |
| త | థ (పథము) | ద | ధ |
| న | ప | ఫ | బ |
| (భగవంతుడు) భ | మ | య | ర |
| ల | వ | శ (శశి) | ష |
| స | హ | (కళ) ళ | (క్షత్రియుడు) క్ష |

# రెండక్షరముల పేర్లు

| | | | | |
|---|---|---|---|---|
| అంచు | ఔరా! | గృహం | చలి | తాత  |
| అంత | కంత | గెల | ఛాయ | తిట్టు |
| ఆకు | కంట | గేయం | ఛురి | తీపి |
| ఆహా | కాకి | గైరి | ఛేది | తుక్కు |
| ఇంత | కిరి | గొల్ల | జంట | తూడు |
| ఇంచు | కీడు | గోప | జాజి | తెగ  |
| ఈశ | కుండ | గౌరి | జిగి | తేట |
| ఈగ | కూర | ఘృణి | జీర | తొక్క |
| ఈల | కృప | ఘోణి | జున్ను | తోలు |
| ఉట్టి | కేక | చక్రి | జూలు | దండ  |
| ఊహ | కైక | చాలు | జెల | దాత |
| ఋుక్కు | కోడి | చిచ్చు | జేజి | దిక్కు |
| ఎండ | కౌజు | చీర | జోగి | దీపం  |
| ఎంత | ఖని | చుక్క | ఝురి | దుమ్ము |
| ఎందు | ఖేల | చూపు | టీక | దూత |
| ఎగ్గు | ఖైదు | చెడు | టెంక | దృష్టి |
| ఎడ | గంగ | చేదు | ఢక్క | దెస |
| ఏడు 7 | గాటు | చైత్రం | డాగు | దేవ  |
| ఐంద్రి | గిరి | చొప్ప | డొక్కు | దైవం |
| ఒందు | గీతి | చోటు | తంతి | దొర |
| ఒంపు | గుత్తి | చౌక | తంత్రి | దోర |
| ఓడ | గూడు | చట్ట | తావి | దౌత్యం |

| | | | | |
|---|---|---|---|---|
| నగ | ఫక్కు | మైల | లేత | శోకం |
| నాచు | బండి | మొర | లోతు | శౌచ |
| నిగ | బంతి | మోటు | లోయ | సంత |
| నీరు | బంది | మోము | లోటు | సాధ్వి |
| నూగు | బాకు | మౌని | వంట | సిర |
| నృప | బిడ్డ | యమి | వంక | సీత |
| నేను | బీద | యామ్య | వంద | సుత |
| నొస | బుద్ధి | యోగి | వాడు | సుర |
| నొక్కు | భూమి | రంభ | వాసు | సొర |
| నోరు | బూజు | రాజు | వింత | సోది |
| నంది | బెండు | రాణి | విధి | హంస |
| పది | బేల | రింఖ | విల్లు | హంపి |
| పాలు | బొమ్మ | రివ్వ | విష్ణు | హోరం |
| పిడి | బోటి | రుతి | వీధి | హతం |
| పీడ | బోను | రూఢి | వృద్ధి | హేల |
| పుంజు | బంక | రూపు | వెలి | హైమ |
| పూత | మంచి | రెల్లు | వేలు | హోమం |
| పెక్కు | మల్లె | రేయి | వేటు | క్షయ |
| పేద | మాట | రైతు | శంక | క్షేమ |
| పైరు | మించు | రొంప | శాఖ | క్షీణ |
| పొద | మీరు | రోలు | శిరం | క్షోభ |
| పోరు | ముద్దు | రౌతు | శీలం | క్షౌరం |
| పౌజు | మూతి | లక్ష్మి | శూలం | |
| పంది | మెడ | లాలి | శృతి | |
| ఫక్కి | మేడ | లూత | శైలం | |

# మూడక్షరముల పేర్లు

| | | | | |
|---|---|---|---|---|
| అలక | ఒడుగు | కొలను | గేయము | చెదరు |
| అడవి | ఓరిమి | కోమలి | గొడుగు | చెవులు |
| అదును | ఔదల | కోరిక | గొడవ | చెప్పలు |
| ఆమని | అంజలి | కౌముది | గోపతి | చేమంతి |
| ఆకలి | అందము | ఖండము | గోకులం | చైత్రము |
| ఇరుసు | కందము | ఖగము | గౌతమి | చొరవ |
| ఇహము | కంపము | ఖరము | ఘటము | చోరుడు |
| ఈశుడు | కథలు | ఖాతరు | ఘాసము | చోద్యము |
| ఈదుట | కవిత | ఖిలము | ఘుణము | ఛద్మము |
| ఉరము | కామిని | ఖురము | ఘృతము | ఛత్రము |
| ఉడుము | కారము | ఖేదము | ఘోరము | ఛిద్రము |
| ఊహలు | కిటికి | గంధము | చంచల | ఛురిక |
| ఊడలు | కింకిణి | గమ్యము | చందనం | జంపతి |
| ఊపిరి | కీరము | గాయత్రి | చక్రము | జంతిక |
| ఋక్షము | కుజుడు | గానుగ | చాపము | జంత్రము |
| ఋజువు | కులుకు | గిరిజ | చిత్తము | జయము |
| ఎదుగు | కూటమి | గీతము | చిత్రము | జారుట |
| ఎరువు | కృత్యము | గీర్వాణి | చీపురు | జాలరి |
| ఏతము | కెందమ్మి | గుణము | చీకటి | జాగృతి |
| ఏడుపు | కేకలు | గూటము | చుక్కలు | జిగురు |
| ఐదవ | కేసరి | గృధ్రము | చురుకు | జీతము |
| ఒదుగు | కైదండ | గెలుచు | చూతము | జీవము |

| | | | | |
|---|---|---|---|---|
| జులుము/ | తిలలు | దూరము | నీదయ | పూర్ణము |
| జుగుప్స | తీరము | ధృతము | నురుగు | పూతన |
| జూదము | తీతువు | దెయ్యము | నునుపు | పెదవి |
| జేగంట | తుంపర | దేహము | నూపురం | పేటలు |
| జొంపము | తుంబుర | దైవము | నూరగు | పైత్యము |
| జోహారు | తూకము | దైన్యము | నృపతి | పొదలు |
| జోతలు | తూలుట | దొంతర | నెనరు | పోతన |
| ఝషము | తృణము | దోషము | నెమలి | పోరుట |
| ఝాటము | తెలివి | దౌత్యము | నేమము | పౌత్రుడు |
| టంకము | తేకువ | ధరణి | నైజము | పంతము |
| టక్కరి | తైలము | ధాతువు | నొసలు | పంజరం |
| టెక్కము | తొనలు | ధిరణ | నోటరి | ఫణము |
| ఠంగణ | తొడలు | ధీమతి | నౌకలు | ఫలము |
| డబ్బులు | తోయము | ధీరుడు | పంకము | బంగరు |
| డింభక | తౌలము | ధూమము | పంటలు | బంధువు |
| ఢీకొను | దంతము | ధేనువు | పలక | బాణలి |
| డోలిక | దండము | నగలు | పదును | బాణము |
| తక్కెడ | దంపుట | నరము | పాదము | బింకము |
| తర్కము | దాసరి | నగము | పాదుక | బిగువు |
| తగవు | దానము | నారము | పిరుదు | బీరువు |
| తంపర | దినము | నాదము | పిశాచి | బీద్దము |
| తాబేలు | దిటము | నిలుచు | పీచము | బుడుత |
| తామర | ధీరము | నివాసి | పులుగు | బూరుగు |
| తిరుగు | దురద | నీరము | పురుగు | బెదరు |

| | | | | |
|---|---|---|---|---|
| బెడద | రాత్రము | శీకర | సైరంధ్రి | హర్షిణి |
| బోనము | లవము | శుభము | సొగసు | హరితం |
| భయము | లావణ్య | శుశ్రూష | సొబగు | హరిణి |
| భామిని | లీలలు | శూలము | సొలసి | హరుడు |
| భుజము | వజ్రము | శెనగ | సొంతము | హతుడు |
| మనస్సు | వరద | శెలవు | సోగ్గాడు | హాలము |
| మమత | వాయసం | శైలజ | సోమము | హారము |
| మరణం | వార్ధక్యం | సరస్సు | సోయగం | హాసము |
| మాధవ | వారధి | సలిలం | సౌరాష్ట్రం | హిరణ్యం |
| మాన్యము | విడచి | సారంగి | సౌలభ్యం | హితము |
| మిరప | విధవ | సాధన | సౌందర్యం | హుంకారం |
| మిత్రుడు | విమల | సామము | సంకటం | హృదయం |
| మీసము | విపుల | సిరులు | సంకటి | హేమంతం |
| ముదము | వీరుడు | సీసము | సందర్భం | హేమము |
| మృగము | వృక్షము | సుతుడు | సంతృప్తి | హైందవ |
| మేలము | వెడలు | సుమము | సంధులు | క్షయము |
| మొరటు | వేదన | సూర్యుడు | సంపద | క్షాత్రము |
| మోసము | వైష్ణవి | సూతుడు | సంస్కారం | క్షీణము |
| యక్షిణి | వంకలు | సూకరం | సంసారం | క్షుద్రము |
| యామిని | వందలు | సెగలు | సంతానం | క్షేమము |
| రసము | శంకర | సేద్యము | హలము | క్షేత్రము |
| రథము | శాతము | సైకతం | హర్షిత | క్షౌరము |
| రాక్షసి | శిరము | సైన్యము | హర్షుడు | |

# నాలుగు అక్షరముల పేర్లు

| | | | | |
|---|---|---|---|---|
| అమృతము | ఔదార్యట | కృతఘ్నత | గాంధర్వము | చిన్మయము |
| అంకితము | ఓలగము | కృతజ్ఞత | గిరీశుడు | చిద్రూపము |
| ఆలంబన | ఔగాదను | కేరటము | గిరిరాజు | చీనాంబరం |
| ఆనందము | అంతరము | కేయూరము | గీర్వాణము | చుబుకము |
| ఇందిరేశు | అందలము | కేకవేయు | గీతామృతం | చురచుర |
| ఇక్ష్వాకులు | కందకము | కైవారము | గుణింతము | చూషణము |
| ఈశ్వరుడు | కందువగు | కైరవము | గుణికము | చెలువము |
| ఈశానుడు | కంకణము | కొండపల్లి | గోకర్ణము | చెదరుట |
| ఉత్ఫల్లము | కనకము | కొక్కిరాయి | గోపాలుడు | చెవినొప్పి |
| ఉంగరము | కరణము | కొరవడి | గోష్పాదము | చేమంతులు |
| ఉత్సవము | కవనము | కొమరుడు | గౌరవము | చేరుచుక్క |
| ఉరగము | కామితము | కోవిదుడు | ఘస్మరుడు | చొప్పదంటు |
| ఊరుపేరు | కాంచనము | కోటిపల్లి | ఘటోత్కచ | చోద్యమంత |
| ఊతకోరు | కిరాతుడు | కోరికలు | ఘాతకము | జంతికలు |
| ఋత్విజుడు | కిరీటము | కౌస్తుభము | ఘీంకారము | జంభభేది |
| ఋత్విక్కులు | కీర్తనము | ఖండనము | చందమామ | జరజర |
| ఎగురుట | కీకారణ్యం | ఖచరము | చకితము | జయజయ |
| ఎదనిండ | కీటకము | ఖనిత్రము | చరితము | జాతకము |
| ఏకాంతము | కుత్సితము | ఖేచరుడు | చకితము | జాలిదయ |
| ఏనుగులు | కుతూహలం | గణితము | చాతకము | జాలరులు |
| ఐహికము | కూరగాయ | గమనము | చాదస్తము | జాగృతము |
| ఒడిగట్టు | కూజితము | గారాబము | చింతామణి | జిగిబిగి |
| ఒట్టిగొడ్డు | కృపాణము | గాంభీర్యము | చిదంబరం | జీవితము |

| | | | | |
|---|---|---|---|---|
| జీవనము | తేలుకొండి | దేశాటన | నాదామృతం | పాదచారి |
| జీలకర్ర | తేనెవాక | దేవదారు | నాకబలి | పిరుదులు |
| జూదగాడు | తేరుకున్న | దైవత్వము | నిగనిగ | పిడికిలి |
| జొంపములు | తేరునెక్కి | దొరగారు | నిటలాక్ష | పీతనము |
| జొన్నన్నము | తైతక్కలు | దోసకాయ | నిత్యసేవ | పుట్టుమచ్చ |
| జోహారులు | తొలిపదం | దోహదము | నీరజాక్ష | పులకరం |
| టపాకాయ | తొడిగిన | దౌహిత్రుడు | నీరాటము | పుణ్యాత్ములు |
| టిట్టిభము | తొడిమవు | దంతములు | నీరవము | పూరేకలు |
| టెంకాయలు | తోటకూర | దండములు | నురగలు | పూలచెండు |
| తల్లిదండ్రి | తోయజాక్షి | దండనము | నూపురము | పూజార్హము |
| తమలము | తందనాన | ధమనుడు | నూర్జహాను | పేదవాడు |
| తగవులు | దరిదాపు | ధామగ్రంధి | నృపాలుడు | పేదరైతు |
| తరళము | దయామయి | ధీవరుడు | నెరవేరు | పైత్యకారి |
| తారావతి | దానకర్ణ | ధూసరము | నేపాళము | పొట్లకాయ |
| తాపసులు | ధాశరధి | ధృతరాష్ట్ర | నైషధము | పొదచాటు |
| తిలోత్తమ | దాతృత్వము | నందనము | నొసలివి | పోటుగాడు |
| తిరుగుడు | దివిజులు | నకులుడు | నోరుచూపు | పోకాలము |
| తిప్పతీగ | దివిభువి | నకులము | నోటిమాట | పౌలస్త్యుడు |
| తీయదనం | దీనారము | నవనీతం | నోటుతెచ్చి | ఫలకము |
| తీరికలు | దీనాలాపం | నరమేధ | పతంజలి | ఫలితము |
| తుంబురుడు | దుష్ఫలితం | నయాగర | పవిత్రత | బంధనము |
| తురగము | దుర్మార్గము | నవవిధ | పవనుడు | బలపము |
| తూణీరము | దుర్మార్గుడు | నటరాజు | పదుగురు | బలగము |
| తెలిమల | దూదేకులు | నాదస్వరం | పావనము | బావినీరు |
| తెరవిడి | దూరాభారం | నాట్యాచార్య | పాండవులు | బాధితులు |
| తెల్లదనం | దృక్కోణము | నాసాగ్రము | పాంచాలము | బిచ్చగాడు |

| | | | | |
|---|---|---|---|---|
| బీభత్సుడు | మరణము | రాక్షసుడు | వాదనలు | షణ్ముఖుడు |
| బీరకాయ | మాతంగము | రాకాంతలు | వాయసము | సంకటము |
| బురుకడు | మాధుర్యము | రాజసము | విపరీతం | సతతము |
| బూచిగాడు | మినుములు | రిక్కధారి | విష్ణుమూర్తి | సాధనము |
| బృహన్నత | మిధునము | రివ్వనవ్వు | విలాసము | సామర్థ్యము |
| బేసికంటి | మీసములు | రిక్తహస్త | విజ్ఞాపన | సిద్ధాంతము |
| బేధభావం | మీలనము | రుధిరము | వీరాంగము | సీమంతము |
| బొక్కసము | ముక్కరము | రూపవతి | వృషభము | సీమదొర |
| బోధకుడు | మురజము | రెల్లుపువ్వు | వృషాధిప | సుపుత్రుడు |
| భగవతి | ముత్యములు | రేచీకటి | వెనకయ్య | సూక్ష్మమైన |
| భవనము | మృదంగము | రైతేరాజు | వేంకటేశ | సూతముని |
| భావజుడు | మృణాళము | రోమంథము | వేదార్థము | సృగాలము |
| భాస్కరుడు | మేకపోతు | రౌతుకొద్ది | వైష్ణవుడు | సెలయేరు |
| భిరుదము | మైదానము | లంచగాడు | వైకుంఠము | సేనాపతి |
| భీకరము | మొక్కపడు | లంగరెత్తి | శంతనుడు | సైంధవుడు |
| భువనము | మోహనుడు | లవణము | శంఖారావం | సొరకాయ |
| భుజకీర్తి | మోసములు | లలితము | శరణము | సొంటికొమ్ము |
| భూమిజుడు | మౌక్తికము | లాలసము | శయనము | సోదరులు |
| భూపాలుడు | మంతనము | లావణ్యము | శార్దూలము | సోమయాజి |
| భేతాళుడు | యమభటులు | లొట్టిపిట్ట | శీతోష్ణము | సౌందర్యము |
| భోషాణము | యమబాధ | లోకమాత | శుశ్రూషలు | సౌకుమార్యం |
| భ్రమరము | యవనిక | లోహిదాస | శుభలగ్నం | సౌరభము |
| మందరము | యామవతి | లౌక్యముగ | శూర్పణఖ | హాయనము |
| మందారము | యోజనము | వందనము | శృంగారము | హాలికులు |
| మందసము | రజకుడు | వదనము | షడంగము | హేమంతము |
| మధనము | రసమయి | వరుణుడు | షడ్జమము | హైందవాళి |

# సాధన వత్తులు

| | | | | |
|---|---|---|---|---|
| అక్క | అట్ట | అత్త | తగ్గు | వచ్చు |
| లక్క | మట్ట | నత్త | వెన్ను | హెచ్చు |
| పిక్క | రెట్ట | దుత్త | పన్ను | పెచ్చు |
| రెక్క | పట్ట | క్రొత్త | కన్ను | కక్ష్య |
| ముక్క | పిట్ట | అడ్డు | దున్ను | లక్ష్య |
| చుక్క | బుట్ట | గడ్డు | జున్ను | భక్ష్య |
| వక్క | గిట్ట | ఒడ్డు | మొద్దు | అక్ష |
| అమ్మ | అన్న | దుడ్డు | పద్దు | భిక్ష |
| బొమ్మ | నిన్న | సృష్టి | కద్దు | రక్ష |
| రెమ్మ | కన్న | దృష్టి | వద్దు | కక్ష |
| దిమ్మ | సున్న | షష్టి | చక్ర | లక్ష |
| చెమ్మ | మొన్న | అష్ట | వక్ర | హర్ష |
| నిమ్మ | జబ్బు | నష్ట | నక్ర | వర్ష |
| అయ్యు | మబ్బు | దుష్ట | పిత్రు | ఆర్ష |
| గొయ్యు | డబ్బు | కష్ట | మాతృ | సెజ్జ |
| నుయ్యు | గబ్బు | అగ్గి | భ్రాతృ | బొజ్జ |
| వెయ్యు | సబ్బు | బుగ్గి | అల్ప | ఒజ్జ |
| రొయ్యు | నిబ్బు | తగ్గి | స్వల్ప | లజ్జ |
| అప్ప | కల్ల | ఒగ్గి | కల్ప | అవ్వ |
| పప్ప | మెల్ల | దగ్గి | శిల్ప | గవ్వ |
| చెప్ప | మొల్ల | దగ్గు | తల్ప | మువ్వ |
| కప్ప | వెల్ల | రగ్గు | అచ్చు | రవ్వ |
| ఒప్ప | నల్ల | ఒగ్గు | మెచ్చు | రక్తము |
| తప్ప | గొల్ల | మగ్గు | రెచ్చు | యత్నము |

| | | | | |
|---|---|---|---|---|
| పల్లెలు | నిర్ఝరి | స్నిగ్ధము | ఉద్యాపన | అర్ధము |
| వర్ణము | మత్స్యము | ముగ్ధము | ఉద్యోగము | అరణ్యము |
| పర్వము | కూర్మము | దగ్ధము | ఉధృతము | అర్హము |
| సద్భవము | దుష్టుడు | దుగ్ధము | నిర్గమము | అర్హత |
| సత్కృప | వెల్లువ | అబ్ధి | సందిగ్ధము | నిష్ఫలము |
| సంస్కృతి | కళ్యాణి | క్షీరాబ్ధి | నిష్కల్మషము | నిర్జీవము |
| సంస్కారము | వేదాద్రి | శతాబ్ధి | నిర్మలత్వము | షట్పదులు |
| సజ్జనులు | వేల్పు | రత్నము | నిశ్చలము | విస్ఫోటనము |
| సర్పము | వృషభము | కర్ణము | ఆశ్చర్యము | ఋత్విక్కులు |
| తత్కాలము | వృత్తము | చక్రము | పశ్చాత్తాపము | ఋత్విజులు |
| సత్కవి | అదృష్టము | చతుష్టయము | పశ్చిమాద్రి | నల్దెసలు |
| ఉత్పల్లము | అసభ్యము | చపలత్వము | తూర్పుదిక్కు | నర్మద |
| నిత్యము | అస్తమయము | చత్వారము | హ్లాదము | మర్మము |
| నిర్ణయము | స్వస్తి | ఉద్వాసన | | |

## వాక్యములు చదువుట

1.మంచి అన్నది పెంచవలెను.
2.ఒకరిని మించిన వారొకరు
3.శరత్కాలమున వెన్నెల అధికము.
4.చెడ్డపనులు చేయరాదు.
5.ఒకరికి పెట్టి మనము తినవలయును.
6.కోటి విద్యలు కూటి కొరకే.
7.నిత్యము దేవుని ఆరాధించవలెను.
8.రోజూ ప్రొద్దుననే నిద్దుర లేవవలెను.
9.మన ఆరోగ్యాన్ని మనం కాపాడుకొనవలెను.
10.నవ్వు, పదుగురిని నవ్వించు.
11.పరుల పంచ చేరుట హానికరము.
12.విద్యను మించిన ధనం లేదు.
13.అనువుగాని చోట అధికులమనరాదు.
14.సర్వేజనా సుఖినోభవంతు.
15.సూర్యచంద్రులున్నంతవరకు సృష్టి జరుగును.
16. బ్రహ్మ వ్రాసిన రాత ఎవ్వరు తప్పించగలరు?
17. కుల మతమను బేధము విడనాడవలెను.
18. పొగడరా నీతల్లి భూమి భారతిని.
19. జననీ జన్మభూమిశ్చ స్వర్గా దపి గరీయసి.
20. అహంకారంపతనమునకు మూలకారణము.

# సామెతలు

1. ఇంటి దొంగను ఈశ్వరుడు కూడా పట్టలేడు,
2. అనువుగాని చోట అధికులమనరాదు,
3. అన్నీ వున్న విస్తరాకు అణిగి మణిగి ఉంటుంది.
4. మింగడానికి మెతుకులేదు, మీసాలకు సంపంగినూనె!
5. కలసి వచ్చే కాలం వస్తే నడిచి వచ్చే కొడుకు పుడతాడు.
6. కొరక బోతే కొరివి, మింగబోతే అడివి.
7. ముందు నుయ్యి, వెనుక గొయ్యి.
8. ఏమీలేని విస్తరాకు ఎగిరెగిరి పడుతుంది.
9. కూపస్థ మండూకం (బావిలోని కప్ప)
10. చల్లకొచ్చి ముందాచినట్టు.
11. పానకంలో పుడకలా!
12. నవ్వు నాలుగు విధాల చేటు.
13. పోరునష్టం - పొందులాభం.
14. ఎంత చెట్టుకు అంతగాలి.
15. ఏ ఎండకాగొడుగు.
16. మెరిసే దంతా బంగారం కాదు.
17. పరుల సొమ్ము పాముతో సమానం.
18. చాదస్తపు మొగుడు చెబితే వినడు.
19. రౌతుకొద్ది గుఱ్ఱం.
20. కుక్కకాటుకు చెప్పదెబ్బ.
21. పిట్ట కొంచెం కూతఘనం.
22. పొట్టి వానికి పుట్టెడు బుద్ధులు.
23. కాకి పిల్ల కాకికి ముద్దు.
24. కోటి విద్యలు కూటి కొరకే.
25. చెరపకురా చెడేవు.
26. మొక్కై వంగనిది మ్రానై వంగునా!
27. చెప్పేవారికి వినేవారులోకువ.
28. రాజుల సొమ్ము రాళ్ళపాలు.
29. అభ్యాసము కూసు విద్య.
30. ఆదిలోనే హంస పాదు.
31. గతిలేనమ్మకు గంజే పానకం.
32. గుఱ్ఱం గ్రుడ్డిదైనా దాణాకేం తక్కువ లేదు.



33. గోరుచుట్టు మీద రోకటి పోటు.
34. పృష్టతాడనా దంతభంగః
35. దూరపు కొండలు నునుపు.
36. తాతకు దగ్గులు నేర్పుటయా!
37. తాను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు
38. మూర్ఖుల మనసు రంజింపరాదు.
39. రాజు తలచుకుంటే దెబ్బలకు కొరవా!
40. చంద్రుని కొక నూలు పోగు.



## స్వభావములు

1. మనిషికి నిలువెల్లా విషముండును.
2. పాముకి విషము తలయందుండును.
3. గాడిదకు గంధపు చెక్కల వాసన తెలియదు.
4. క్రొత్తొక వింత పాతొక రోత.
5. మనము ఇతరులకు మంచి చేసిన మంచి జరుగును.
6. శత్రువుకైననూ ఆపద తలపెట్టరాదు.
7. నమ్మించి మోసము చేయరాదు.
8. క్రొత్త నీరొస్తే పాత నీరు కొట్టుకు పోతుంది.
9. ముందు వచ్చిన చెవులు కన్నా! వెనుక వచ్చిన కొమ్ములు వాడి.
10. నిండుకుండ తొణకదు.
11. పరోపకారార్థమిదం శరీరం.
12. లేగలకు చేపనిదే ఆవులు పాలీయవు.
13. దైవ ధ్యానమును మరచి పోరాదు.
14. ఎవరు తీసిన గోతిలో వారే పడుదురు.
15. కాగల కార్యమును గంధర్వులే తీర్చెదరు.
16. ఆత్ర గాడికి బుద్ధిమట్టం.
17. చేసిన మేలు మరువరాదు.
18. తిన్నయింటి వాసాలు లెక్కించరాదు.
19. పెట్టే చేయికి కొట్టే అధికారం ఉంటుంది.
20. వినయం వల్ల ఏ పనినైనా సాధించవచ్చు.
21. దైవాన్ని నమ్మి మోసపోయినవారు ఎవ్వరూ లేరు.
22. నీ నమ్మకమే నిన్ను నిలబెడుతుంది.
23. నవ్వినా నాపచేనే పండుతుంది.
24. పరులపై నింద మోపుట మంచిది కాదు.
25. తలదించుకునే పని ఎప్పటికీ చేయరాదు.



# పొడుపు కథలు

పైనొక పలక
క్రిందొక పలక
పలకలనడుమ
మెలికల పాము



మాతాత పొలములో
మంచిఎద్దుల మంద
ఎద్దులు పండుకొన
పగ్గాలు మేయును



అమ్మ అంటే
దగ్గరకు వస్తుంది
నాన్న అంటే
దూరం వెళుతుంది



కిటకిట తలుపులు కిటారు తలుపులు
ఎప్పుడు తెరచిన చప్పుడు కావు



గోడమీద బొమ్మ
గొలుసుల బొమ్మ
వచ్చే పోయే వారికి వడ్డించు బొమ్మ



చింకిరి చింకిరి
గుడ్డలు
రత్నాలలాంటి
బిడ్డలు



అడివిలో పుట్టింది
అడివిలో పెరిగింది
మా యింటికొచ్చింది
తైతక్కలాడింది



ఆకాశంలో అరవైగదులు
గదిగదికి సిపాయి ఒకడు
సిపాయికొకనికి
తుపాకి ఒకటి



చెయ్యని కుండ
పొయ్యని నీళ్లు
వెయ్యని సున్నం
తీయ్యగ నుండు



పొట్టివాడికి
పుట్టెడు
అంగీలు



టక్కునిక్కులసొక్కు ముక్కుమీదికెక్కు
చెవుల సందున నిక్కు జారిందంటే పటుక్కు



తండ్రి గరగర
తల్లి పీచుపీచు
బిడ్డలు రత్నమాణిక్యాలు
మనుమలు బొమ్మరాళ్లు



# నీతి పద్యాలు

ఆ॥ రాజు చేతి కత్తి రక్తంబు వర్షించు
సుకవి చేతి కలము సుధలు గురియు
ఆతడేలగలుగు యావత్ప్రపంచంబు
నీతడేలగలుగు ఇహము పరము.

భావం : రాజుల యొక్క చేతి కత్తి రక్తాన్ని వర్షింపజేస్తుంది. మంచికవి చేతి కలము అమృత పదాలను విరచింపజేస్తుంది. రాజు యావత్ప్రపంచం మొత్తాన్ని ఏలగలడు. కానీ కవి ఇహపరలోకాలు రెండింటినీ ఏలగలడు.

కం॥ హరియను రెండక్షరములు
హరియించును పాతకంబులంబుజనాభా!
హరి! నీ నామ మహత్త్వము
హరి హరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా!

భావం : హరిఅనగా (విష్ణువు) రెండుఅక్షరములు. ఈరెండక్షరములు పాతకములు అనగాపాపాలనుతొలగించును. పద్మమునాభియందుకలవాడా! ఓహరీ! నీయొక్క నామముగొప్పతనంపొగడగా నిన్ను కీర్తించగా మా తరమా! వర్ణించలేనిది ఓ కృష్ణా!

ఆ॥ నీతిలేని వాని నిరసించు జగమెల్ల
నీతిశాలికెపుడు నెగడు లేదు
నీతిశాలినెపుడు నీతియే కాపాడు
కుజను బారి నుంచి కుప్పసామి

భావం : ఈ జగము నీతిలేని వానిని చూసి నిరసిస్తుంది. నీతి మంతునికి ఎప్పుడూ ఇబ్బందిలేదు. నీతిశాలిని ఎల్లప్పుడు నీతియే కాపాడుతుంది. కుజనులు అనగా కుత్సిత జనుల నుండి నీతిశాలిని నీతి కాపాడునని భావము.

కం॥ వినదగునెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్
కనికల్లనిజము దెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!

భావం : ఎవ్వరు ఏవిషయాన్ని గూర్చివివరించినా ముందు ఆవిషయమునువిన వలయును. విన్నవెంటనే ఆవేశపడకుండా దానినిగూర్చిఆలోచించి,విన్నదానిలో సత్యమెంతో, అసత్యమెంతో తెలుసుకున్నవాడే నీతిమంతుడు ఈ ధరణిలోన.

కం॥ సిలువపయి చంపి ఏసుని
బలిగొని రల సోక్రటీసు భయద విషానన్
నిలువున కూల్చిరి గాంధిని
ఎలుకను దినుటొకటి హింస ఎట్లగు పిల్లీ!

**భావం :** సిలువ వేయటం చేత ఏసు మరణించెను. సోక్రటీసును విషమిచ్చి మరణింప జేసెను. గాంధీని నిలువున కూల్చెను. ఎలుకను చంపి పిల్లి తినుట ఒక్కటే హింస ఎట్లా అవుతుంది?

ఆ॥ మేడిపండు చూడ మేలిమై యుండును
పొట్ట విప్పి చూడ పురుగులుండు
పిఱికి వాని మదిని బింక మీలాగురా
విశ్వదాభిరామ! వినురవేమ!

**భావం :** మేడిపండు పైకి చూడటానికి ఎంతో మేలైనదిగా కనిపిస్తుంది. ఆ మేడిపండును చీల్చి చూస్తే లోపల పురుగులు కనిపిస్తాయి. పిఱికి వాని మనస్సుకూడా ఈ విధముగా బింకమై ఉంటుంది. అనగా పిరికివాడు పైకి గాంభీర్యాన్ని ప్రకటించినా లోపల భయపడుతుంటాడని భావము.

ఆ॥ నీళ్ళలోని చేప నెరిమాంశమాశకు
గాలమందు చిక్కి కూలినట్లు
ఆశపుట్టి మనుజుడారీతి చెడిపోవు
విశ్వదాభిరామ వినురవేమ!

**భావం :** నీళ్ళలో ఉన్న చేప ఎరయొక్క మాంసానికి ఆశపడి గాలానికి చిక్కి తన ప్రాణాన్ని కోల్పోతుంది. అలాగే అత్యాశ వల్ల మనుష్యుడు కూడా ఆవిధముగానే చెడిపోతాడని భావము.

కం॥ తలనుండు విషము ఫణికిని
వెలయంగాతోకనుండు వృశ్చికమునకున్
తలతోక యనక యుండును
ఖలునకునిలువెల్లవిషముగదరా సుమతీ!

**భావం :** పాముకు విషం తలలో ఉంటుంది. తేలునకు విషము తోకలో ఉంటుంది. దుర్మార్గునికి తల, తోక అనుబేధం లేకుండా నిలువెల్లా విషము ఉంటుందని భావము.

# ప్రకృతి - వికృతి

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రకృతి | - | వికృతి | ముత్యము | - | ముత్తెము |
| పుత్రుడు | - | బొట్టి | ఆకటి | - | ఆకలి |
| స్నానము | - | తానము | స్త్రీ | - | ఇంతి |
| నిక్కము | - | నిజము | ప్రాణము | - | పానము |
| రాక్షసుడు | - | రక్కసుడు | సత్యము | - | సత్తెము |
| ద్రవ్యము | - | డబ్బు | కష్టము | - | కస్తి |
| వృద్ధి | - | వడ్డి | ప్రేమ | - | పేర్మి, ప్రేముడి |
| దైవము | - | దెయ్యము | హృదయము | - | ఎద, ఎడద |
| సంధ్య | - | సందె | న్యాయము | - | నాయము |
| కవిత | - | కైత | విజ్ఞానము | - | విన్నాణము |
| కవి | - | కయి | ఆజ్ఞ | - | ఆన |
| నిముషము | - | నిముసము | సర్పము | - | సప్పము |
| యాత్ర | - | జాతర | మృగము | - | మెకము |
| ప్రయాణము | - | పయనము | ముఖము | - | మొగము |
| బ్రహ్మ | - | బమ్మ | దృష్టి | - | దిష్టి |
| అంబ | - | అమ్మ | జీవితము | - | జీతము |
| కులము | - | కొలము | పుష్పము | - | పువ్వు |
| ఆకాశము | - | అకసము | మృత్తిక | - | మట్టి |
| సముద్రము | - | సంద్రము | గర్భము | - | కడుపు |
| విష్ణువు | - | వెన్నుడు | స్తంభము | - | కంబము |
| కృష్ణుడు | - | కన్నడు | తర్కారి | - | తక్కెడ |
| వినాయకుడు | - | వెనకయ్య | కుఠారము | - | గొడ్డలి |
| లక్ష్మి | - | లచ్చి | వేత్రము | - | బెత్తము |
| ధాత్రి | - | దాది | ఉపాధ్యాయుడు | - | ఒజ్జ |
| సహాయము | - | సాయము | కుడ్యము | - | గోడ |
| గుణము | - | గొనము | జ్యోతి | - | జోతి |
| నీరు | - | నీరము | గృహము | - | గీము |
| చంద్రుడు | - | చందురుడు | ఆహారము | - | ఓగిరము |
| రక్తము | - | రకతము | దిశ | - | దెస |

| | | | | | |
|---|---|---|---|---|---|
| అగ్ని | - | అగ్గి | విముక్తి | - | విడుగర |
| ఖనిత్రము | - | గునపము | సంతోషము | - | సంతసము |
| ముకుళము | - | మొగ్గ | మూలిక | - | మొక్క |
| రాశి | - | రాసి | మల్లె | - | మల్లి |
| కరశాణ | - | కరసాన | పశువు | - | పసువు, పసరము |
| మేధస్ | - | మెదడు | యవ్వనము | - | జవ్వనము |
| స్వామ్ | - | సొమ్ము | చరిత్ర | - | చరిత |
| కాచము | - | గాజు | పర్వము | - | పబ్బము |
| శకటము | - | చెకడా | రాజు | - | రేడు |
| భస్మము | - | బస్మము | విద్య | - | విద్దె |
| భీతి | - | బీతు | పుస్తకము | - | పొత్తము |
| పుండ్రమ్ | - | బొట్టు | శ్రీ | - | సిరి |
| తీరము | - | దరి | కార్యము | - | కర్జము |
| పత్రము | - | పత్రి | శాస్త్రము | - | చట్టము |
| కైరవము | - | కలువ | పుణ్యము | - | పున్నెము |
| శిరస్ | - | సిరసు | చోద్యము | - | సోద్దెము |
| చేష్ట | - | చేత | రాత్రి | - | రాతిరి |
| దృఢము | - | దిటము | దీపము | - | దివ్వె |
| శిఖ | - | సిగ | దుఃఖము | - | దూకలి |
| వంశము | - | వంగడము | నిద్ర | - | నిదుర |
| విద్వరము | - | విద్దూరము | పదిలము | - | భద్రము |
| కస్తూరీ | - | కస్తురి | కావ్యము | - | కబ్బము |
| అమావాస్య | - | అమాస | పురము | - | ప్రోలు |
| స్వాతంత్ర్యము | - | సొంతము | ప్రాంతము | - | పొంత |
| శుచి | - | చిచ్చు | ముగ్ధ | - | ముగుద |
| రాజ్ఞి | - | రాణి | అక్షరము | - | అక్కరము |
| యువతి | - | ఉవిద | సాక్షి | - | సాకిరి |
| ప్రాకారము | - | ప్రహరి | స్నేహము | - | నెయ్యము |
| ప్రజ | - | పజ | భూమి | - | బూమి |
| ప్రకృతి | - | వికృతి | కన్య | - | కన్నె |
| ముక్తి | - | ముగితి | ఆశ్చర్యము | - | అచ్చెరువు |

# చదువుటకు గుర్తులు

చదువుటకుగాని, వ్రాయుటకుగాని కొన్ని అక్షరములు కలిపి ఒకమాటగాను, కొన్ని మాటలు కలిపి ఒక పంక్తిగాను, కొన్ని పంక్తులు కలిపి ఒకపేరాగాను, కొన్ని పేరాలు కలిపి ఒకపాఠముగాను ఏర్పడును.

భాషకు కొన్నిసంజ్ఞలుకలవు. అవి ముఖ్యముగా గుర్తుంచుకొన వలెను. ఇందులో ముఖ్యముగా ఎక్కడ పూర్తిగా ఆపవలెను, ఎక్కడ ఆపి మరల చదువవలెను, అనే గుర్తులు తెలియనియెడల చదివిననూ వ్రాసిననూ పూర్తి భావం రాదు. అందుచే ఈ గుర్తులు ముఖ్యావసరము.

1. , **కామా**: చదువునపుడు నిలుపవలసిన గుర్తుని గ్రహించవలెను.

2 • **ఫుల్‌స్టాపు**: అనగాచదువునపుడు ఇక్కడనిలిపి, అంతవరకుగల భాగమును అర్థము చేసుకొనవలెను.

3. ; **సెమికోలన్**: ఫుల్‌స్టాపుకు బదులు ఉంచదగినది.

4. ? **ప్రశ్నార్థకం**: సమాధానము కోరబడుచున్నది.

5. ! **ఆశ్చర్యార్థకము**: ఆశ్చర్యకరమగు మాటకు గుర్తు.

6. " " **అనువాద చిహ్నములు**: ఒకరు చెప్పిన మాటలు తెలుపుటకు గుర్తు.

7. :- **కోలన్‌డేష్**: అనగాఅతిముఖ్యమైనవి. చెప్పబోవు విషయము లకు సందర్భపూర్వకముగా వాడు గుర్తు.

8. — **డేష్**: అనగా ఖాళీ అని అర్థము.

9. ( ) **బ్రాకెట్లు**: అనగా కుండలీకరణములు, కుండలీకరణములు కొన్నిముఖ్యార్థములను తమలో దాచియుంచుకొనును.

# పాత మాటలు - క్రొత్త అర్థములు

## పురాణ పురుషులు - వారి స్వభావ వివరములు

ప్రమథగణాధిపతి :- విఘ్నేశ్వరుడు, శివుని కుమారుడు, ఆది పూజ్యుడు

శ్రీరాముడు :- రఘువంశపురాజు. త్రేతాయుగమున రాక్షసులను సంహరించి మానవులను కాపాడెను.

హనుమంతుడు :- అంజనీసుతుడు, వాయు దేవుని వరమున బుట్టిన వాడు,చిరంజీవి,నవవ్యాకరణపండితుడు శ్రీరామ కార్యమునకు తోడ్పడినవాడు మహాగాయకుడు, ఉత్తమ భక్తుడు.

జాంబవంతుడు :- బ్రహ్మదేవుని కుమారుడు, హరిభక్తుడు, చిరంజీవి.

శ్రీకృష్ణుడు :- శ్రీమహావిష్ణుని అవతారము, మహాశక్తియుక్తులు గల రాజకీయ దురంధరుడు. అర్జునునికిగీతనుబోధించినవాడు.

అర్జునుడు :- పాండవ మధ్యముడు. యుద్ధరంగమున అపజయమెరుంగనివాడు.రెండుచేతులతోయుద్ధంచేయుగలనరోత్తముడు.

ధర్మరాజు :- పాండురాజు పెద్దకొడుకు, ధర్మాత్ముడు, ధర్మమును బాగుగా వెరిగినవాడు. జూదమందాసక్తి కలవాడు.

కర్ణుడు :- మహాదాత, కుంతీదేవి కన్యగా నున్నపుడు సూర్యుని వలనపుట్టినవాడు, పాండవులఅగ్రజుడు- యుద్ధమునందు మహావీరుడు

భీముడు :- పంచ పాండవులలో రెండవవాడు. మహాబలశాలి, వేయిఏనుగులబలముగలవాడు, కోపస్వభావంకలవాడు గదా యుద్ధములందు ఆతేరినవాడు, మహావీరుడు.

పాండురాజు :- పుట్టు పాండురోగి.

ధృతరాష్ట్రుడు :- పుట్టంధుడు, హస్తినాపుర రాజు.

శకుని :- దుర్యోధనుని మేనమామ. కౌరవ వంశ నాశనకారి, జూదగాడు, మోసగాడు.

కంసుడు :- ఉగ్రసేనునికుమారుడు. అతిదుర్మార్గుడు,కృష్ణ విరోధి.

మన్మథుడు :- అతిశృంగారపురుషుడు,శ్రీకృష్ణునికుమారుడు, మంచి రూపంగలవాడు,పూలబాణాలుఆయుధంగా గలవాడు.

హరిశ్చంద్రుడు :- ఇక్ష్వాకు వంశపురాజు, నవఖండ మండలాధీశుడు, సత్యము కొరకు (భార్యనుసైతం)సర్వమూ త్యజించినవాడు.

| | | |
|---|---|---|
| కుబేరుడు | :- | యక్షరాజు,అతి ధనశాలి ఉత్తర దిక్కునకధిపతి. |
| బృహస్పతి | :- | దేవతల గురువు, మిక్కిలి బుద్ధిమంతుడు. |
| బలిచక్రవర్తి | :- | పాతాళలోక ప్రభువు అతి ధనవంతుడు, మహాదాత. |
| రావణుడు | :- | శివభక్తుడు, ముల్లోకములను జయించినవాడు,మహా యోధుడు,పదితలలుగలవాడు,నవవ్యాకరణపండితుడు. |
| కుంభకర్ణుడు | :- | రావణునిసోదరుడు, అమిత ఆహారము తినువాడు ఎప్పుడూ నిద్రించును. |
| మారీచుడు | :- | రావణుని హితుడు, రాక్షసుడు, మాయావి. |
| ఇంద్రజిత్తు | :- | రావణునికుమారుడు, మాయావి, తంత్రములచే ఇంద్రుని జయించినవాడు. |
| మార్కండేయుడు | :- | మృకండు మహాముని కుమారుడు శివ వరప్రసాది. మృత్యువును జయించిన మహావీరుడు. |
| మాంధాతృచక్రవర్తి | :- | జగద్విదితుడు,సమస్తక్రతువులను జేసెను. వేయిఅశ్వ మేధ యాగముల నొనరించెను. ధర్మశీలుడు.ఇక్ష్వాకు కులోద్భవుడు.ఈతనికిదేవతలు"మాంధాత" అని పేరుపెట్టిరి. |
| నలుడు | :- | షట్చక్రవర్తులలోనొకడు,నిషధేశుడు,దమయంతిని వివాహమాడెను. |
| వైవస్వతమనువు | :- | 14గురుమనువులలో ఏడవవాడు.ప్రస్తుతము మనకు ఆయన పేరుతో సైవస్తవ మన్వంతరము జరుగుచున్నది. |
| బ్రహ్మదేవుడు | :- | సృష్టికర్త, త్రిమూర్తులందు ప్రథముడు. |
| యమధర్మరాజు | :- | ధర్మమునెరింగిపాలించువాడు.యమలోకాదీశుడు కాలపాశం ఆయుధముగాగలవాడు.దక్షిణదిక్కున కధిపతి. |
| చిత్రగుప్తుడు | :- | యముని వద్ద జీవుల పాపపుణ్యములు గణించువాడు. |
| విదురుడు | :- | కౌరవుల మంత్రి, నీతి బోధించువాడు. |
| దౌమ్యుడు | :- | పాండవులకు పురోహితుడు. |
| సైంధవుడు | :- | దుర్యోధనుని బావమరిది. శివభక్తుడు. వృక్షదళజుని కుమారుడు. సింధు దేశపురాజు, అర్జునునిచే పరాభవమొందినవాడు |
| అగ్నిహోత్రుడు | :- | పరిశుద్ధుడు, సర్వభక్షకుడు, పంచ భూతములలో నొకడు. |
| నారదుడు | :- | బ్రహ్మకొడుకు, మునులకు దివ్యజ్ఞానము నిచ్చువాడు. కలహప్రియుడు, మహాగాయకుడు, హరిభక్తుడు. |
| నలకూబరుడు | :- | కుబేరుని కుమారుడు, అందగాడు. |

దూర్వాసుడు :- ఒక మహాముని, కోపిష్ఠివాడు.

ఉత్తర కుమారుడు :- విరాటరాజు కుమారుడు, ఉత్తర గోగ్రహణములో అర్జునుని రథసారధి.

వేదవ్యాసుడు :- శ్రీహరిఅవతారమనిఅందురు. మహాతపస్వి, మహాభారతం సంస్కృతమున రచించినవాడు.

ఋష్యశృంగువుడు :- విభాండకునిపుత్రుడు. ఈతనిభార్యశాంత. ఇతడు ఎచ్చటనున్నను అచ్చట వర్షాభావముండదు.

వాల్మీకి :- రామాయణమును ప్రథమమున రచించెను. ఆదికవి.

అనూరుడు :- అనగా తొడలు లేనివాడు, సూర్యుని రథసారధి.

గరుత్మంతుడు :- అనూరునిసోదరుడు. విష్ణుభక్తుడు, పక్షి, విష్ణు వాహనము.

## పురాణ స్త్రీలు - వారి వివరాలు

లక్ష్మీదేవి :- శ్రీమహావిష్ణునిభార్య, వరముల నిచ్చునది, ధనాధీశురాలు.

పార్వతి :- శివుని భార్య, హిమవంతుని కుమార్తె.

సరస్వతి :- బ్రహ్మదేవుని భార్య, చదువులరాణి, గొప్ప అందగత్తె.

సీతాదేవి :- శ్రీరాముని భార్య, అతి రూపవతి, మహా పతివ్రత.

జగన్మోహిని :- విష్ణువు ధరించిన స్త్రీరూపము, త్రిభువన సుందరి.

కాళి :- పార్వతిఅవతారం, రౌద్రమూర్తి, భయంకరరూపిణీ.

రంభ :- ఇంద్రసభలో నాట్యమాడు అప్సర స్త్రీ, అతిరూపవతి.

శూర్పణఖ :- రావణుని చెల్లెలు, కురూపి.

మందర :- కైకేయి దాసి, తంత్రగత్తె.

కైకేయి :- దశరథ మహారాజు భార్య, అతి మూర్ఖురాలు.

మండోదరి :- రావణుని భార్య, పార్వతీ భక్తురాలు.

శబరి :- ఒక బోయస్త్రీ, శ్రీరామ భక్తురాలు.

అహల్య :- గౌతముని భార్య, అందగత్తె.

ద్రౌపది :- పాండవుల భార్య, ధీరురాలు.

పూతన :- రాక్షసస్త్రీ, దుష్టురాలు.

రుక్మిణీదేవి :- కుండిన నగరపు చక్రవర్తి భీష్మకుని పుత్రిక, శ్రీకృష్ణుని భార్య.

సత్యభామ :- సత్రాజిత్తు కుమార్తె, శ్రీకృష్ణుని అష్టమహిషులలో నొకతె, ద్రౌపది ఈమెకు పతివ్రతా ధర్మములను నేర్పెను.

సుభద్ర :- శ్రీకృష్ణునిసోదరి,అర్జునునిభార్య,బలవీరుడగు అభిమన్యుని గన్నవీరమాత.

లోపాముద్ర :- సప్త మహాఋషులలో నొకడైన అగస్త్య మహామునిభార్య, మహాపతివ్రత.

శచీదేవి :- ఇంద్రుని పట్టమహిషి.

అనసూయ :- అత్రిమహాముని ధర్మపత్ని, తన పాతివ్రత్య మహిమచే త్రిమూర్తులను పసిబిడ్డలుగా చేసి లాలించిన మహాపతివ్రత,

## వస్తువులు - వివరములు

బంగారము :- లోహములలోఅతివిలువైనది.పచ్చనిరంగుగలది.అత్యుత్తమమైనది.

వజ్రము :- నవరత్నములలో ఒకటి. దేనినయినను బేధించగలది. తెల్లని రంగు ఇంద్రుని ఆయుధము.

రత్నము :- మణి, రంగు ఎరుపు, పవిత్రమైనది.

ముత్యము :- నవరత్నములలో ఒకటి. రంగు తెలుపు. పవిత్రమైనది.

రాయి :- బండ, కదలిక లేనిది.

ఇనుము :- లోహములలోఅతి కడపటిఒకలోహం.నల్లరంగుగలది.అతిగట్టిది.

ఆకాశము :- శూన్యప్రదేశము, పంచభూతాలలో నొకటి.

సముద్రము :- సాగరము,ఉప్పుతోకూడిననీరు, అగాధమైనలోతుగలది. భయంకర స్థలము.

స్వర్గము :- పుణ్యాత్ములు నివసించెడు స్థలము. సుందర స్వప్నతీరము.

నరకము :- పాపము చేసినవారు నివసించెడు భయంకర స్థలము.

పర్వతరాజు :- కొండలలోపెద్దవాడు,తెల్లనిరంగుగలవాడు, హిమాలయం శివుడు, హనుమంతుడు నివసించు నిర్మల ప్రదేశము

విషము :- ప్రాణములను హరించు వస్తువు.

కల్పవృక్షము :- దేవతరువు, కోరినవాని నిచ్చునది.

వాయువు :- పంచభూతములలో నాల్గవది. శబ్ధము, స్పర్శ అను రెండు గుణములు గలది.

క్షీరము :- పాలు, స్వభావసిద్ధమయిన తెలుపు రంగుగలది.

అపరంజి :- చొక్కపు బంగారు, మిక్కిలి యోగ్యమైనది.

నిమ్మకాయ :- పుల్లని పండు, పచ్చనిరంగు.

నాభి :- విషము.

మన్ను :- మృత్తిక, మట్టి, భూమి యందు ఇమిడియున్నది.

## చాటువులు



కం॥ వంకాయ వంటి కూరయు
పంకజ ముఖి సీతవంటి భామా మణియున్
శంకరుని వంటి దైవము
లంకాధిపు వైరి వంటిరాజును గలడే.

కం॥ సిరిగలవానికి చెల్లును
తరుణులు పదియారు వేలు తగ పెండ్లాడన్
తిరుపెమునకిద్దరాండ్రా
పరమేశా, గంగను విడు పార్వతి చాలున్.

ఆ॥ చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళు
నావులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జ, జొన్న కూళ్ళు సర్పంబులుందేళ్ళు
పల్లెనాటి సీమ పల్లెటూళ్ళు.

కం॥ రంజనచెడి పాండవులరి
భంజను లైవిరటు గొల్వ పాల్పడి రకటా!
సంజయ విధినే మందును
కుంజర యూధంబుదోమకుత్తుక జొచ్చెన్.

కుల్లాయుంచితి, కోకసుట్టితి, మహాకూర్పా సముస్నొడ్గితిన్,
వెల్లుల్లిందిలపిష్టమున్మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగా
జల్లాయంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచుఁ చోనాడితిన్,
దల్లీ, కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా? నేను శ్రీనాథుడన్.

## ద్వంద్వ వాక్యములు

### మంచి అలవాట్లు - రోగాలను పుట్టించనివి :

శుచియైన భోజనము దినమునకు రెండుసార్లు భుజించుట, భోజనము చేసిన తరువాత కొంచెము దూరము నడచుట, స్నానపానాదులు క్రమపద్ధతిలో అనుసరించుట, సకాలంలో నిద్రించుట - ఇవ్వన్నియూ రోగాలను పుట్టించవు.

## చెడు అలవాట్లు - రోగాలను పుట్టించేవి :

అతిగా భోజనము చేయుట, మనసునందు దుఃఖపడుట, ఎక్కువగా తిరుగుట, భోజనము చేసి తదుపరి స్నానం చేయుట, మలమూత్రాదులను నిరోధించుట, నిలువవున్న పదార్థములు భుజించుట - ఇవన్నియూ రోగములను పుట్టించును.

## అవసరాలకు ఉపయోగించేవి :

ఉత్తమునివద్ద దాచిన ధనము, వయస్సులో పుట్టిన సంతానము, మంచి వానికిచేసినఉపకారం,చదువుకున్నచదువు-ఇవిఎల్లప్పుడూ ఉపయోగకరమైనవి.

## అవసరాలకు ఉపయోగపడనివి :

దుర్మార్గునివద్ద దాచిన ధనము, ముదిమిలో పుట్టిన సంతానము, చెడ్డవానికి చేసిన ఉపకారము, అప్పిచ్చిన సొమ్ము - ఇవి ఎల్లప్పుడూ నిరుపయోగమైనవి.

## ఎల్లప్పుడూ శోభించేవి :

ఉత్తములు ఉన్న ఊరు,శృతిగలరాగం,వివేకంగలతపస్సు, వైద్యుడున్న ఊరు, బుద్ధిగల చదువు,ప్రీతికలిగిన విందు, వాసనకలిగిన పువ్వు - ఇవి ఎల్లప్పుడూ శోభిస్తాయి.

## కీర్తిని కలిగించేవి :

సంపదచేత మర్యాద, దాతృత్వముచేత కీర్తి, ప్రియవాక్యముతో లోకవశ్యత, వినయంచేత గొప్పతనము, సుగుణంచేత ధనము, అధికారము చేత సామర్ధ్యము వెలుగొందుతాయి.

## అపకీర్తిని కలిగించేవి :

లోభంచేతదొంగతనము,వంచనచేత అసత్యము, గర్వముచేత అపజయము, కోపముచేత హింస, కామముచే వ్రత నాశనము, చేతకాని పని, దౌష్ట్యముచే శతృత్వము ఎల్లప్పుడూ అపకీర్తిని కలుగచేస్తాయి.

## ఉత్తములు :

కన్నతండ్రి, పోషించినవాడు, భయాన్నిపోగొట్టినవాడు, ఆపదలో ఆదుకున్నవాడు, విద్యచెప్పిన గురువు, మంచిని ఉపదేశించినవాడు ఎల్లప్పుడూ ఉత్తములుగా పరిగణించబడతారు.

## అధములు :

యజమాని దగ్గర అణుకువ లేని సేవకుడు, తనవంటివాడులేడని గర్వించేవాడు, తల్లిదండ్రులకు కష్టం కలిగించేవాడు, ఉపకారం మరచినవాడు పరిహాసము చేయువాడు ఎల్లప్పుడు అధములుగా పరిగణించబడతారు.

# సంఖ్యాబోధనలు

| | | |
|---|---|---|
| **త్రికాలములు** | : | భూతకాలము, భవిష్యత్‌కాలము, వర్తమాన కాలము. |
| **త్రిలోకములు** | : | పాతాళలోకము,మనుష్యలోకము, స్వర్గలోకము. |
| **త్రిమూర్తులు** | : | బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు |
| **త్రిమతాచార్యులు** | : | శంకర, రామానుజ, మధ్వాచార్యులు |
| **త్రిగుణములు** | : | సత్వగుణము, రజోగుణము, తమోగుణము |
| **త్రికరణములు** | : | మనస్సు, వాక్కు, క్రియ |
| **చతుర్వేదములు** | : | ఋగ్వేదం,యజుర్వేదం,సామవేదం,అధర్వణవేదం. |
| **కవిత్రయము** | : | నన్నయ, తిక్కన, ఎర్రాప్రగడ, (అను ముగ్గురు కవులు) |
| **వయోవస్థలు** | : | బాల్యము, యౌవనము, కౌమారము, వార్ధక్యము. |
| **పురుషార్ధములు** | : | ధర్మము, అర్థము, కామము, మోక్షము. |
| **పంచభూతములు** | : | భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము. |
| **పంచగంగలు** | : | గంగ, కృష్ణ, గోదావరి, తుంగభద్ర, కావేరి |
| **పంచప్రాణములు** | : | ప్రాణం, అపానము, వ్యానము, ఉదానము, సమానము |
| **పంచపితరులు** | : | (ఐదుగురుతండ్రులు) తనను గన్నతండ్రి, తనకు వడుగు చేసినవాడు, చదువు చెప్పించినవాడు, తన్నుఆపద నుండి కాపాడిన వాడు తన దేశమును పాలించురాజు. |
| **పంచమాతృమూర్తులు** | : | (ఐదుగురు తల్లులు) తనను కన్నతల్లి, తనను పెంచిన తల్లి,గురువుభార్య,అన్నభార్య (వదిన), భార్యనుగన్నతల్లి, |
| **పంచాంగములు** | : | తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము. |
| **పంచామృతములు** | : | పాలు, పెరుగు, నెయ్యి, తేనె, నీరు. |
| **పంచమహాపాపాలు** | : | బంగారందొంగిలించుట, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్ని సంగమము దుష్టులతో సహవాసము, |
| **కర్మేంద్రియములు** | : | వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థలు |
| **అరిషడ్వర్గము** | : | కామ,క్రోధ,లోభ,మోహ,మద,మాత్సర్యములు, |
| **సప్తమహాఋషులు** | : | గౌతముడు,విశ్వామిత్రుడు,భరద్వాజుడు,అత్రి,వశిష్ఠుడు, కశ్యపుడు, జమదగ్ని. |
| **సప్తలోకములు** | : | (ఊర్ధ్వ)భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము,జనోలోకము,తపోలోకము, సత్యలోకము. |
| **సప్తద్వీపములు** | : | జంబూద్వీపం, పక్షద్వీపం, శాకద్వీపం, క్రౌంచద్వీపం, శాల్మలీద్వీపము, పుష్కరద్వీపము, యుద్వీపము. |
| **సప్తలోకములు** | : | (అధో) అతలము, వితలము, సుతలము, రసాతలము, తలాతలము, మహాతలము, పాతాళము. |

**సప్తవ్యసనములు** : కల్లుతాగుట, జూదము, స్త్రీవ్యామోహము, వేటాడుట, కాఠిన్యము వహించుట, దొంగతనము, పరనింద.

**అష్టకష్టములు** : దరిద్ర్యము,దాస్యము,భార్యావియోగము, సర్వమూ తానే చేసుకొనుట,యాచన,ప్రయత్నవైఫల్యం,వ్యాధిచేబాధపడుట.

**నవరసాలు** : శృంగారము,హాస్యము,కరుణ,వీరము,రౌద్రము, భయానకము, భీభత్సము, అద్భుతము, శాంతము.

**నవరత్నములు** : వజ్రము, వైఢూర్యము, గోమేధికము, పుష్యరాగము, మరకతము,మాణిక్యం, నీలము, ముత్యము, పగడము.

**నవధాన్యములు** : వడ్లు,ఉలవలు,పెసలు,మినుములు,నువ్వులు, గోధుమలు అనుమలు, కందులు, శనగలు.

**అష్టాదశపురాణములు** : భాగవతము,నారదీయము,మార్కండేయం, అగ్నేయము బ్రహ్మ,పద్మము,వైష్ణవము, శైవము, భవిష్యత్తు, బ్రహ్మాండ బ్రహ్మవైవర్తకములు,లింగము, వరాహము, స్కాందము, కూర్మము, వామనము, మత్స్యము, గారుడము.

# వేదములు

యజ్ఞ యాగాదులనందు ఉపయోగించు మంత్రములనే వేదములు అందురు. ఇవి నాలుగు.

**1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణవేదము**

ఋగ్వేదమునే హౌత్రవేదమని, యజుర్వేదమును తైత్తరీయమని, సామవేదమును ఉద్గాతృవేదమని, అధర్వణవేదమును బ్రహ్మవేదమని కూడా పిలువబడుతున్నాయి.

ఋగ్వేదము నందలి మంత్రమును రుక్కు అందురు. యజుర్వేదమందలి మంత్రమును పనస అందురు. సామము అనగా గానము. గానము చేయదగిన మంత్రములు కావున వీటికి సామవేదము/ఉద్గాత వేదము అని పేరు వచ్చింది. అధర్వణ వేదమందు శాంతిక, పౌష్ఠిక కర్మలు అధికముగా ఉండుటచే బ్రహ్మవేదమని పేరు కూడా వచ్చినది.

# వేదాంగములు

**వేదాంగములు - 6**

**1. శిక్ష 2. వ్యాకరణము 3. ఛందస్సు**

**4. నిరుక్తము 5. జ్యోతిష్యము 6. కల్పము.**

| | | |
|---|---|---|
| **శిక్ష** | : | వేదములందలి అక్షరములను స్వరములను ఉచ్ఛరించు రీతిని వివరించి చెప్పేది. |
| **వ్యాకరణము** | : | సుశబ్ద, అపశబ్దములను బోధించును. |
| **ఛందస్సు** | : | మంత్రాలందుగల వృత్త విశేషములను తెలియజేయును. |
| **నిరుక్తము** | : | మంత్రాలందుగల కఠినపదాల భావమును బోధించును. |
| **జ్యోతిషము** | : | ఆయాకాలములందుచేయవలసిన యజ్ఞ,యాగాది విధులకుసంబంధించిన కాలవిశేషములను తెలియజేయును. |
| **కల్పము** | : | మంత్రాలు పఠించుచూ చేయవలసిన కార్యక్రమములను బోధించును. |

## ఉపనిషత్తులు

ఉపనిషత్తులకు మరొక పేరు వేదాంతములు. ఆత్మ, అనాత్మ, జీవుడు, జీవేశ్వరుల సంబంధము మొదలగు ప్రశ్నల గురించి చర్చలు జరుపగా లభించిన జవాబులే ఉపనిషత్తులు. ఇవి 108 ఉపనిషత్తులుగా పేర్కొన్నారు. ఇందు 10 ఉపనిషత్తులు మాత్రము శంకరాచార్యులవారి కాలమున అంగీకారము పొందినట్లు తెలియుచున్నది. ఇవి-

**ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తరీయ, ఐతరేయ, చాందోగ్య, బృహదారణ్యకము.**

ఈ 10 ఉపనిషత్తుల మీదనే భాష్యములు రచించినారని తెలియుచున్నది.

## పురాణములు 18

**సర్గ ప్రతిసర్గ అను అయిదు లక్షణములతో కూడినవి**

1. బ్రహ్మము
2. పాద్మము
3. వైష్ణవము
4. శైవము
5. భాగవతము
6. నారదీయము
7. మార్కండేయము
8. ఆగ్నేయము
9. భవిష్యత్తు
10. బ్రహ్మావర్తము
11. లైంగము
12. వారాహము
13. స్కాందము
14. వామనము
15. కార్మము
16. మాత్స్యము
17. గారుడము
18. బ్రహ్మాండము

వీటిని అష్టాదశపురాణములని అందురు. ఈ పద్దెనిమిది పురాణాలను శ్రీకృష్ణద్వైపాయనుడు అనగా వ్యాసభగవానుడు రచించెను. వ్యాసుడు సత్యవతీ పరాశరపుత్రుడు.

## పంచమహాకావ్యాలు సంస్కృతమున

(కవి : కాళిదాసు)

1. రఘువంశము 2. మేఘసందేశము 3. కుమార సంభవము
4. మాళవికాగ్నిమిత్రము 5. విక్రమోర్వశీయము

## తెలుగు నందు పంచ మహాకావ్యాలు

1. ఆముక్తమాల్యద (శ్రీ కృష్ణదేవరాయులు)
2. వసుచరిత్ర (భట్టుమూర్తి)
3. మనుచరిత్ర (అల్లసాని పెద్దన)
4. పాండురంగమహాత్మ్యము (తెనాలి రామకృష్ణ)
5. కళాపూర్ణోదయము (పింగళి సూరన)

## కలియుగ వైఖరి

అధర్మ, అసత్యమనే దంపతులకు కంభుడు, మాయ అనే సంతతి జన్మించిరి. వారుదంపతులై దంభుడు, వికృతి అనే వారిని కనిరి. వీరికి క్రోధుడు, హింస అనే కొడుకు, కూతురు జన్మించిరి. ఈ దంపతులకు కలిపురుషుడు జన్మించెను.

కలిపురుషుడు భయంకరమైన ఆకారము కలవాడు. ఎఱ్ఱని కన్నులు కలిగి, బానవంటి పెద్ద పొట్టకలిగి, స్త్రీ వ్యామోహము, సురాపానము, జూదము మొ॥లైన దుర్వ్యసనాలు కలవాడు.

ఈ కలియుగాన అతడిపాలనలో ధర్మం అన్నది క్రొద్దిగానైనా కనిపించక పోవుటకు ఇదియే కారణము. ఈ విషయము శౌనకాది మహామునులకు సూదుడు భవిష్యపురాణమును తెలుపుచూ పలికిన వాక్యములివి.

## ప్రత్యేకత సంతరించుకున్న దినములు

| | | | |
|---|---|---|---|
| 1. | పాడ్యమి | - చైత్రశుద్ధపాడ్యమి | - సంవత్సరాది పాడ్యమి |
| 2. | విదియ | - భానువారముతోవచ్చువిదియ | - వైశాఖ శుద్ధపాడ్యమి |
| 3. | తదియ | - అట్ల తదియ | - ఆశ్వీయుజమాస బహుళం |
| 4. | చవితి | - వినాయకచవితి | - బాద్రపద శుద్ధచవితి |
| 5. | పంచమి | - నాగు పంచమి | - మాఘ శుద్ధ పంచమి |
| 6. | షష్ఠి | - సుబ్రహ్మణషష్టి | - మార్గశిర శుద్ద షష్ఠి |
| 7. | సప్తమి | - రథసప్తమి | - మాఘశుద్ధ సప్తమి |
| 8. | అష్టమి | - దుర్గాష్టమి | - ఆశ్వీజ శుద్ధ అష్టమి |
| | | - గోకులాష్టమి | - శ్రావణ బహుళాష్టమి |
| 9. | నవమి | - శ్రీరామనవమి | - చైత్ర శుద్ధనవమి |
| 10. | దశమి | - విజయదశమి | - ఆశ్వీయుజ శుద్ధ దశమి |
| 11. | ఏకాదశి | - భీష్మఏకాదశి | - మాఘశుద్ధ ఏకాదశి |
| | ఏకాదశి | - తొలేకాదశి | - ఆషాఢశుద్ద ఏకాదశి |
| | ఏకాదశి | - చిలుకుఏకాదశి | - కార్తీక శుద్ధ ఏకాదశి |
| 12. | ద్వాదశి | - చిలుకు ద్వాదశి | - కార్తీక శుద్ద ద్వాదశి |
| 13. | త్రయోదశి - | | |
| 14. | చతుర్దశి | - నరక చతుర్దశి | - ఆశ్వీయుజ బహుళ |
| 15. | అమావాస్య | - దీపావళీ అమావాస్య | - ఆశ్వీయుజ బహుళ |
| 16. | పౌర్ణమి | - వ్యాస/గురు పౌర్ణమి | - ఆషాఢపౌర్ణమి |

## జాతక చక్రమునందు రాశులు

1. మీనరాశి
2. మేషరాశి
3. మిధునరాశి
4. కర్కాటకరాశి
5. సింహరాశి
6. కన్యరాశి
7. తులారాశి
8. వృశ్చికరాశి
9. ధనుస్సురాశి
10. మకరరాశి
11. కుంభరాశి
12. మీనరాశి



# ధీ-శాలి

విక్రమార్కుని పరాక్రమము, అతని ధీ (బుధి) శక్తి తెలియని వారంటూ వుండరు. విక్రమార్కుని పరిపాలనా కాలంలో ప్రజలు ఎటువంటి బాధలు లేకుండా జీవితాలను గడిపారు.

విక్రమార్కుని పరిపాలనలో ఒక అగ్రహారంలో ఓ బ్రాహ్మణునికి శివుని వరంవల్ల ఒక ఆడశిశువు జన్మించింది. ఆ అందాల గారాల కూతుర్ని పెంచి పెద్ద చేశాడు. యుక్త వయస్సుకు వచ్చింది. పెండ్లి చెయ్యాలి. సరియైన ధనం బ్రాహ్మణుని వద్ద లేదు. విక్రమార్కుని ఆస్థానానికి కుమార్తెను కూడా తీసుకుని వెళ్ళాడు. విక్రమార్కుని గౌరవిస్తూ కీర్తిస్తూ ఆశీర్వదిస్తూ స్తోత్రం చేశాడు. విక్రమార్కుడు బ్రాహ్మణుని కుమార్తెను చూసి ఏమి కావాలి? అని ప్రశ్నించాడు.

ఆమె తండ్రిలాగా చక్కగా చదువుకున్న వనిత. అభిమానవంతురాలు. వచ్చిన పనిని సూటిగా చెప్పడానికి సిగ్గుపడి

**ఓ రాజా !**



**ఈ** ర్ష్యా సూయలకతీతంగా
**వ** దాన్యుడవై
**రు** ద్రపూజలు
**ని** త్యాన్నదానాలు చేస్తూ
**తో** డుగా మంచిమంత్రులను కలిగి
**వి** ప్రులయెడ భక్తి కలిగి
**వా** జపేయాది క్రతువులు చేస్తూ
**హ** రిభక్తులకు
**ము** దము కూర్చుచూ
**కా** మధేనువు వలె
**వ** జ్రవైఢూర్యాలు
**లె** క్కలేకయిమ్ము అని పలికింది.

విక్రమార్కునికి ముందు వివరించినా వాటిలో ఆమె ఎందుకు ఇలా పలికిందా! అనే ఆలోచనతో అర్థము కాని సందిగ్ధావస్థలో పడి క్షణకాలంలో ఆమె పలికిన వాక్యాలలోని మొదటి అక్షరాలను కలిపి పునఃశ్చరణ చేయగా ఆ ఉద్దేశము అర్థమై " **ఈ వరునితో వివాహము కావలె** " అన్న వాక్యాన్ని తలచుకొని అవసరమయినంత ధనాన్ని అది కూడా అక్షరానికి వెయ్యి వరహాల చొప్పున యిచ్చి పంపించాడు.

విక్రమార్కుని ఔదార్యానికి, సూక్ష్మబుద్ధికి, బ్రాహ్మణుడు ఎంతో కీర్తిస్తూ ఆ సభ నుండి మరల వెళ్ళిపోయాడు.

# భలే విందు

న్యాయం చెప్పాలన్నా! ధర్మం చెప్పాలన్నా! వివేకమే అందుకు ప్రధానమైనది. తమ్ముడు తన వాడైనా ధర్మం తప్పకూడదని శాస్త్రాలు తెలుపుతున్నాయి. ధర్మాన్నిమనం రక్షిస్తే మనలని ఆ ధర్మమే రక్షిస్తుంది. ధర్మమనే గుణాన్ని తనలో నింపుకున్నమహనీయుడు. మర్యాదరామన్న. తెలివిగా! ఆడిన మాటను తప్పకుండా నడిచే ధీశాలి ఈ మర్యాద రామన్న.



మర్యాద రామన్నకు పట్టాభిషేకమైన సందర్భంగా పురప్రజలంతా ఎంతోఆనందోత్సాహాలతోపలకరించి, రామన్నను మంచి విందుభోజనాన్ని ఇవ్వమని, నభూతో, నభవిష్య తిలా! ఎన్నటికీ మరచిపోలేని, మరచిపోని విందు ఇవ్వమనికోరారు. రామన్న అందుకు సమ్మతించాడు. "మరచిపోలేని విందు ఎలా ఇవ్వాలా"! అనిరామన్నకు ఆలోచన కొనసా గింది. తాను ఇవ్వాలనుకున్న విందును అందుకునే వాళ్ళల్లో ఒకవైపు ధనవంతులున్నారు. మరోవైపు నిరుపేదలూ ఉన్నారు. విందును ఏర్పాటు చేసే ప్రజలను పిలిచే ముందు వారంతా ఎంత ఘనమైన వంటలు వండించారో! అని లొట్టలేసుకుంటూ వచ్చారు. వచ్చిన వాళ్ళలో ధనికులను ఒకవైపు, నిరుపేదలను ఒక వైపు రెండు భాగాలుగా చేసి కూర్చోబెట్టించాడు రామన్న. చాలామందికి ఆయనఎందుకిలా చేశాడో ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. వడ్డన ప్రారంభమైంది. ధనికులకు, గంజి, మిరపకాయ, ఉల్లిపాయ వడ్డించారు. నిరుపేదలకు దివ్యమైన పంచ భక్ష్య పరవాన్నాలను వడ్డించారు. పేదవారు ఎంతో సంబరపడి పోయారు. అటు వంటి విందు వారి జీవితంలో తినలేదని ఆనందంతో ఆరగించారు. కానీ ధనికులు మాత్రం తెల్లమొహాలు వేసి కూర్చున్నారు. గంజి మింగుడు పడటంలేదు. వారికేమో పంచ భక్ష్య పరవాన్నాలు, మనకేమో గంజినీళ్ళు! అని అనుకుంటుండగా రామన్న వారి మధ్యకు వచ్చి నవ్వుతూ! మీరందరూ కోరుకున్న విధంగానే ఎందుకు ఏర్పాటు చేశాను. నిరంతరం అన్నిరుచికర పదార్థాలనుతినేవాళ్ళు ధనికులు. కావున వారు ఇంతకు ముందెన్నడూతిననిత్రాగని గంజి, మిరపకాయలను, ఎల్లప్పుడూ గంజితో కాలం గడిపేవారికి కమ్మనివంటకాలనుఅందించాను. మీరందరూ కోరుకున్న విధంగానే ఎవ్వరూ మరిచిపోలేని విందును మీకు ఏర్పాటు చేశానని చిరు మందహాసంతో తెలిపాడు. పేదలవంటలు ధనికులకు తెలియచేసి, ధనికుల వంటలను పేదలకు వడ్డించి తన వివేకాన్ని చాటిని మహనీయుడు మర్యాద రామన్న.

# బంగారు మామిడి పండ్లు

శ్రీ కృష్ణదేవరాయలవారి తల్లియైన నాగాంబగారు - వృద్ధాప్యము మీద పడి, మరణిస్తూ... "మామిడిపండ్లు! మామిడిపండ్లు!! అంటూ. పలవరించినది. "మామిడిపండ్లపైతల్లికున్నవాంఛను- ఆమె అవసాన దశలో తీర్చలేకపోయాన"ని రాయలవారు బాధపడుటను గమనించిన ఆస్థాన పురోహితుడు - "మహారాజా! తల్లిగారి కోరిక తీర్చలేకపోయానని మీరు బాధపడవలదు. మేలిమి బంగార ముతో మామడిపండ్లను చేయించి, వాటిని సద్బ్రాహ్మణులకు దానమిచ్చిన... స్వర్గములో వున్న మీ తల్లిగారికి - ఆవాంఛ తీరిపోయి, తృప్తిగా నుండున"ని చెప్పాడు. రాయలవారికి - పురోహితుడు చెప్పినది నచ్చినది.

రాజు తలచుకొంటే...కాని దేమున్నది?వెంటనే...అప్పాజీ వారిని పిలిచి, విషయమంతా చెప్పి, "బంగారుమామిడి పండ్లను తయారు చేయించవలసినది" గా కోరాడు. అదివిన్నఅప్పాజీవారికి ఒళ్ళు మండి పోయినది. "ఖజానా ఖాళీ చేయునట్టిసలహానిచ్చినపురోహితునికిబుద్ధిచెప్పాల"నినిశ్చయించుకొని,రామ కృష్ణునితో-"తదనుగుణంగాప్రవర్తించి,ఖజానాఖాళీగాకుండాచూడమ"నిచెప్పారు.

"దేవరాయలవారు సద్బ్రాహ్మణులకు...పసిడి మామడిపండ్లు దాన మిచ్చున"ని ప్రకటన వెలువడినది. ఈ వార్త తెలిసి, ఆ దేశ మందలి వారేగాక... దేశదేశములయందలిబ్రాహ్మణులు- విజయనగరమునకు బయలుదేరి వచ్చారు. ఆరోజు రానేవచ్చినది. రాయలవారు - కోట ప్రాకారము ఆవల వేలాది గంపల మామడిపండ్లతో దానమీయుటకు సిద్ధముగా వున్నారు. కోట ప్రకారము ఇవతల - కణకణలాడు నిప్పులకొలిమి, అందుఎఱ్ఱగాకాలినఇనుపకడ్డీ,వాతలు వేయు టకు తగిన పనివారితో...సిద్ధముగా వున్నాడు రామకృష్ణుడు! ఇక్కడ- "పసిడి మామడిపండ్లనుదానముకోరుసద్బ్రాహ్మణులారా! మీరెన్ని పసిడి మామిడిపండ్లను దానముకోరెదరో...అన్నివాతలనువేయించుకోవాలి.అట్లువాతలు వేయించుకోని వారు తిరిగిపొందు!" అని పెద్ద అక్షరములతో- ప్రకటన వ్రాయబడి వున్నది.



ఆప్రకటన చదువుకున్న వేలాదిబ్రాహ్మణులలో. సగమునకు పైగాభయముతోహడలిపోయి,తిరుగు ముఖముపట్టారు. మిగిలిన వారిలో కొంతమంది-మొండిగావాతలు వేయి ంచుకొన్నారుగానీ... ఆ బాధకు తాళ లేక..వైద్యచికిత్సలనిమిత్తంవేవేగముగ వెడలిపోయారు. వాతలువేయించుకున్న వారిబాధలను గ్రహించిన మిగతా వారు-ఆశచచ్చి, పాఱిపోయారు. మొండి-బండశారీరక ప్రకృతికలిగిన 20-30మంది బ్రాహ్మణులు మాత్రము....వారి వారి స్థైర్యమును బట్టి...1 నుండి 5 వాతల వఱకు వేయించుకొని, దానము నందుటకు కోటలోపలికి వెళ్ళారు.

రాయలవారు దానమీయ పరిపూర్ణ మనస్సులై వేచియున్నారు. దానము గైకొను బ్రహ్మణోత్తము లెంతకీ రారాయె...! ఈ పరిస్థితి కడు విచిత్రముగా వున్నదాయనకు!! విషయము తెలిసిన అప్పాజీవారు, కొంతమంది రాజభక్తులూ గుంభనముగావున్నారు. చివరికిముక్కుతూ-మూల్గుతూ... కొద్దిమంది బ్రాహ్మణులు-దానస్థలికివచ్చారు. రాయలవారువచ్చిన బ్రాహ్మణులకు-స్వహస్తములతో..తలా ఒకపసిడిమామిడిపండును దానమిచ్చారు. దానగ్రహీతలైన బ్రాహ్మణులలో..కొంతమందివడివడిగావెళ్ళిపోయారు. పదిమందిలోపు బ్రాహ్మణులు మాత్రము-ఏదోతీరనివ్యథననుభవిస్తూకూడా...సరైనన్యాయము జరగలే దన్న చింతతో..మింగలేక-కక్కలేక...అప్రాంతమునువీడివెళ్ళలేక....నీళ్లు నమలుతూ ..నిలబడినట్లు గ్రహించిన రాయలవారు- "విప్రోత్తములారా! ఏల ఇంకా నిలబడి వున్నారు!? భోజనశాలకెళ్ళి,విందారగించి సంతృప్తులై...మమ్మాశీర్వదించుడ" న్నారు. రాయలవారి ఔదార్యము తెలిసివున్నవారు కాబట్టి...అనునయముతో కూడిన ఆ పలుకులు విన్న బ్రాహ్మణులు...



"మహాప్రభూ! 'వాత కొక్క పసిడి మామిడి పండ'నికదా... మీరు ప్రకటించినది? కానీ.... తమరు ఒక వాత వేయించుకున్న వారికీ, రెండు నుండి ఐదువాత లేయించుకొన్న వారికీ ...ఒక్కొక్క మామిడిపండునే దానమిచ్చారు .దానశీలతలో-'శిబి' ని మించిన ఔదార్యము గల దేవర వారిచిత్తముఅర్థముగాకనిబలడియున్నామ"నిచెప్పగా విన్న రాయలవారు అమితాశ్చర్యమునొంది; విషయమంతా బ్రాహ్మణులద్వారావిని,వారికితగిన న్యాయము చేసి; వెంటనే ప్రాకారము కాపలవున్న రామకృష్ణుని పిలిపించారు. బ్రాహ్మణులకు జరిగిన పరాభవమును తట్టుకోలేక...ఆగ్రహోదగ్రుడైన రాయలవారు-

"రామకృష్ణా! రోజు రోజుకీ...నీఆగడములు - మితిమీటి పోతున్నాయి. సాటి బ్రాహ్మణులన్న ఇంగితము కూడా లేక...వారికి మహాపరాధము గావించిన నిన్నిక ఉపేక్షించరాదం"టూ భటులవేపు "బంధించమ"న్నట్లుగా చూసారు. రామకృష్ణుడు - మోములో దైన్యమును చూపుతూ...

"మహారాజా! మీ శాసనము నాకెపుడూ శిరోధార్యమే!! ఐతే.. దయతో నా మనవి నాలకింపుడు!!! నా కన్న తల్లి-వాతనొప్పులతో మంచమున పడి, 'నాయనా...! ఎఱ్ఱగా కాల్చిన ఇనుపకడ్డీతో వాతలు వేసిన... ఈ వాతనొప్పులు తగ్గిపోతాయి. నాకు వాతలు వేయరా! అని అడుగుతూ వుండేది. కనీ.... పెంచీ... పెద్దచేసినమాతృమూర్తికివాతలువేయ నామనసొప్పలేదు.ఆమెఅట్లే తీసికొని-తీసికొని,'వాతలు-వాతలం'టూ...కన్ను మూసినది. ఈ మధ్య మీరు ప్రకటించిన పసిడిమామిడి పండ్ల దానము- నన్నాలోచనలో పడవేసినది. మహారాజుగారు-తల్లికోరికతీర్చ...అంతఔదార్యమునుప్రకటించగాలేనిది...కొద్దిఖర్చుతో...కొద్దిమంది

పనివారిని నియమించి...సద్బ్రాహ్మణులకు వాతల దానమిచ్చిన పరలోకమం దున్ననా తల్లి వాంఛ తీరును గదా యని! కానీ... పసిడి మామిడిపండ్ల దానమన్న వచ్చినట్లుగా... నా వాతల దానమునకు బ్రాహ్మణోత్తము లెందుకు వస్తారని సందేహంకలిగినది. ఈవిధముగాయోచిస్తున్ననాకు - ఒక ఉపాయము తట్టినది. ఎటుతిరిగి మహారాజుగారి దానము గొన సద్బ్రాహ్మణులు వేంచేస్తారు గదా...! కోట బయటవుండి దానికిది అనుసంధానమన్నట్లుగా ప్రకటన వేయించిన... మీ పనీ-నా పనీఏకకాలమున జరుగునని ఈపాపమునకుఒడిగట్టాను. మహా రాజా! ఇక మీరే శిక్ష విధించినా... దానిని మనసారా స్వీకరిస్తాన"న్న రామకృష్ణుని మాటలు రాయలవారిని ఆలోచనలో పడవేసాయి. ఆయన..."రామకృష్ణ కవీ! ఇక్కడవాతలువేసిన...స్వర్గస్థురాలైన మీ తల్లిగారికి మనశ్శాంతి లభించునం టావా....?" అన్నారు.



రామకృష్ణుడు "మీరు ఈ విధంగా మాట్లాడుట నాకుచిత్రముగా వున్నది ప్రభూ.! ఇక్కడ బంగరు మామిడిపండ్లుదానమిచ్చిన... పూజ్యు రాలైన మీతల్లిగారు- స్వర్గములో శాంతినందగలరన్న మీ విశ్వాసమున కు...నేనును ప్రభావితుడనై, ఈవాతల దానమును చేపడితిని" అన్నాడు. 'సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలవారికిరామకృష్ణునిమనో గతంఅర్థమైనది.ముసిముసిగా నవ్వుకొంటున్న అప్పాజీవారిని చూడగానే..."ఖజానా ఖాళీ గాకుండా వుండాల"ని రాజభక్తితో వారాడిననాటకముఅవగతమైనది. కన్నతల్లిపైమమకారంతో తానుచేయబోయిన పొరపాటుకు చింతిస్తూ...రామకృష్ణుని మనసారా కౌగిలించుకొని "రామకృష్ణ మహాకవీ! నీవు నా యందు చూపుతున్న అవ్యాజ-అనురాగములకు - నే నేమివ్వగలను. కాళీప్రసాద లబ్ధమైన పాండితీ-ప్రతిభతో వెలుగొందు నీవు నామిత్రుడౌట మహద్భాగ్యము"! అన్నారు.

చరిత్రలో - సుప్రసిద్ధుడైనట్టి రాయలవారి మెప్పు నందిన... తెనాలి రామకృష్ణుని ఘనత కివి కొన్ని కథలు మాత్రమే! ఆయన చర్యలు- కొంటెతనము గానూ, చమత్కారముగానూ కనిపించినప్పటికీ...అవి రాజభక్తినీ, తద్వారా ప్రజాక్షేమమునూ సంతరించుకొని వుండుట విశేషము!

15 శతాబ్దివాడు శ్రీ కృష్ణదేవరాయలు. భువన విజయాన్ని స్థాపించి అష్టదిగ్గజాలను పోషించిన మహనీయుడు. సాహిత్యానికి పెళ్ళి పందిళ్ళు వేసి ఆంధ్రభాషామృతాన్ని కావ్య సంపదలో అందించి..దేశ భాషలందు తెలుగు లెస్స అని కీర్తించిన మహనీయుడు రాయలు.

తెనాలి రామలింగడు అష్టదిగ్గజాలలో ఒకడై తన నవ్వుల పువ్వులతో ఎంతోఅద్భుతాలనుసృష్టించాడు.రాయలవారి కొలువులో కవియేకాక అవసరాన్ని బట్టితాను దేశరక్షణకోసం ఎంతో కష్ట పడిన వ్యక్తిగా, కవిగా తెనాలి రామకృష్ణుడు వెలుగొందాడు.

## సజ్జనరీతి

రవి రైతుబిడ్డ ఒకరోజు మొక్క జొన్నచేలు చూద్దామని వాళ్ళనాన్నతో పాటు వెళ్ళాడు. మొక్కజొన్నమొక్కలు కొన్నిగర్వంగానిటారుగానిలచి ఉన్నాయి. కొన్ని క్రిందకు వంగివున్నాయి. రవిఈతేడానుగమనించి ఇదేమిటినాన్నాకొన్నిమొక్కలు వంగిఉన్నాయి. వీటికంటేనిటారుగాఉన్నమొక్కలేబలంగాఉన్నాయి.వంగినవన్నీనాసిరకమేనాఅనిఅడిగాడు.

వాళ్ళ నాన్న నవ్వి వంగిన మొక్కదగ్గరకువెళ్ళి మొక్కజొన్నపొత్తు తెరచి చూపించాడు. బాగాగింజపట్టిఉంది. గర్వంగానిటారుగాకనిపించే మొక్కవద్దకువెళ్ళిదాని పొట్ట చీల్చిచూపించాడు.పలచటిగింజలతోపీలగాకనిపించింది.ఆరెండిటితేడాను గమనించి రవి ఆశ్చర్యపోయాడు.వాళ్ళనాన్న రవితో చూసావా ! గింజల బరువుకే మొక్కలు వంగుతాయి. గింజలు లేని లేదా పీలగా ఉన్న మొక్కలు తలలు ఎగరేస్తాయి. తేడా చూశావా ! అణిగిమణిగి ఉండే వాళ్ళు సజ్జనులు, మంచివారు.అదే పోకిరిగా తిరిగే వాళ్ళు, ఏమీరానివాళ్ళు, అన్నీవచ్చునని తలలు ఎగరేసేవారు, వట్టిపోకిరిగాళ్ళు, ఎందుకూ కొరగానివాళ్ళు అన్నాడు.ఆ మాటలు విని రవి మనస్సులో చెరగని ముద్రలు వేసాయి. మంచితనాన్ని గుర్తించాడు. తను తలెగరేయకుండా వినయ విధేయతలతో పెద్దల యందు గౌరవంతో తన చదువును కొనసాగించాడు.

## తగిన శాస్తి

ఒకఊళ్ళో ఒకపేదవాడుండేవాడుకూలీనాలీచేసుకుంటూ పొట్టపోసుకునే వాడు. అతడిగుడిసె ప్రక్కనకొంత ఖాళీస్థలముండేది, దానికి కంచెకట్టి,కష్టపడి, త్రవ్వి, ఎరువువేసి గుమ్మడిపాదులువేసాడు కొంతకాలానికి గుమ్మడి పాదులు నవనవలాడుతూ ఎదిగాయి. పెరడు కళకళలాడసాగింది. కానీ ఆగుమ్మడి కాయలలో ఒక్కటి తప్పమిగిలిన వన్నీ ఓమాదిరిగాఎదిగాయి. ఆఒక్కగుమ్మడికాయమాత్రంపెరిగి పెరిగి చాలా పెద్దదిగా కాసిందిఊరిప్రజలంతా దానినిచూడటానికితోండోపతండాలుగావచ్చిచూసివెళ్ళేవాళ్ళు.

ఆపెద్దగుమ్మడికాయని మహారాజుగారికి బహుమానంగా ఇస్తే బాగుంటుంది అని సలహా ఇచ్చాడు ఆఊరిపెద్ద. ఊరిపెద్ద ఇచ్చిన ఆలోచన అతడికి బాగా నచ్చింది. ఓబండికుదుర్చుకునిపదిమందిమనుషులసాయంతోబండిలోపెట్టించిదానినిరాజువద్దకు తీసుకువెళ్ళిఅందించాడు. రాజుఎంతోమురిసిపోయిఅతనుఊహించలేనంత బహుమానాన్నిఇచ్చాడు.ఆబహుమానంఅందుకునిఆనందంతో తన ఊరికి చేరాడు ఆ పేదవాడు.

ఈ సంగతి అంతా ఆ ఊరి పెద్దరైతుకు తెలిసింది తన దగ్గర పనిచేసే కూలివాడికి రాజ సత్కారం దొరకడం అతడు ఓర్వలేకపోయాడు. ఇంతకంటే మంచి సత్కారం పొందాలనుకున్నాడు. మేలుజాతి కోడెదూడనొకదానిని కొని బాగా మేపి చిన్నగున్నఏనుగులాగాతయారుచేసి ఒకమంచిముహూర్తంచూసుకొని రాజువద్దకు వెళ్ళాడు. పేదవాడు ఇచ్చినట్లుగానే రాజుకు ఇవ్వాలని ప్రయత్నించాడు కానీ రాజు అతడి దుర్బుద్ధిపసిగట్టి ఇలా అన్నాడు సెభాష్ కోడెబాగుంది. పదిఎడ్లపని ఇదొక్కటే చేయగలదు. ఇది మీ లాంటి రైతుల దగ్గరుంటేనే బాగుంటుంది అన్నాడు.

అలాఅనకండి మహాప్రభో ! దీనిని మీకుబహుమతిగా తెచ్చాను. కాదనకండి! అనిబ్రతిమలాడాడు రాజుఇచ్చే అద్భుతమైన కానుకలకోసం కోడెదూడను ఎరగాపెట్టిన రైతు దుర్బుద్ధికి రాజు సరే నీ కోరిక నేనెందుకు కాదనాలి. అలాగే నాకునువ్విచ్చిన బహుమానానికిప్రతిఫలంగా నీకునేను ఒకమాసం కారాగారశిక్షవిధిస్తున్నాను. అన్నాడు. అత్యాశకు పోయినందుకుతగినశాస్తి జరిగిందని బాధపడ్డాడు పెద్దరైతు.

## శివుని అష్ట మూర్తులు

1. రుద్రుడు 2. భవుడు 3. శర్వుడు 4. పశుపతి

5. ఈశ్వరుడు 6. భీముడు 7. ఉగ్రుడు 8. మహాదేవుడు

## సూర్యుని ప్రధాన కిరణములు 7

1. హరికేశుడు 2. సుషుమ్న 3. సంపద్వసువు 4. విశ్వకర్మ

5. అర్వా వసువు 6. విశ్వశ్రవుడు 7. స్వరాట్టు

## కాల ప్రమాణము

15 నిముషములు ఒకకాష్ఠ. ముప్పది కాష్ఠలొక కళ. ముప్పది కళలొక ముహూర్తము. ముప్పది ముహూర్తము లొక దివారాత్రము.

పదిహేను రోజులు ఒక పక్షం. రెండు పక్షములొక మాసం. రెండు మాసములొక ఋతువు. ఆరుమాసములొక అయనం. అయనములు రెండు 1. ఉత్తరాయణము 2. దక్షిణాయనము. మన సంవత్సరం దేవతలకు ఒక్కరోజు.

ఉత్తరాయణం దేవతలకు పగలు; దక్షిణాయణం రాత్రి. మన మానవుల కాలం ప్రకారం ముప్పది సంవత్సరములు దేవతలకు ఒక మాసం. అటువంటి పండ్రెండు మాసాలు ఒక సంవత్సరం. దీనినే దివ్య వర్షమని అంటారు.

## విశేషాలు రాజ్యాంగాలు - 7

1. రాజు 2. మంత్రి 3. స్నేహితుడు 4. ధనాగారం

5. రాష్ట్రం 6. దుర్గము. 7. సైన్యము

## దైవగతములైన కష్టాలు - 5

1. అగ్ని 2. నీరు 3. వ్యాధి 4. దుర్భిక్షం 5. మరణం.

## కష్టాలు - 5

1. ఆయుధం 2. దొంగలు 3. శత్రువులు 4. రాజబంధువులు 5. అత్యాశ.

| | గ్రహములు | విగ్రహములు | సమిధలు | నైవేద్యము | దానములు(ఇతరేతర) |
|---|---|---|---|---|---|
| 1. | సూర్యుడు | రాగి | జిల్లేడు | గుడౌదనం | గోధుమ-ధేనువు |
| 2. | చంద్రుడు | స్ఫటికం | మోదుగు | పాయసం | బియ్యం, శంఖం |
| 3. | కుజుడు | ఎర్రచందనపుకర్ర | చండ్ర | హవిస్సు | కందులు, ఎద్దు |
| 4. | బుధుడు | బంగారము | ఉత్తరేణి | పాలమీగడ | పెసలు, బంగారం |
| 5. | గురుడు | స్ఫటికం | రావి | దధ్యోదనము పెరుగన్నం | శెనగలు, వస్త్రములు |

| | గ్రహములు | విగ్రహములు | సమిధలు | నైవేద్యము | దానములు(ఇతరేతర) |
|---|---|---|---|---|---|
| 6. | శుక్రుడు | వెండి | మేడి | హవిస్సు | బొబ్బర్లు, గుఱ్ఱం |
| 7. | శని | ఇనుము | జమ్మి | అప్పాలు | నువ్వులు, నల్లని ఆవు |
| 8. | రాహువు | సీసం | గరిక | మినపగారెలు | మినుమలు, ఇనుము |
| 9. | కేతువు | సీసం | దర్భలు | చిత్రాన్నం (పులిహోర) | ఉలవలు, మేకపోతు |

## పంచాంగము - వివరణము

### యుగములు : నాలుగు

1. కృతయుగము : **17,28,000** సంవత్సరములు
2. త్రేతాయుగము : **12,96,000** సంవత్సరములు
3. ద్వాపరయుగము : **8,64,000** సంవత్సరములు
4. కలియుగము : **4,32,000** సంవత్సరములు

ఈ నాలుగు యుగములను మహాయుగము అందురు.

## సంవత్సరములు - 60

| | | | | |
|---|---|---|---|---|
| 1. ప్రభవ | 13. ప్రమాది | 25. ఖర | 37. శోభకృతు | 49. రాక్షస |
| 2. విభవ | 14. విక్రమ | 26. నందన | 38. క్రోధి | 50. నల |
| 3. శుక్ల | 15. వృష | 27. విజయ | 39. విశ్వావసు | 51. పింగళ |
| 4. ప్రమోదూత | 16. చిత్రభాను | 28. జయ | 40. పరాభవ | 52. కాళయుక్తి |
| 5. ప్రజోత్పత్తి | 17. స్వభాను | 29. మన్మథ | 41. ప్లవంగ | 53. సిద్ధార్థి |
| 6. ఆంగీరస | 18. తారణ | 30. దుర్ముఖి | 42. కీలక | 54. రౌద్రి |
| 7. శ్రీముఖ | 19. పార్థివ | 31. హేవిళంబి | 43. సౌమ్య | 55. దుర్మతి |
| 8. భావ | 20. వ్యయ | 32. విళంబి | 44. సాధారణ | 56. దుందుభి |
| 9. యువ | 21. సర్వజిత్తు | 33. వికారి | 45. విరోధికృతు | 57. రుధిరోద్గారి |
| 10. ధాత | 22. సర్వధారి | 34. శార్వరి | 46. పరీధావి | 58. రక్తాక్షి |
| 11. ఈశ్వర | 23. విరోధి | 35. ప్లవ | 47. ప్రమాదీచ | 59. క్రోధన |
| 12. బహుధాన్య | 24. వికృతి | 36. శుభకృతు | 48. ఆనంద | 60. క్షయ |

## ఆయనములు - రెండు

1. ఉత్తరాయనము : సూర్యుడు మకర రాశిలో ప్రవేశించినది మొదలు మిధున రాశిలో ఉన్న కాలము
2. దక్షిణాయనము : సూర్యుడు కర్కాటక రాశిలో ప్రవేశించినది మొదలు ధనూ రాశిలో ఉన్న కాలము.

## ఋతువులు - ఆరు

| ఋతువు | మాసములు | ధర్మము |
|---|---|---|
| 1. వసంత | చైత్రము, వైశాఖములు | చెట్లు చిగురించును |
| 2. గ్రీష్మ | జ్యేష్ఠ, ఆషాఢములు | వేసవి ఎండలు |
| 3. వర్ష | శ్రావణ, భాద్రపదములు | వర్షములు కురియును. |
| 4. శరదృతువు | ఆశ్వీయుజ, కార్తీకములు | వెన్నెల కాయును. |
| 5. హేమంత | మార్గశిర, పుష్యములు | మంచు పడును. |
| 6. శిశిర | మాఘ, ఫాల్గుణములు | ఆకులు రాలును. |

## తెలుగు మాసములు - వివరణ

భూమిచుట్టూ చంద్రుడు తిరుగుచుండుటవలన మనకు రోజుకు ఒక నక్షత్రమండలంలో కనబడుచున్నాడు. ఏ నక్షత్రమండలంలో కనిపించునో ఆనక్షత్రమును ఆరోజునక్షత్రముగాగుర్తిస్తున్నారు. పౌర్ణమినాడు చంద్రుడు ఏ నక్షత్ర మందుండునో ఆమాసమునకు ఆనక్షత్రం పేరు మాసముగా పరిగణిస్తున్నాము.

చిత్తా నక్షత్రములో పౌర్ణమి వచ్చుటచే ఆ మాసము చైత్రమాసమని,
విశాఖ నక్షత్రములో పౌర్ణమి వచ్చుటచే ఆ మాసము వైశాఖమాసమని,
జ్యేష్ఠా నక్షత్రములో పౌర్ణమి వచ్చుటచే ఆ మాసము జ్యేష్ఠ మాసమని,
పూ.షాఢ/ఉ.షాఢ నక్షత్రములో పౌర్ణమివచ్చుటచే ఆమాసము ఆషాఢ మాసమని,
శ్రవణం నక్షత్రములో పౌర్ణమి వచ్చుటచే ఆ మాసము శ్రావణ మాసమని,
ఉ.భాద్ర/పూ.భాద్ర నక్షత్రములోపౌర్ణమివచ్చేటచే ఆమాసం భాద్రపదమాసమని,
అశ్వని నక్షత్రములో పౌర్ణమి వచ్చుటచే ఆ మాసము ఆశ్వీయుజ మాసమని,
కృత్తికా నక్షత్రములో పౌర్ణమి వచ్చుటచే ఆ మాసము కార్తీక మాసమని,
పుష్యమీ నక్షత్రములో పౌర్ణమి వచ్చుటచే ఆ మాసము పుష్య మాసమని,
మఖ నక్షత్రములో పౌర్ణమి వచ్చుటచే ఆ మాసము మాఘ మాసమని,
ఉ.ఫ/పూ.ఫల్గుణి నక్షత్రములో పౌర్ణమి వచ్చుటచే ఆ మాసము ఫాల్గుణ మాసమని పిలువబడుచున్నవి. ఈ విషయముల గురించి తెలిపేదే పంచాంగము.

### పంచాంగమనగా ఐదు అంగములు కలది

**అవి :-** 1. తిథి 2. వారము 3. నక్షత్రము 4. యోగము 5. కరణము

గ్రహములు సంచరిస్తున్న మార్గమును జ్యోతిశ్చక్రముగా ఊహించి దానిని 12 భాగాలుగావిభజించిరి. ఈ 12 భాగములనే 12 రాశులుగా వ్యవహరిస్తున్నారు. 1.మేషము 2. వృషభము 3. మిథునము 4. కర్కాటకము 5. సింహము 6. కన్య 7. తుల 8. వృశ్చికము 9. ధనస్సు 10. మకరము 11. కుంభము 12. మీనము

ఈ పన్నెండు రాశులలో గల నక్షత్రముల సంఖ్య 27. ఒక్కొక్క నక్షత్రము నాలుగు పాదములుగా విభజించబడి, ఒక్కొక్క రాశియందు తొమ్మిది పాదములుగా నిర్ణయించారు.

## ఈ నక్షత్రములు

అశ్వని 4పాదములు, భరణి 4పాదములు, కృత్తిక 1వ పాదం - మేషరాశి
కృత్తిక 2,3,4పా॥లు, రోహిణి 4పాదములు, మృగశిర1,2పా॥లు, - వృషభరాశి
మృగశిర 3,4పా॥లు, ఆరుద్ర 4పాదములు, పునర్వసు 1,2,3పా॥లు -మిథునరాశి
పునర్వసు 4వపాదం,పుష్యమి 4పాదములు, ఆశ్లేష 4పాదములు -కర్కాటకరాశి
మఖ 4 పాదములు, పూర్వఫల్గుణి 4 పాదములు, ఉత్తర 1వపాదం - సింహరాశి
ఉత్తర 2,3,4పా॥లు, హస్త 4పాదములు, చిత్త 1,2 పా॥లు - కన్యారాశి
చిత్త 3,4పా॥లు, స్వాతి 4 పాదములు, విశాఖ 1,2,3 పా॥లు - తులారాశి
విశాఖ 4వపాదం, అనూరాధ 4పాదములు, జ్యేష్ఠ 4పాదములు - వృశ్చికరాశి
మూల 4 పాదములు, పూర్వాషాఢ 4పాదములు,ఉత్తరాషాఢ 1వపాదం-ధనూరాశి
ఉత్తరాషాఢ 2,3,4,పా॥లు శ్రవణం 4 పాదములు, ధనిష్ఠ 1,2పా॥లు - మకరరాశి
ధనిష్ఠ 3,4పా॥లు, శతభిషం 4 పాదములు, పూర్వాభాద్ర 1,2,3పా॥లు -కుంభరాశి
పూర్వాభాద్ర 4వపాదం, ఉత్తరాభాద్ర 4పాదములు, రేవతి 4పాదములు - మీనరాశి

## తిథులు -15

ప్రతీ మాసమందు మొదటి పదిహేనురోజులనూ శుక్లపక్షమనీ (శుద్ధము), రెండవ పదిహేను దినములు కృష్ణపక్షమని (బహుళము) పేర్లు. శుక్లపక్షమనగా చంద్రుని కళలు వృద్ధియగు దినములు. కృష్ణపక్షం అనగా చంద్రుని కళలు క్షీణించు దినములు. ఈ తిథులు -

| | | |
|---|---|---|
| 1. పాడ్యమి | 6. షష్ఠి | 11. ఏకాదశి |
| 2. విదియ | 7. సప్తమి | 12. ద్వాదశి |
| 3. తదియ | 8. అష్టమి | 13. త్రయోదశి |
| 4. చవితి | 9. నవమి | 14. చతుర్దశి |
| 5. పంచమి | 10. దశమి | 15. పౌర్ణమిలేకఅమావాస్య |

## వారములు -7

| వారములు | సంస్కృతనామము | ఇంగ్లీషు |
|---|---|---|
| 1. ఆదివారము | భానువారము | సన్‌డే |
| 2. సోమవారము | ఇందువారము | మన్‌డే |
| 3. మంగళవారము | భౌమవారము | ట్యూస్‌డే |
| 4. బుధవారము | సౌమ్యవారము | వెడ్నస్ డే |
| 5. గురువారము | బృహస్పతివారము | థర్స్‌డే |
| 6. శుక్రవారము | భృగువారము | ఫ్రైడే |
| 7. శనివారము | మందవారము | సాటర్ డే |

## నక్షత్రములు - 27

అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.

## యోగములు - 27

| | | |
|---|---|---|
| 1. విష్కంభము | 10. గండము | 19. పరిఘము |
| 2. ప్రీతి | 11. వృద్ధి | 20. శివము |
| 3. ఆయుష్మాన్ | 12. ధృవము | 21. సిద్ధము |
| 4. సౌభాగ్యం | 13. వ్యాఘాతము | 22. సాధ్యము |
| 5. శోభనం | 14. హర్షణము | 23. శుభము |
| 6. అతిగండము | 15. వజ్రము | 24. శుక్లము |
| 7. సుకర్మము | 16. సిద్ధి | 25. బ్రాహ్మము |
| 8. ధృతి | 17. వ్యతీపాతము | 26. ఐంద్రము |
| 9. శూలము | 18. వరీయాన్ | 27. వైధృతి. |

## కరణములు - 11

| | | |
|---|---|---|
| 1. భవ | 5. గరజ | 9. చతుష్పాతు |
| 2. బాలవ | 6. వణిజ | 10. నాగవము |
| 3. కౌలవ | 7. భద్ర | 11. కింస్తుఘ్నము. |
| 4. తైతుల | 8. శకుని | |

## ప్రతీ సంవత్సరము వచ్చే పండుగలు - పర్వదినములు

| | | |
|---|---|---|
| పాడ్యమి | ఉగాది / సంవత్సరాది | చైత్రశుద్ధము |
| విదియ | యమవిదియ | కార్తీక శుద్ధ |
| తదియ | అక్షయతదియ | వైశాఖశుద్ధ |
| చవితి | వినాయకచవితి | భాద్రపదశుద్ధ |
| పంచమి | నాగపంచమి | శ్రావణశుద్ధ |
| షష్ఠి | సుబ్రహ్మణ్యషష్ఠి | మార్గశిరశుద్ధ |
| సప్తమి | రథసప్తమి | మాఘశుద్ధ |
| అష్టమి | కృష్ణాష్టమి | శ్రావణబహుళ |
| నవమి | శ్రీరామనవమి | చైత్రశుద్ధ |
| దశమి | విజయదశమి | ఆశ్వీయుజ శుద్ధ |

| | | | | |
|---|---|---|---|---|
| ఏకాదశి | - | భీష్మ ఏకాదశి | - | మాఘశుద్ధ |
| ద్వాదశి | - | క్షీరాబ్దిద్వాదశి | - | కార్తీక శుద్ధ |
| త్రయోదశి | - | శనిత్రయోదశి | - | త్రయోదశితోకూడినశనివారం |
| చతుర్దశి | - | నరకచతుర్దశి | - | ఆశ్వీయుజ బహుళ |
| పూర్ణిమ | - | వ్యాసపూర్ణిమ | - | ఆషాఢశుద్ధ |
| అమావాస్య | - | దీపావళి | - | ఆశ్వీయుజ బహుళ |

## దిక్కులు, దిక్పాలకులు

| దిక్కు | పాలకుడు | పాలకుని భార్యలు | వాహనము | నివాసము | ఆయుధము |
|---|---|---|---|---|---|
| తూర్పు | ఇంద్రుడు | శచీదేవి | ఏనుగు | అమరావతి | వజ్రము |
| ఆగ్నేయము | అగ్ని | స్వాహాదేవి | పొట్టేలు | తేజోపతి | శక్తి |
| దక్షిణము | యముడు | శ్యామలాదేవి | మహిషము | సంయమని | పాశము |
| నైఋతి | నైఋతి | దీర్ఘాదేవి | నరుడు | కృష్ణాంగన | కుంతము |
| పడమర | వరుణుడు | కాళికాదేవి | మొసలి | శ్రద్ధావతి | దండము |
| వాయవ్యము | వాయువు | అంజనాదేవి | లేడి | గంధపతి | ధ్వజము |
| ఉత్తరము | కుబేరుడు | చిత్రలేఖ | గుఱ్ఱము | అలకాపురి | ఖడ్గము |
| ఈశాన్యము | శివుడు | పార్వతి | వృషభము | కైలాసము | త్రిశూలము |

## స్వరములు -7





**స రి గ మ ప ద ని స**

స : షడ్జమము
రి : రిషభము
గ : గాంధారము
మ : మద్యమము
ప : పంచమము
ద : దైవతము
ని : నిషాదము

## వాద్యములు

1. వేణువు 2. వీణ 3. సితార 4. వయోలిన్ 5. మృదంగము 6. సన్నాయి 7. డోలు 8. షెహనాయి మొదలైనవి.

# శుభాశుభ స్వప్న ఫలములు

సూర్యోదయము, చంద్రోదయము మరియు అశుద్ధము కనిపించిన ధనలాభము. దేవాలయములు కనిపించిన క్షేత్ర దర్శనము జరుగును. నీటి మధ్యలో ఉన్నట్లు కనిపించిన కష్టములు వచ్చును. ఒడ్డు కనిపించిన శుభము. రక్తము కనిపించిన మంచిది. నిప్పు కనిపించిన శుభము. పొగ కనిపించిన కష్టము. మెట్లు ఎక్కుతున్నట్లు కనిపించిన అభివృద్ధి. శిఖరము ఎక్కుతున్నట్లు కనిపించిననూ అభివృద్ధి. భోజనము తింటున్నట్లు కనిపించిన రోగము లేదా శుభప్రాప్తి. పండుకనపించిన మంచి ఫలము లభించును. దగ్గరవారు మరణించినట్లు కనిపించిన, దూరపు బంధువుల శుభ కార్యములను విందురు. దూరము వారు ఎవరోతెలియనివారు మరణించినట్లు వచ్చిన దగ్గర బంధువుల శుభవార్తలు విందురు.సర్పములు అధికముగా కనిపించినకష్టములు. సర్పము పడగవిప్పినట్లు గానీ, కాటు వేసినట్లుగానీ కనిపించిన మంచిది. నల్లకుక్క పట్టిపీకుతున్నట్లు కనిపించిన శని దోషము. కొండల మీద నుంచి పడిపోతున్నట్లుగానీ, మెట్లు దిగుతూ జారినట్లుగానీ కనిపించిన అభివృద్ధి క్షయము. కలలో ఏడ్చిన ఇలలో నవ్వుదురు. తెల్లని వస్త్రములు, పూలు కనిపించిన విద్యా ప్రాప్తి. కలలో రక్షక భటులును చూచుట యమ భటుల దర్శనము. వితంతువును చూసిన అశుభము. నూనెతో తలంటు కొనినట్లు, దూది, ఇనుము కనిపించిన మరణము లేదా కష్టములు కలుగును. నక్షత్రములు రాలుచున్నట్లు కనిపించిన దుఃఖము. డబ్బు కనిపించిన దుఃఖము. ఇంటిలో దొంగలు పడినట్లు కనిపించిన ధనము పోవును. బురదలో పడినట్లుగానీ, ఎవ్వరైనా ఇసుక జల్లినట్లుగానీ కనిపించిన అభివృద్ధి క్షయము, అవమానము జరుగును.

# అంగసాముద్రికము



## నొసలు

1. మధ్య ఉన్నతమై ఉన్న మంచి జ్ఞాపకశక్తి కలిగి యుండును.
2. వెడల్పుగా ఉన్నచో ఉల్లాసము, హాస్యరసమును పుట్టించగల మనస్తత్వము కలిగియుండును.
3. నొసలు గుండ్రముగా ఉన్నచో సంగీ, సాహిత్య కళాజ్ఞానమునందు నేర్పరియై ఉండును.

## లలాటరేఖలు

1. నొసలునకు పైభాగమున విమలము, సమానాంతరాలు అగు ఋజురేఖలు ఉన్నదయాదాక్షిణ్యములు,న్యాయబుద్ధి,గొప్పవిజ్ఞానముగలవానిగాతెలియజేయును.
2. లలాటమంతా పూర్తిగా ముడతలచే వ్యాపించినచో మతమందు గాఢ విశ్వాసము, ఉత్సాహము, ధర్మప్రవర్తన తెలియజేయును.

3. ముడతలుమెలికలుతిరిగి భ్రూమధ్యమునకుదిగిఉన్నజాతకుడు,దివ్య జ్ఞానం గల వాడిగాకానీ లేదామతిస్థిమితము తప్పిన వాడిగా కానీ సూచించును.
4. భ్రూమధ్యమున ఒక మడత మాత్రమే ఉన్న మర్యాదను చూపుటలో లేదా పొందుటలోచిన్నచిన్నవిషయాలలోసహితముపట్టించుకొనుప్రవర్తనకలవాడగును.
5. ఈమడతలురెండు,అంతకంటేఎక్కువగాఉన్న న్యాయవాది లేదా న్యాయబుద్ధి, అధికారము మీద కోరిక, కోపము తెలియజేయును.

## గడ్డము

1. పుణ్యాత్ములకు గడ్డము గుండ్రముగా, మాంసయుతముగ, దీర్ఘము అనగా పొడవుగా గాక కురచగా, మృదువుగా ఉండును.
2. దరిద్రులకు కృశించి అగ్రభాగము పొడవుగా, లావుగా ఉండును.

## కంఠము

1. వంకర మెడకలవాడు చాడీలు చెప్పువాడగును.
2. లేడి మెడకలవాడు శస్త్రముచే మరణించును.
3. గాడిద, ఒంటె మెడపోలిన వాడు ఎల్లప్పుడు బాధతో నిండియుండును.
4. కొంగ మెడకలవాడు పైకి గాంభీర్యముగా కనిపించును.

## బాహువులు

1. చేతులు పొట్టివిగా ఉన్నసేవకుడో లేక పరుల పంచన పనిచేసుకొని కాలము గడుపువాడగును.
2. సమముగా,గుండ్రముగా,పొడవుగా,పుష్టిగా భుజములున్న మిక్కిలి సాహసిగా ధైర్యవంతునిగా ఉండును.
3. ఎగుడు దిగుడుగా ఉండి పలుచగా ఉన్నచో అతడు పరుల సొమ్ములనుఅప హరించు స్వభావము కలవాడగును.

## పుట్టు మచ్చలు (మగవానికి)

కుడి భుజమునందున్న కళయందు నిష్ణాతుడగును. ఉదరము నందున్న తిండికి లోటు ఉండదు. చూపుడు వేలి యందు ఉన్న అధికారియగును. కంఠమందున్న మంచి వక్త గానీ ఉపాధ్యాయ తత్సమాన వృత్తులందు ఉందురు. అరి కాలునందు ఉన్న ఎక్కువ ప్రయాణములు చేయుదురు. ముక్కుమీద ఉన్న అధిక కోపము. గుహ్యామందున్న స్త్రీ సుఖము. కంటిలో ఉన్న అధిక ధనలాభము మరియు జ్ఞానము పెదవిపైనున్న భోగము. కంఠమందున్న గాయకులగుదురు. పైన చెప్పిన విధము స్త్రీలకు ఎడమవైపు ఉన్న శ్రేయస్కరము. ఈ పుట్టుమచ్చలు తేనెరంగులో ఉన్నచో పైఫలితములు వర్తించును. నల్లని (డార్క్‌బ్లాక్) రూపములో ఉన్న వీనిలోని ఫలితములు నిష్ప్రయోజనము.

## బల్లిశాస్త్రము (పురుషులకు)

శిరస్సు కలహం, ముఖము ధనలాభం. ఎడకన్ను శుభం. కుడికన్ను అపజయం. నుదురు బంధు సన్యాసం. కుడిచెంప దుంఖః. ఎడమచెవి లాభం. పై పెదవి కలహం. క్రిందపెదవి ధనలాభం. గుహ్యాం మరణం. చేతి యందు ధన నష్టం. కుడిమూపు రాజభయం. కుడిభుజం కష్టం. ఎడమభుజం అగౌరవం. తొడలు వస్త్రనాశనం. గోళ్ళు పీడ. ఎడమమూపు జయం. పాదం ప్రయాణం.

### స్త్రీలకు

శిరస్సుకలహం. పిక్కలుబంధుదర్శనం. ఎడమకన్ను భర్త ప్రేమ. కుడి కన్నుమనోవ్యధ. పైపెదవివిరోధం. క్రింద పెదవి నూతన వస్త్రలాభం. స్తనములు అధికదుఃఖం. వ్రేళ్ళు ఆభరణం. కుడిభుజం సౌఖ్యం. మోకాళ్ళు బంధనం. చీలమండలు కష్టం. కుడికాలు శత్రునాశనం. కాలి వేళ్ళు పుత్రలాభం. వీపు మరణ వార్త. గోళ్లు కలహం.

**(తొండపడినను ఈ ఫలితములే వర్తించును)**

## అవయవములు అదురటవల్ల ఫలితములు

### పురుషులకు

కుడి కన్ను ధనలాభము. ఎడమ కన్ను ధన నష్టము. రెండ కన్నులు సామాన్య ఫలితము. నడినెత్తి బంధు, మిత్ర లాభము. నొసలు విజయ సూచకము. ముక్కు రోగభయము. పై పెదవి కలహము. క్రింద పెదవి భోజన సౌక్యము. గడ్డము ధన లాభము. కుడి చెక్కిలి కార్యసిద్ధి. ఎడమ చెక్కిలి దొంగల భయము. ఎడమ భుజము శత్రు భయము. కుడి భజము విజయ సంకేతము. చేతులు వాహనలాభము. రొమ్ము ధనలాభము. కుడితొడ సంతానఫలము. పాదములు ధార్మిక శుభము. పిక్కలు అభయప్రాప్తి. అరబోయి శత్రు భయము.

### స్త్రీలకు

ఎడమకన్ను శుభము. కుడికన్ను విరోధము. రెండు కన్నులు సామాన్య శుభము. నడినెత్తి రోగ ఉపశమనము. నొసలు ధనలాభం. పై పెదవి శతృపీడ. క్రిందిపెదవివిజయము. కుడిచెక్కిలి కార్యసిద్ధ. గడ్డము ధనలాభము. ఎడమచెక్కిలి భయము. కుడిభుజము శుభము. ఎడమ భుజము ఆందోళన. చేతులు శుభం. హృదయంఇష్టలాభం.అరచేయి భయం. కుడితొడ ఆందోళన. మోకాళ్ళు రోగం. పిక్కలు అలంకారములు. పాదములు సుఖ సంతోషం.

## విశేష ఫలములనిచ్చు నక్షత్రములు

'మూల' మామకు గండము. ఆశ్రేష అత్తకు గండము. 'మఖ' మూల వంటిది. 'విశాఖ' పురుషుడైన భార్యకు జలగండము. స్త్రీ అయిన భర్త యొక్క తమ్ములకు గండము. 'జ్యేష్ఠ' నక్షత్రము పురుషులైన భార్యాగ్రజులకు గండము. స్త్రీ అయిన భర్త యొక్క అన్నలకు కానీ అక్కలకు గానీ గండము.

## గ్రహముల శత్రు మిత్ర సమత్వ నిర్ణయ చక్రము

| గ్రహాలు | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు | చ-కు-గ | ర-బు | ర-గు-చ | ర-శు | ర-చ-కు | బు-శ | బు-కు |
| సములు | బు | కు-గు-శు-శ | కు-శ | శ-కు-గు | శ | కు-గు | గు |
| శత్రువులు | కు-శ | - | బు | చ | బు-శు | ర-చ | ర-చ-కు |

## గ్రహములు కలుగ చేసే రోగాలు

1. రవి - అతిసారము, జ్వరము, అగ్నిరోగము, మనోవ్యసనము
2. చంద్రుడు - స్త్రీ సంబంధవ్యాధి, కామెర్లు, నీరసము
3. కుజుడు - వ్రణములు, శస్త్రబాధ, శ్లేష్మకఫము
4. బుధుడు - ఉదరమందు నొప్పి, కాళ్ళు నొప్పులు
5. గురువు - కాళ్ళు మంటలు, మర్మస్థాన వ్యాధులు
6. శుక్రుడు - మేహ, మూత్రరోగములు, అతిమూత్రము, వికారము
7. శని - దారిద్ర, చోర, అస్థిరత్వ, మానసిక బాధలు
8. రాహువు - క్రిమిరోగము, పిచ్చి, బాధలు
9. కేతువు - దురద, నీచసాంగత్యము, శత్రుపీడ

జాతకుని దశాంతర్దశలను బట్టి పై రోగములు కలుగునని శాస్త్రము తెలియజేయుచున్నది.

## నవరత్నములు - ధరించు స్థానములు

| | | |
|---|---|---|
| వైఢూర్యం<br>కేతు | పుష్యరాగం<br>గురు | పచ్చ<br>బుధ |
| నీలం<br>శని | కెంపు<br>రవి | వజ్రం<br>శుక్ర |
| గోమేదికం<br>రాహువు | పగడం<br>కుజ | ముత్యం<br>చంద్ర |

## దిక్కులు

1. తూర్పు 2. పడమర

3. ఉత్తరం 4. దక్షిణం

## మూలలు

1. ఈశాన్యం 2. ఆగ్నేయం

3. నైరుతి 4. వాయువ్యం

## వాస్తు




## ధ్యాన స్తోత్రములు

కొన్ని సమయములందు పఠించవలసిన శ్లోకములు

### గురు ప్రార్థన



శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః

### గణేశస్తుతి

తొలుత నవిఘ్నమస్తనుచు ధూర్జటినంద నీకు మ్రొక్కెదన్
ఫలితము సేయుమయ్య నిను బ్రార్థన జేసెద నేకదంత నా
వలపలి చేతి గంటమున వాక్కున నెప్పుడు బాయకుండుమీ
తలపులలోన నీవెగతి దైవ వినాయక లోక నాయకా.।

### ప్రదక్షిణ నమస్కారము



శ్లో॥ యాని కానిచ పాపాని, జన్మాంతర కృతానిచ
తాని తాని ప్రణశ్యన్తి, ప్రదక్షిణ పదే పదే॥
సర్వపాప ప్రశమనం, సర్వసంపత్ప్రదాయకమ్
ప్రదక్షిణం కరోమీశ, తవ జ్ఞానప్రదాయినే॥
అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ
తస్మాత్ కారుణ్య భావేన, రక్షరక్ష జనార్ధన॥

### స్నానము చేయుటకు ముందు

శ్లో॥ అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివా
యః స్మరే త్పుండరీకాక్షం స బాహ్యాంభ్యతర శ్శుచిః॥

## స్నానము చేయునపుడు



శ్లో॥ గంగేచ యమునేకృష్ణే, గోదావరి సరస్వతి
నర్మదే సిన్ధో కావేరి, జలేస్మిన్ సన్నిధిం కురు॥
కావేరీ తుంగభద్రాచ, కృష్ణవేణీ చ గౌతమీ
భాగీరథీచ విఖ్యాతాః, పంచగంగాః ప్రకీర్తితాః॥
నందినీ నలినీ సీతా, మాలినీచ మహాపగా
విష్ణుపాదాబ్జ సంభూతా, గంగా త్రిపథగామినీ॥
భాగీరథీ భోగవతీ, జాహ్నవీ త్రిదశేశ్వరీ
ద్వాదశై తానినామాని, యత్ర యత్ర జలాశయే॥
తత్రతత్ర స్థితాగంగా, సర్వపుణ్య ఫలప్రదా
భవేత్ స్మరణమాత్రేణ, సర్వదేవనమస్కృతా॥

## భోజనము చేయుటకు ముందు

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహణి మాశ్రితః
ప్రాణా పానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం॥

## భోజనము చేయునపుడు

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్॥
బ్రహ్మైవ తేన గన్తవ్యం, బ్రహ్మకర్మ సమాధినా॥

## భోజనము చేసిన తరువాత

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణం చ శమ్యం చ బడబానలం
ఆహారపరిణామార్థం స్మరామి చ వృకోదరం॥

## నిద్రలేచునపుడు

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీ
కరమూలే స్థితాగౌరీ, ప్రభాతే కరదర్శనమ్॥

## నిద్రపోవునపుడు

శ్లో॥ రామంస్కందం హనూమంతం, వైనతేయం వృకోదరమ్
శయనే స్మరణం యస్య, దుస్వప్న స్తస్యనశ్యతి॥

## కషాయము తీసుకొనునపుడు

శ్లో॥ శరీరే జర్జరీభూతే, వ్యాధిగ్రస్తే కళేబరే,
ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిః॥

## గరుడ దర్శనము జేయునపుడు

శ్లో॥ కుంకుమాంకిత వర్ణాయ కుందేందు ధవళాయచ
విష్ణువాహ నమస్తుభ్యం పక్షిరాజాయతే నమః॥

## పిడుగు పడినపుడు

శ్లో॥ అర్జునః ఫల్గుణః పార్థః కిరీటీ శ్వేతవాహనః
భీభత్సు ర్విజయః కృష్ణ స్సవ్యసాచీ ధనంజయః॥

## సంధ్యా దీపదర్శనము చేయునపుడు

శ్లో॥ దీపః జ్యోతిః పరబ్రహ్మ దీపః సర్వతమో పహమ్
దీపేనా సాధ్యతే సర్వం సంధ్యాదీప నమోస్తుతే॥

*(సంధ్యా కాలమందు కాక పూజా సమయములందైనచో:-*
*"దీపానాసాధ్యతే సర్వం దీపదేవ నమోస్తుతే" అనవలెను)*

## అశ్వత్థ దర్శనము చేయునపుడు

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే
అగ్రత శ్శివరూపాయ వృక్షరాజాయతే నమః॥

## ప్రయాణమునకు ముందు

శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వ సంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం॥

## ఇంటినుంచి బయల్దేరునపుడు దుశ్శకున నాశమునకు

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం। యాదేవీ సర్వమంగళా
తయో స్సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగళం॥
లాభస్తేషాం జయస్తేషాం। కుతస్తేషాం పరాభవః
యేషా మిందీవరశ్యామో। హృదయస్థో జనార్ధనః॥
అగ్రతః పృష్ఠతశ్చైవ పార్శ్వతశ్చ మహాబలౌ:
ఆకర్ణపూర్ణధన్వానౌ। రక్షేతాం రామలక్ష్మణౌ॥
సన్నద్ధః కవచీ ఖడ్గ। చాపబాణధరోయువా
గచ్ఛన్మ మాగ్రతో నిత్యం। రామః పాతు సలక్ష్మణః॥

## నూతన వస్త్రములు ధరించుటకు శుభ దినములు

ఆదివారము : త్వరగతిని చిరుగును
సోమవారము : సోకం కలిగించును
మంగళవారము : అశుభమునిచ్చును
బుధవారము : అతి సుఖమిచ్చును
గురువారము : ఇంటికి చుట్టము వచ్చును
శుక్రవారము : వెంటనే వస్త్రములు వచ్చును
శనివారము : తొందరగా మాయును

## కన్నతల్లి ప్రార్థన

శ్లో॥ న గాయత్ర్యాః పరో మంత్రో, నమాతుః పరదేవతాః
న హరేః పరత స్త్రాతా, నాన్యతా త్పతకం పరమ్॥
శ్లో॥ తనురిద మభివృద్ధిం సమవాప్యాస్తే సర్వదేవతా శక్త్యా
దేవ్యా యయా వికలయా మాత్రే తస్యైనమోస్తుభవత్యై

## కన్నతండ్రి ప్రార్థన

శ్లో॥ యస్మాత్పార్థి వదేహః ప్రాదురభూ ద్యేన భగవతా గురుణా
సంతు నమాంసి సహస్రం, తస్మై సర్వజ్ఞమూర్తయే పిత్రే॥

## గాయత్రీ మంత్రము

శ్లో॥ యోదేవ స్సవితా స్మాకం ధియోధర్మాది గోచరాః
ప్రేరయే త్తస్య యద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే॥

## దీపం వెలిగించేటప్పుడు చేయుప్రార్థన

వత్తిలోని నలక వజ్రపునలక, పత్తిలోని నలక బంగారపు నలక
నలకలన్నీ నక్షత్రాలు, వెండి వత్తి, భౌళి వత్తి
కలన, మలిన కలిగి ఉన్న నాదీపం ఈశ్వరా! నాదీపం నా ఇల్లంతా వెలుతురు పరమేశ్వరా!
నాదీపం నను పాలించుచుండు ఇలాకోటి, తలాకోటి తద్ఫలం దీపదర్శనం

## శ్రీ ఆంజనేయ దండకం

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం ప్రకీర్తి ప్రదాయం భజే వాయుపుత్రం భజే వాలగాత్రం భజే హం పవిత్రం భజే సూర్యమిత్రం భజే రుద్ర రూపం భజే బ్రహ్మతేజం బటంచున్ ప్రభాతంబు సాయంత్రము న్నీనామ సంకీర్తనల్‌చేసి, నీరూపువర్ణించి నీమీద నే దండకం

బొక్కటిం జేయనూహించి నీమూర్తిగావించి నీసుందరంబెంచి నీదాసదాసా నుదాసుండనై రామ భక్తుండనై నిన్ను నేగొల్చెదన్ నీకటాక్షంబునన్ జూచితే వేడుకల్ జేసితే నా మొరాలించితే నన్ను రక్షించితే అంజానాదేవి గర్భాన్వయా దేవ నిన్నెంచ నేనెంతవాడన్ దయాశాలివై జూచితే దాతవై బ్రోచితే దగ్గరన్ నిల్చితే తొల్లి సుగ్రీవుసన్మంత్రివై స్వామికార్యంబు నందుండి శ్రీరామ సౌమిత్రులం జూచి వారి న్విచారించి సర్వేశు బూజించి యభ్భానుజుం బంటు గావించి యవ్వాలినింజంపి కాకుత్థ్సవీరుం దయాదృష్టి వీక్షించి కిష్కంధ కేతెంచి శ్రీరామకార్యర్థమై లంక కేతెంచియున్ లంకిణిన్ జంపి యున్ లంకయున్ గాల్చియున్ భూమిజం జూచి యానంద ముప్పొంగ నా యుంగరం బిచ్చి యారత్న మున్ దెచ్చి శ్రీరాము కున్నిచ్చి సంతోషునిన్ జేసి సుగ్రీవుడున్ అంగదున్ జాంబవంతాది నీలాదులం గూడి యాసేతువున్ దాటి యావానరుల్ మూక పెన్మూకలై దైత్యులం ద్రుంచగా రావణుండంత కాలాగ్ని రుద్రుండునై కోరి బ్రహ్మాండమైనట్టి యాశక్తినిన్ వేసి యాలక్ష్మణున్ మూర్ఛనొందింపగానప్పుడేపోయిసంజీవినిందెచ్చి సౌమిత్రికిన్నిచ్చి ప్రాణంబు రక్షించగా కుంభకర్ణాది వీరాళితో బోరి చెండాడి శ్రీరామ బాణాగ్ని వారంద రిన్ రావణున్ జంపగా నంత లోకంబు లానందమైయుండ నవ్వేళ యవ్వి భీషణున్వేడుకన్ దెచ్చి పట్టాభిషేకంబు చేయించి సీతా మహాదేవినిన్ దెచ్చి శ్రీరాముకున్నిచ్చి యయోధ్యకున్ వచ్చి పట్టాభిషేకంబు సంరంభమైయున్న నీకన్న నాకెవ్వరుం గూర్మి లేరంచు మన్నించినన్ రామభక్తి ప్రశస్తంబుగా నిన్ను నీనామసంకీర్తనల్జేసినన్ పాపముల్బాయులే భీతులు న్దీరులే భాగ్యముల్ గల్గులే సకల సామ్రాజ్యము స్సకల సంపత్తులుం గల్గునే వానరాకార యోభక్తమందార యపుణ్య పంచార యోధీర యోవీర! సర్వంబు నీవే గదా! తారక బ్రహ్మమంత్రంబు భావించుచున్ వజ్ర దేహంబునుం దాల్చి శ్రీరామ శ్రీరామ శ్రీరామ యంచున్ మనః ప్రీతిగా జిహ్వకుం జేర్చి చింతించునిన్నున్ సదాభక్తితో గొల్తు; నా జిహ్వపై నిల్చినన్నుం గటాక్షింపుమో వానరశ్రేష్ఠ! త్రైలోక్యసంచారివై రామ నామాక్షర ధ్యానివై బ్రహ్మతేజంబునన్ రౌద్రరూపంబుతోవచ్చి భూతాదివర్గంబులన్ శాకినీడాకినీప్రేత సంఘం బులన్ గాలి దయ్యంబులన్ నీదు వాలంబునం జుట్టి నేలం బడంగొట్టి నీ ముష్టి ఘాతంబులన్ బాహుదండంబులన్ ఖండ ఖండబులం జేసి కాలాగ్ని రుద్రుండవై లోకముల్ గాతువే, బ్రహ్మతేజః ప్రభాభాసితంబైన రూపంబునుం జూచి సంతోష చిత్తుండవై రమ్ము రమ్మోయి. నాముద్దు వీరాంజనేయా యటంచున్ స్తుతింపంగ గాంక్షించెదన్, నీ దయాదృష్టి వీక్షించి నన్నేలు నాసామి! యోరామ భక్తా! సదా బ్రహ్మచారీ! నమో వాయుపుత్రా నమస్తే నమస్తే నమస్తే నమః

# నవగ్రహ ప్రార్థనా శ్లోకములు

**(నిత్యపారాయణకు అత్యంత ఉపయోగకరమైనవి)**

గ్రహములు గోచార వశమునగాని దశాంతర్దశారీతినిగాని చెడు స్థానముల నుండిన ఆయా గ్రహములను పూజించాలి. అట్లు పూజించుట వలన గ్రహబాధలు తొలగును.

పట్టునవి, పీడించునని అని "గ్రహ" శబ్దమునకు అర్థము "పూర్వ" జన్మములోను వర్తమానమునందును చేయు పాపము వ్యాధి రూపముగాను, చిక్కుల మూలముగాను, బాధించుచుండును. ఇందుకు శాంతి కొరకు దానములు , జపములు మొదలైనవి జరిపించిన గ్రహశాంతి కలుగును.

**శ్లో॥ ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయ చ**
**గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః॥**



**1 రవి :** జపాకుసుమ సంకాశం। కాశ్యపేయం మహాద్యుతిమ్
తమో రిం సర్వపాపఘ్నం। ప్రణతో స్మి దివాకరమ్॥ **6వేలు**



**2 చంద్ర:** దధి శంఖ తుషారాభం । క్షీరార్ణవ సముద్భవమ్
నమామి శశినం సోమం । శంభో ర్మకుట భూషణమ్॥ **10వేలు**



**3 కుజ :** ధరణీగర్భ సంభూతం । విద్యుత్కాంతి సమప్రభమ్
కుమారం శక్తి హస్తం తం। మంగళం ప్రణమామ్యహమ్॥ **7వేలు**



**4 బుధ :** ప్రియంగుకలికాశ్యామం । రూపేణా ప్రతిమం బుధమ్
సౌమ్యం సత్వగుణోపేతం । తం బుధం ప్రణమామ్యహమ్॥ **17వేలు**



**5 గురు :** దేవా నాంచ ఋషీణాంచ । గురుం కాంచన సన్నిభమ్
బుద్ధిమంతం త్రిలోకేశం । తం నమామి బృహస్పతిమ్॥ **16వేలు**



**6 శుక్ర:** హిమకుందమృణాళాభం ।దైత్యానాం పరమం గురుమ్
సర్వశాస్త్ర ప్రవక్తారం । భార్గవం ప్రణమామ్యహమ్ ॥ **20వేలు**



**7 శని :** నీలాంజన సమాభావం । రవిపుత్రం యమాగ్రజమ్
ఛాయామార్తాండసంభూతం । తం నమామి శనైశ్చరమ్॥ **19వేలు**



**8 రాహు :** అర్ధకాయం మహావీరం । చంద్రాదిత్య విమర్దనమ్
సింహికాగర్భసంభూతం । తం రాహుం ప్రణమామ్యహమ్॥ **18వేలు**



**9 కేతు :** పలాశ పుష్ప సంకాశం । తారకాగ్రహమస్తకమ్
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం । తం కేతుం ప్రణమామ్యహమ్॥ **7వేలు**

## విభక్తి ప్రత్యయములు

| | | |
|---|---|---|
| డు,ము,వులు | - | ప్రథమ విభక్తి |
| నిన్,నున్,లన్,కూర్చి,గురించి | - | ద్వితీయ విభక్తి |
| చేతన్, చేన్, తోడన్, తోన్ | - | తృతీయ విభక్తి |
| కొఱకున్, కై | - | చతుర్థి విభక్తి |
| వలనన్, కంటెన్, పట్టి | - | పంచమ విభక్తి |
| కిన్, కున్, యొక్క, లోన్, లోపల | - | షష్ఠీ విభక్తి |
| అందున్, నన్ | - | సప్తమ విభక్తి |
| ఓ, ఓయి, ఓరి, ఓసి | - | సంబోధనా ప్రథమ విభక్తి |

## భాషాభాగములు

**1. నామవాచకం 2. సర్వనామం 3. విశేషణం 4. క్రియ 5. అవ్యయం**

**1.నామవాచకం** :- పేర్లను తెలుపు వాటిని నామవాచకమని అందురు.
ఉదా :- ఎ) రాముడు బి) కృష్ణుడు సి) సీత డి) ఆవు ఇ) కృష్ణానది

**2.సర్వనామం** :- నామవాచకమునకు బదులుగా వాడునది.
ఉదా :- ఎ) అతడు బి) వాడు 3) ఇతడు 4) ఈమె 5) ఆమె

**3.విశేషణం** :- వస్తువు యొక్క గుణాలను తెలుపునది.
ఉదా:- ఎ) తీపి బి) పులుపు సి) పొట్టి డి) చెడు ఇ) నలుపు

**4.క్రియ** :- పనిని గూర్చి తెలుపునది లేదా కర్త చేసే పనిని తెలుపు పదాలను క్రియలంటారు.
ఉదా:- ఎ) వస్తున్నాడు బి) చేస్తున్నాడు సి) రచించు డి) పాడెను ఇ) ఆడెను

**5.అవ్యయం** :- లింగ వచన విభక్తుల చేత మార్పు చెందిన పదాలను అవ్యలని అందురు.
ఉదా:- ఎ) ఆహా బి) అప్పుడు సి) ఔరా డి) కానీ సి) మరియు

## సమాపక క్రియ - అసమాపక క్రియ

**వాక్యాన్ని పూర్తిచేసేది సమాపక క్రియ ఇది 5 విధాలు.**

| | | |
|---|---|---|
| 1. భూతకాల క్రియ | - తిన్నాడు | - రచించాడు |
| 2. వర్తమానకాల క్రియ | - తింటున్నాడు | - రచిస్తున్నాడు |
| 3. భవిషత్కాల క్రియ | - తినబోతాడు | - రచించబోతాడు |
| 4. వ్యతిరేకార్థక క్రియ | - తినడు | - రచించాడు |
| 5. తద్ధర్మార్థక క్రియ | - తింటాడు | - రచిస్తాడు |



**అసమాపక క్రియ పూర్తి అర్థాన్ని ఇవ్వదు ఇవి ఆరు విధములు.**

**1.క్త్వార్థకం** :- ధాతువునకు 'ఇ' చేరుతుంది. వచ్చి, వెళ్ళి, మెచ్చి.

**2.వ్యతిరేకక్త్వార్థం** :- ధాతువునకు 'అక' చేరుతుంది. వినక, వెళ్ళక, తినక.

**3.శత్రర్థకం** :- ధాతువునకు 'చున్' చేరుతుంది. వినుచున్, కొట్టుచున్, వెళ్ళుచున్.

**4.తుమున్నర్థకం** :- ధాతువునకు 'అన్' చేరుతుంది. వ్రాయన్, కొట్టన్, రచించన్.

**5.చేదర్థకం** :- ధాతువునకు 'ఇనన్' చేరుతుంది. వినినన్, రచించినన్, పలికినన్.

**6.అనంతర్యార్థకం** :- ధాతువునకు 'దున్' చేరుతుంది. చదువుదున్, తినుదున్, వినుదున్

క్రియకు మూల రూపాన్ని ధాతువు అంటారు.

## ప్రయత్నాలు

**ఇవి రెండు విధాలు :- 1.బాహ్య ప్రయత్నం 2.అభ్యంతరం ప్రయత్నం**

బాహ్య ప్రయత్నం :- ముఖము యొక్క బాహ్య అనగా వెలుపలి భాగంలో ఉచ్ఛరించటానికి చేసే ప్రయత్నం

అభ్యంతరప్రయత్నం :- ముఖము యొక్క అంతర్భాగంలో ఉచ్ఛరించటానికి చేసే ప్రయత్నం.

**1.స్థానం 2.కరణం 3.ప్రయత్నం**

1.కదలికలేని ముఖ భాగాన్ని స్థానం అని అందురు. ఉదా :- పై పెదవి,అంగిలి,పై దవడ

2.ముఖము నందలి నాలుక చివర, క్రింద పెదవి మొదలైన కదలికలవల్ల పలుకు వాటిని కరణాలంటారు.

3.అక్షరాలు పలికేందుకు చేసేదే ప్రయత్నం.

## వ్యాకరణము ఛందస్సు

### గణవిభజన

**(గురువు - లఘువు)**

**గురువును U - రూపముతో సూచించవలెను.**

**లఘువును I - రూపముతో సూచించవలెను.**

**వీటినే దీర్ఘములు - హ్రస్వములని అందురు.**

దీర్ఘములనగా

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆ | ఈ | ఊ | ౠ | ఏ | ఐ | ఓ | ఔ | అం | అః | U |
| కా | కీ | కూ | కౄ | కే | కై | కో | కౌ | కం | కః | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అ | ఇ | ఉ | ఋ | ఎ | ఒ | I |
| క | కి | కు | కృ | కె | కొ | |

U
ఇవియే గాక నకారపొల్లుతో కూడిన అక్షరములు లన్ గురువులు

U I
ద్విత్వాక్షరములకు ముందున్న అక్షరములు ప్రొద్దు గురువులు

U I
సంయుక్తాక్షరములకు ముందున్న అక్షరములు రమ్య గురువులు

(సంయుక్త మనగా హల్లు క్రింద వేరే హల్లు వత్తు వచ్చుట)

ఈ గురులఘువులకు ఒక సూత్రము ఉన్నది. ఏ గణము కావలయునో అందుండి రెండక్షరములు తీసుకొనిన గణము వచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| **య గణం** | - | **య** | - | I U U |
| **మ గణం** | - | **మా** | - | U U U |
| **త గణం** | - | **తా** | - | U U I |
| **ర గణం** | - | **రా** | - | U I U |
| **జ గణం** | - | **జ** | - | I U I |
| **భ గణం** | - | **భా** | - | U I I |
| **న గణం** | - | **న** | - | I I I |
| **స గణం** | - | **స** | - | I I U |
| **వ గణం** | - | **ల** | - | I U |
| **గ** | - | **గం** | - | U |

**య** - హ్రస్వము కావున లఘువు - I
**మా** - దీర్ఘము కావున గురువు - U
**తా** - దీర్ఘము కావున గురువు - U
} **IUU యగణం** మిగిలినవి అట్లే

**సూర్యగణములు అనగా** : ఒకగురువు, ఒక లఘువు (UI)
లేదా మూడు లఘువులు (III)

**ఇంద్రగణములు :-**

**భ** - UII - భగణం
**ర** - UIU - రగణం
**త** - UUI - తగణం
**నల** - IIII - నగణం మూడు లఘువులు "ల"అనగా ఒక లఘువు
నగ - IIIU - నగణం మూడు లఘువులు 'గ' అనగా ఒక గురువు
సల - IIUI - సగణమనగా రెండు లఘువులు ఒక గురువు 'ల' అనగా ఒక లఘువు
గగ అనగా రెండు గురువులు UU (కంద పద్యమందు)

సూర్యగణములందు ఒక గురువు ఒక లఘువు 'గ'(U) 'ల'(I) అని అందురు.

**నోట్** : వృత్త జాతి పద్యములందు గణ విభజన చేయునప్పుడు మూడు మూడు అక్షరముల చొప్పున నిలువు గీత గీసి గురు లఘువులు గుర్తించవలయును. మిగిలిన పద్యములందు సూత్రమును, గణములను గుర్తించి ప్రవర్తించ వలయును.

# పద్యలక్షణములు

**ఉత్పలమాల** :- ఇందలి గణములు భ,ర,న,భ,భ,ర,వ ఈ పద్యమునకు నాలుగు పాదములుండును ప్రతి పాదమునకు భ,ర,న,భ,భ,ర,వ, అను గణములు వర్తించును. ప్రాసనియమము కలదు. యతి 1వ అక్షరము 10 వ అక్షరము యతి నాలుగు పాదములకు వర్తించును. పాదమునకు 20 అక్షరములు ఉండును ఇతి వృత్త జాతి పద్యము.

**చంపకమాల** :- ఇందలి గణములు న,జ,భ,జ,జ,జ,ర ఈ పద్యమునకు నాలుగు పాదములుండును. ప్రతి పాదమునకు న,జ,భ,జ,జ,జ,ర అను గణములు వర్తించును. ప్రాసనియమం కలదు. యతి 1వ అక్షరము 11వ అక్షరము. యతి నాలుగు పాదములకు వర్తించును. పాదమునకు 21 అక్షరములు ఉండును. ఇది వృత్తజాతి పద్యము.

**మత్తేభం** :- ఇందలి గణములు స,భ,ర,న,మ,య,వ ఈ పద్యమునకు నాలుగు పాదములుండును. ప్రతి పాదమునకు స,భ,ర,న,మయ,వ అనుగణములు వర్తించును. ప్రాసనియమం కలదు. యతి 1వ అక్షరం 14వ అక్షరం. యతి నాలుగు పాదములకు వర్తించును. పాదమునకు 20 అక్షరములు ఉండును. ఇది వృత్త జాతి పద్యము.

**శార్దూలం** :- ఇందలి గణములు మ,స,జ,స,త,త,గ ఈ పద్యమునకు నాలుగు పాదములుండును. ప్రతి పాదమునకు మ,స,జ,స,త,త,గ అను గణములు వర్తించును. ప్రాసనియమం కలదు. యతి 1వ అక్షరం 13వ అక్షరం. యతి నాలుగు పాదములకు వర్తించును. పాదమునకు 19 అక్షరము లుండును. ఇది వృత్తజాతి పద్యము.

**ఆటవెలది** :- ఇనగణ త్రయంబు, ఇంద్రద్వయంబు, హంసపంచకంబు ఆటవెలది. ఈ పద్యమునకు నాలుగు పాదములుండును. 1,3 పాదాలయందు 3 సూర్యగణములు 2 ఇంద్రగణములు 2,4 పాదాలయందు5 సూర్యగణములు వర్తించును. ప్రాసనియమం లేదు. యతి మొదటి గణము మొదటి అక్షరము, నాల్గొవ గణము మొదటి అక్షరము. యతి నాలుగు పాదములకు వర్తించును. యతి చెల్లనిచో ప్రాసయతి వాడవచ్చును. ఇది ఉపజాతి పద్యము.

**తేటగీతి** :- సూర్యుఁడొక్కడు, సురరాజులిద్దరు, దినకరద్వయంబు తేటగీతి. ఈ పద్యమునకు నాలుగు పాదములుండును.ఒక సూర్యగణము, రెండు ఇంద్రగణములు, రెండు సూర్యగణములు నాలుగు పాదములకు వర్తించును. ప్రాసనియమం లేదు. యతి చెల్లనిచో ప్రాసయతి వాడవచ్చును. ఇది ఉపజాతి పద్యం.

**సీసపద్యము** :- సీసపద్యమునకు ఎనిమిది పాదములుండును. 1,3,5,7 పాదములయందు నాలుగేసి ఇంద్రగణములు 2,4,6,8 పాదములయందు రెండేసి ఇంద్రగణములు రెండేసి సూర్యగణములు వర్తించును. మొదటి గణము మొదటి అక్షరము, మూడవ గణము మొదటి అక్షరము యతి స్థానము. యతి 8 పాదములకు వర్తించును. ప్రాసనియమం లేదు. సీస పద్యము తదుపరి ఆట వెలది కానీ, తేటగీతి గాని లేనిచో సీసము సంపూర్ణముకాదు.

**కందపద్యము** :- ఇందలి గణములు గగ,నల,స,భ,జ ఈ పద్యమునకు నాలుగు పాదములుండును. 1,3 పాదములయందు మూడేసి గణములు. 2,4 పాదములయందు ఐదేసి గణములు ఉండును. 1,3,5,7 బేసి గణముల యందు జగణము ఉండరాదు. 2,4 పాదాలయందు చివరి గణము గగకానీ, సగణముకానీ ఉండవలయును. 6వ గణమునందు తప్పని సరిగా జగణము కానీ 'నల' ముకానీ ఉండవలయును. ప్రాసనియమం కలదు. యతి 2,4 పాదములకు మాత్రమే వర్తించును. యతి మొదటి గణము - మొదటి అక్షరము, నాల్గవగణము - మొదటి అక్షరము ప్రాసనియమమనగా పద్యమునందు రెండవ అక్షరము ఏదైతే వచ్చునో మిగిలిన పాదములందు అదే అక్షరము వచ్చుట

**ఉదా** :- వంకాయ వంటి కూరయు
పంకజముఖిసీతవంటి భామామణియున్

**ఉత్పలమాల** :-

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| శ్రీ గురి | యింప సం | గరము | సేయుడు | త్రోయుడు | మాతృదుః | ఖమున్ |
| U I I | U I U | I I I | U I I | U I I | U I U | U I U |
| భ | ర | న | భ | భ | ర | వ |

**శ్రీ - సే యతి 1వ అక్షరం - 10 అక్షరం**

**చంపకమాల** :-

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఇది ప్ర | ళయాగ్ని | వోలె దె | సలెల్ల | ను గప్ప | ఁగ విస్ఫు | లింగముల్ |
| I I I | I U I | U I I | I U I | I U I | I U I | U I U |
| న | జ | భ | జ | జ | జ | ర |

**ఇ - లె ఇందలి 'ఎ' అను అక్షరమునకు యతి**
**1వ అక్షరము 11వ అక్షరము**

**మత్తేభం :-**

| నలినీ | బాంధవ | భానుత | ప్తరవి | కాంతస్యం | దినీహా | రకం |
|---|---|---|---|---|---|---|
| I I U | U I I | U I U | I I I | U U U | I U U | I U |
| స | భ | ర | న | మ | య | వ |

**న - ంత 1వ అక్షరం 14వ అక్షరం యతి**

**శార్దూలం :-**

| గాకూలం | కష పె | క్కు భంగు | లు వివే | క భ్రష్ట | సంపాత | ముల్ |
|---|---|---|---|---|---|---|
| U U U | I I U | I U I | I I U | U U I | U U I | U |
| మ | స | జ | స | త | త | గ |

**గా - క యతి 1వ అక్షరం 13వ అక్షరం**

**ఆటవెలది :-**

మొదటిపాదం :-

| ఉప్పు | కప్పు | రంబు | ఒక్కపో | లికనుండు |
|---|---|---|---|---|
| U I | U I | U I | U I U | I I U I |
| గ ల | గ ల | గ ల | ర | స ల |

**ఉ - ఒ యతి మొదటి గణం మొదటి అక్షరం నాల్గవ గణం మొదటి అక్షరం**

రెండవపాదం :-

| చూడ | చూడ | రుచల | జాడ | వేరు |
|---|---|---|---|---|
| U I | U I | I I I | U I | U I |
| గ ల | గ ల | న | గ ల | గ ల |

**5 సూర్యగణములు, చూ - జా యతి**

**తేటగీతి :-**

| బిలము | సొచ్చితి | మేనినం | దైలుక | చంపు |
|---|---|---|---|---|
| I I I | U I I | U I U | I I I | U I |
| న | భ | ర | న | గ ల |

**బి - దె యతి మొదటి గణం మొదటక్షరం నాల్గొవ గణం మొదటక్షరం**

**సీసపద్యం :-**

మొదటిపాదం :-

| ధర్మార్థ | కామసా | ధనకుప | కరణంబు |
|---|---|---|---|
| U U I | U I U | I I I I | I I U I |
| త | ర | నల | సల |

**ధ - ధ యతి మొదటి గణం మొదటి అక్షరం, మూడవ గణం మొదటి అక్షరం**

రెండవపాదం :- గృహనీతి | విద్యకు | గృహము | విమల

| గృహనీతి | విద్యకు | గృహము | విమల |
|---|---|---|---|
| I I U I | U I I | I I I | I I I |
| సల | భ | న | న |

గృ - గృ యతి

ఆటవెలది, తేటగీతి, సీసమందు ఇంద్రగణాలు పైన తెలిపిన విధముగా ఏవిధముగానైననూ వాడవచ్చును. అటులనే సూర్యగణములు కూడా! సూత్రమును అనగా నియమమును తప్పకుండగా!

**కందము** :-

| సంతత | గృహమే | ది ఫలం |
|---|---|---|
| U I I | I I U | I I U |
| భ | స | స |

**దీనిలో యతి ఉండదు**

| బంతయు | బడయం | గనోపు | ననుగుణ | భార్యా |
|---|---|---|---|---|
| U I I | I I U | I U I | I I I I | U U |
| భ | స | జ | నల | గగ |

**బ-న యతి మొదటి గణం మొదటి అక్షరం నాల్గొవ గణం మొదటి అక్షరం**

## యతి మైత్రిగల వర్ణాలు

**1.** అ,ఆ,ఐ,ఔ
**2.** ఇ,ఈ,ఋ,ౠ,ఎ,ఏ
**3.** ఉ,ఊ,ఒ,ఓ
**4.** క,ఖ,గ,ఘ
**5.** చ,ఛ,జ,ఝ
**6.** ట,ఠ,డ,ఢ
**7.** త,థ,ద,ధ
**8.** ప,ఫ,బ,భ,వ
**9.** పు,ఫు,బు,భు,ము
**10.** ల,ళ,డ
**11.** అ,య,హ
**12.** ర,ఱ
**13.** ఙ,ఞ,ణ,న,మ

**ప్రాస** :- పద్య పాదాలలోని రెండో అక్షరానికి ప్రాస అని పేరు. ప్రాసలో హల్లు సమంగా ఉంటే చాలు.

**ప్రాసయతి** :- ప్రాసాక్షరానికి, యతిస్థానం తరువాత ఉన్న అక్షరానికి యతి మైత్రి చేయడాన్ని ప్రాసయతి అంటారు.

## అలంకారాలు

**శబ్దాలంకారాలు** :- **1.**వృత్త్యను ప్రాసము **2.**ఛేకాను ప్రాసము **3.**లాటాను ప్రాసము **4.**యమకము **5.**ముక్తపదగ్రస్థము **6.**అంత్యానుప్రాసము

**అర్థాలంకారాలు** :- **1.**ఉపమాలంకారము **2.**రూపకాలంకారము **3.**ఉత్ప్రేక్ష **4.**అర్థాంతరన్యాసాలంకారము **5.**అతిశయోక్తి **6.**స్వభావోక్తి **7.**శ్లేష **8.**దృష్టాంతాలంకారము **9.**క్రమాలంకారము **10.**అనన్వయాలంకారము **11.**ప్రతీపాలంకారము మొ॥వి.

# హిందీ తెలుగు అక్షరమాల

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ

अ आ इ ई उ ऊ ऋ

ఏ ఐ ఓ ఔ అం అః

ए ऐ ओ औ अं अः

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ

क ख ग घ ङ च छ ज झ ञ

ట ఠ డ ఢ ణ త థ ద ధ న

ट ठ ड ढ ण त थ द ध न

ప ఫ బ భ మ య ర ల

प फ ब भ म य र ल

వ శ ష స హ క్ష త్ర జ్ఞ

व श ष स ह क्ष त्र ज्ञ

## గుణింతము గుర్తులు

ఆ ఇ ఈ ఉ ఊ ఋ ఏ ఐ ఓ ఔ అం అః

ा ि ी ु ू ृ े ै ो ौ ं ः

# बारहखडी హిందీ గుణింతము

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | కా | కి | కీ | కు | కూ | కృ | కె | కై | కొ | కౌ | కం | కః |
| क | का | कि | की | कु | कू | कृ | के | कै | को | कौ | कं | कः |
| ఖ | ఖా | ఖి | ఖీ | ఖు | ఖూ | ఖృ | ఖె | ఖై | ఖొ | ఖౌ | ఖం | ఖః |
| ख | खा | खि | खी | खु | खू | खृ | खे | खै | खो | खौ | खं | खः |
| గ | గా | గి | గీ | గు | గూ | గృ | గె | గై | గొ | గౌ | గం | గః |
| ग | गा | गि | गी | गु | गू | गृ | गे | गै | गो | गौ | गं | गः |
| ఘ | ఘా | ఘి | ఘీ | ఘు | ఘూ | ఘృ | ఘె | ఘై | ఘొ | ఘౌ | ఘం | ఘః |
| घ | घा | घि | घी | घु | घू | घृ | घे | घै | घो | घौ | घं | घः |
| చ | చా | చి | చీ | చు | చూ | చృ | చె | చై | చొ | చౌ | చం | చః |
| च | चा | चि | ची | चु | चू | चृ | चे | चै | चो | चौ | चं | चः |
| ఛ | ఛా | ఛి | ఛీ | ఛు | ఛూ | ఛృ | ఛె | ఛై | ఛొ | ఛౌ | ఛం | ఛః |
| छ | छा | छि | छी | छु | छू | छृ | छे | छै | छो | छौ | छं | छः |
| జ | జా | జి | జీ | జు | జూ | జృ | జె | జై | జొ | జౌ | జం | జః |
| ज | जा | जि | जी | जु | जू | जृ | जे | जै | जो | जौ | जं | जः |
| ఝ | ఝా | ఝి | ఝీ | ఝు | ఝూ | ఝృ | ఝె | ఝై | ఝొ | ఝౌ | ఝం | ఝః |
| झ | झा | झि | झी | झु | झू | झृ | झे | झै | झो | झौ | झं | झः |
| ట | టా | టి | టీ | టు | టూ | టృ | టె | టై | టొ | టౌ | టం | టః |
| ट | टा | टि | टी | टु | टू | टृ | टे | टै | टो | टौ | टं | टः |
| ఠ | ఠా | ఠి | ఠీ | ఠు | ఠూ | ఠృ | ఠె | ఠై | ఠొ | ఠౌ | ఠం | ఠః |
| ठ | ठा | ठि | ठी | ठु | ठू | ठृ | ठे | ठै | ठो | ठौ | ठं | ठः |
| డ | డా | డి | డీ | డు | డూ | డృ | డె | డై | డొ | డౌ | డం | డః |
| ड | डा | डि | डी | डु | डू | डृ | डे | डै | डो | डौ | डं | डः |
| ఢ | ఢా | ఢి | ఢీ | ఢు | ఢూ | ఢృ | ఢె | ఢై | ఢొ | ఢౌ | ఢం | ఢః |
| ढ | ढा | ढि | ढी | ढु | ढू | ढृ | ढे | ढै | ढो | ढौ | ढं | ढः |
| ణ | ణా | ణి | ణీ | ణు | ణూ | ణృ | ణె | ణై | ణొ | ణౌ | ణం | ణః |
| ण | णा | णि | णी | णु | णू | णृ | णे | णै | णो | णौ | णं | णः |
| త | తా | తి | తీ | తు | తూ | తృ | తె | తై | తొ | తౌ | తం | తః |
| त | ता | ति | ती | तु | तू | तृ | ते | तै | तो | तौ | तं | तः |
| థ | థా | థి | థీ | థు | థూ | థృ | థె | థై | థొ | థౌ | థం | థః |
| थ | था | थि | थी | थु | थू | थृ | थे | थै | थो | थौ | थं | थः |

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ద | దా | ది | దీ | దు | దూ | దృ | దె | దై | దొ | దౌ | దం | దః |
| द | दा | दि | दी | दु | दू | दृ | दे | दै | दो | दौ | दं | दः |
| ధ | ధా | ధి | ధీ | ధు | ధూ | ధృ | ధె | ధై | ధొ | ధౌ | ధం | ధః |
| ध | धा | धि | धी | धु | धू | धृ | धे | धै | धो | धौ | धं | धः |
| న | నా | ని | నీ | ను | నూ | నృ | నె | నై | నొ | నౌ | నం | నః |
| न | ना | नि | नी | नु | नू | नृ | ने | नै | नो | नौ | नं | नः |
| ప | పా | పి | పీ | పు | పూ | పృ | పె | పై | పొ | పౌ | పం | పః |
| प | पा | पि | पी | पु | पू | पृ | पे | पै | पो | पौ | पं | पः |
| ఫ | ఫా | ఫి | ఫీ | ఫు | ఫూ | ఫృ | ఫె | ఫై | ఫొ | ఫౌ | ఫం | ఫః |
| फ | फा | फि | फी | फु | फू | फृ | फे | फै | फो | फौ | फं | फः |
| బ | బా | బి | బీ | బు | బూ | బృ | బె | బై | బొ | బౌ | బం | బః |
| ब | बा | बि | बी | बु | बू | बृ | बे | बै | बो | बौ | बं | बः |
| భ | భా | భి | భీ | భు | భూ | భృ | భె | భై | భొ | భౌ | భం | భః |
| भ | भा | भि | भी | भु | भू | भृ | भे | भै | भो | भौ | भं | भः |
| మ | మా | మి | మీ | ము | మూ | మృ | మె | మై | మొ | మౌ | మం | మః |
| म | मा | मि | मी | मु | मू | मृ | मे | मै | मो | मौ | मं | मः |
| య | యా | యి | యీ | యు | యూ | యృ | యె | యై | యొ | యౌ | యం | యః |
| य | या | यि | यी | यु | यू | यृ | ये | यै | यो | यौ | यं | यः |
| ర | రా | రి | రీ | రు | రూ | రృ | రె | రై | రొ | రౌ | రం | రః |
| र | रा | रि | री | रु | रू | रृ | रे | रै | रो | रौ | रं | रः |
| ల | లా | లి | లీ | లు | లూ | లృ | లె | లై | లొ | లౌ | లం | లః |
| ल | ला | लि | ली | लु | लू | लृ | ले | लै | लो | लौ | लं | लः |
| వ | వా | వి | వీ | వు | వూ | వృ | వె | వై | వొ | వౌ | వం | వః |
| व | वा | वि | वी | वु | वू | वृ | वे | वै | वो | वौ | वं | वः |
| శ | శా | శి | శీ | శు | శూ | శృ | శె | శై | శొ | శౌ | శం | శః |
| श | शा | शि | शी | शु | शू | शृ | शे | शै | शो | शौ | शं | शः |
| ష | షా | షి | షీ | షు | షూ | షృ | షె | షై | షొ | షౌ | షం | షః |
| ष | षा | षि | षी | षु | षू | षृ | षे | षै | षो | षौ | षं | षः |
| స | సా | సి | సీ | సు | సూ | సృ | సె | సై | సొ | సౌ | సం | సః |
| स | सा | सि | सी | सु | सू | सृ | से | सै | सो | सौ | सं | सः |
| హ | హా | హి | హీ | హు | హూ | హృ | హె | హై | హొ | హౌ | హం | హః |
| ह | हा | हि | ही | हु | हू | हृ | हे | है | हो | हौ | हं | हः |
| క్ష | క్షా | క్షి | క్షీ | క్షు | క్షూ | క్షృ | క్షె | క్షై | క్షొ | క్షౌ | క్షం | క్షః |
| क्ष | क्षा | क्षि | क्षी | क्षु | क्षू | क्षृ | क्षे | क्षै | क्षो | क्षौ | क्षं | क्षः |

# హిందీ తెలుగు అంకెలు

| | | | |
|---|---|---|---|
| १. एक | ఏక్ | ఒకటి | |
| २. दो | దో | రెండు | |
| ३. तीन | తీన్ | మూడు | |
| ४. चार | చార్ | నాలుగు | |
| ५. पाँच | పాంచ్ | ఐదు | |
| ६. छे | ఛే | ఆరు | |
| ७. सात | సాత్ | ఏడు | |
| ८. आठ | ఆఠ్ | ఎనిమిది | |
| ९. नौ | నౌ | తొమ్మిది | |
| १०. दस | దస్ | పది | |
| ११. ग्यारह | గ్యారహ్ | పదకొండు | |
| १२. बारह | బారహ్ | పన్నెండు | |
| १३. तेरह | తేరహ్ | పదమూడు | |
| १४. चौदह | చౌదహ్ | పద్నాలుగు | |
| १५. पंद्रह | పంద్రహ్ | పదిహేను | |
| १६. सोलह | సోలహ్ | పదహారు | |
| १७. सत्रह | సత్రహ్ | పదహేడు | |
| १८. अठारह | అఠారహ్ | పద్దెనిమిది | |
| १९. उन्नीस | ఉన్నీస్ | పందొమ్మిది | |
| २०. बीस | బీస్ | ఇరవై | |
| २१. इक्कीस | ఇక్కీస్ | ఇరవై ఒకటి | |
| २२. बाईस | బాయీస్ | ఇరవై రెండు | |
| २३. तेईस | తేయీస్ | ఇరవై మూడు | |
| २४. चौबीस | చౌబీస్ | ఇరవై నాలుగు | |
| २५. पच्चीस | పచ్చీస్ | ఇరవై ఐదు | |
| २६. छब्बीस | ఛబ్బీస్ | ఇరవై ఆరు | |
| २७. सत्ताईस | సత్తాయీస్ | ఇరవై ఏడు | |
| २८. अठ्ठाईस | అఠ్ఠాయీస్ | ఇరవైఎనిమిది | |
| २९. उन्तीस | ఉన్తీస్ | ఇరవైతొమ్మిది | |
| ३०. तीस | తీస్ | ముప్పై | |
| ३१. इक्तीस | ఇక్తీస్ | ముప్పై ఒకటి | |
| ३२. बत्तीस | బత్తీస్ | ముప్పై రెండు | |
| ३३. तैंतीस | తైంతీస్ | ముప్పై మూడు | |
| ३४. छौंतीस | చౌన్తీస్ | ముప్పై నాలుగు | |
| ३५. पैन्तीस | పైన్తీస్ | ముప్పై ఐదు | |
| ३६. छत्तीस | ఛత్తీస్ | ముప్పై ఆరు | |
| ३७. सैन्तीस | సైన్తీస్ | ముప్పై ఏడు | |
| ३८. अडतीस | అడతీస్ | ముప్పై ఎనిమిది | |
| ३९. उनचालीस | ఉన్‌చాలీస్ | ముప్పై తొమ్మిది | |
| ४०. चालीस | చాలీస్ | నలభై | |
| ४१. इक्तालीस | ఇక్తాలీస్ | నలభై ఒకటి | |
| ४२. बयालीस | బయాలీస్ | నలభై రెండు | |
| ४३. तैंतालीस | తైన్తాలీస్ | నలభై మూడు | |
| ४४. छौन्तालीस | చౌన్తాలీస్ | నలభై నాలుగు | |
| ४५. पैंतालीस | పైన్తాలీస్ | నలభై ఐదు | |
| ४६. छियालीस | ఛియాలీస్ | నలభై ఆరు | |
| ४७. सैंतालीस | సైన్తాలీస్ | నలభై ఏడు | |
| ४८. आडतालीस | అడతాలీస్ | నలభై ఎనిమిది | |
| ४९. उनचास | ఉన్చాస్ | నలభై తొమ్మిది | |
| ५०. पचास | పచాస్ | యాభై | |
| ५१. इक्कावन | ఇక్కావన్ | యాభై ఒకటి | |
| ५२. बावन | బావన్ | యాభై రెండు | |
| ५३. तिरपन | తిర్‌పన్ | యాభై మూడు | |
| ५४. चौपन | చౌపన్ | యాభై నాలుగు | |
| ५५. पचपन | పచపన్ | యాభై ఐదు | |
| ५६. छप्पन | చప్పన్ | యాభై ఆరు | |
| ५७. सप्पन | సప్పన్ | యాభై ఏడు | |
| ५८. सत्तावन | సత్తావన్ | యాభై ఎనిమిది | |
| ५९. उनसठ | ఉన్‌సఠ్ | యాభై తొమ్మిది | |
| ६०. सठ | సఠ్ | అరవై | |
| ६१. इक्सठ | ఇక్‌సఠ్ | అరవై ఒకటి | |
| ६२. बासठ | బాసఠ్ | అరవై రెండు | |
| ६३. तिरसठ | తిరసఠ్ | అరవై మూడు | |
| ६४. चौसठ | చౌసఠ్ | అరవై నాలుగు | |

# అంతరిక్షయానము

1910వ సంవత్సరంలో రైట్ సోదరులు తాము కనిపెట్టిన విమానం ద్వారా ఆకాశ యానానికి నాంది పలికారు. అప్పటి నుండి అంతరిక్షయానం పైఅనేకపరిశోధనలు జరుగుతూనేఉన్నాయి. తరువాత 1957లో రష్యాశాస్త్రజ్ఞులు రూపొందించిన స్పుత్నిక్ - 1 అనే కృత్రిమ ఉపగ్రహం మొట్టమొదటి సారిగా భూ కక్ష్యలో పరిభ్రమించి రేడియో సంకేతాలను పంపింది.

1.తరువాత జనవరి 31, 1958లో అమెరికా వారు ఎక్స్ ప్లోరర్ -1 ను అంతరిక్షంలోకి పంపి అంతరిక్షం యొక్క వయస్సును, భూమి యొక్క అయస్కాంత క్షేత్రమును కనుగొన్నారు.

తరువాత 1961వ సం॥లో 'యూరీగెగారిన్' అనే రష్యా దేశస్థుడు మొట్టమొదటి సారిగా రోదసీలో సంచరించి, మొట్టమొదటి 'వ్యోమగామి'గా చరిత్రకెక్కడమే కాక, రోదసీ యానానికి శ్రీకారం చుట్టాడు. ఇతను సంచరించిన తేదీ 12-4-1961. ఆ తదుపరి మే 5, 1961లో మెర్క్యురి-3 అను అంతరిక్ష నౌకలో అలెన్ షెపార్డ్ అను అమెరికా వ్యోమగామి అంతరిక్షయానం చేసి భూమిచుట్టూ 89.34 నిముషములలో పరిభ్రమించినాడు. తరువాత 16-6-63లో రష్యాకు చెందిన 'వెలంటీనా తెరిస్కోవా' అనే మహిళకూడ అంతరిక్షయానం చేసి ప్రథమ మహిళా వ్యోమగామినిగా ప్రసిద్ధికెక్కింది. తరువాత చాలా మంది అంతరిక్షయానం చేశారు. 'నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్, ఎడ్విన్ ఆల్డ్రిన్, మైకేల్ కాలిన్స్' అనే యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన వ్యోమగాములు రోదసీ యాత్రచేసి 1969జూలై 21వ తేదీ చంద్రమండలంపై మొట్టమొదట కాలుమోపి చరిత్ర సృష్టించారు.

ఆ తరువాత అంగారక గ్రహంపై పరిశోధనలు ప్రారంభమై ఇప్పటికీ కొనసాగుతూనే ఉన్నాయి. 1997వ సంవత్సరంలో పాత్‌ఫైండర్ అనే అంతరిక్ష నౌక అంగారక గ్రహంపై దిగి, ఎన్నో పరిశోధనలు చేసింది. వాయేజర్ అనే అంతరిక్ష నౌక సూర్యమండలాన్ని పరిశోధించుటకై ప్రయోగించబడింది.

ఈ రోదసీ పరిశోధన ఫలితాలేమిటని ఒకసారి విశ్లేషిస్తే, ఉప్పెనలు, తుఫానులు, భూగర్భ సంబంధమైన అనేక వివరములు, ప్రచండ వాయువుల ఉనికి, వాయుగుండాల ఉనికి, వాతావరణం మార్పులు ముందుగా తెలిసికొనుట ద్వారా తగిన జాగ్రత్తలు తీసుకుని జనజీవనానికి ఆటంకం ఏర్పడకుండా సురక్షిత ప్రాంతాలకు తరలించవచ్చును. వార్తా ప్రసార రంగ అభివృద్ధికై కృత్రిమ ఉపగ్రహాలు ఎంతో తోడ్పడుతున్నాయి.

3.1984 ఏప్రిల్ 3వ తేదీ ఇండియాకు ఖగోళ శాస్త్ర చరిత్రలో ఒక ప్రత్యేక రోజుగా గుర్తించడము జరిగింది. ఆ రోజు రష్యా సహకారంతో భారతపౌరుడు, ప్రప్రథమ వ్యోమగామి స్క్వాడ్రన్ లీడర్ రాకేశ్ శర్మ సోయూజ్-T-II అను రోదసీ నౌక ద్వారా అంతరిక్షయానం చేసి వచ్చినాడు.

# భౌతిక శాస్త్రం

ద్రవ్యం,శక్తి మొ॥ అంశాలను అధ్యయనం చేసే శాస్త్రాన్ని 'భౌతిక శాస్త్రం' అంటారు. భౌతికశాస్త్రనియమాలవల్ల మానవుడురోదసీలోను,కృత్రిమ ఉపగ్రహాలను భూ కక్ష్యలలో దింపడానికి కారణం. 17వ శతాబ్దంలో ఐజాక్ న్యూటన్ భూమిపైగలవస్తువులగమనంపై3గతినియమాలుంటాయనిచెప్పాడు.వీటిఆధారంగానే జల, వాయు, భూ వాహనాలు యంత్ర జగత్తు పనిచేస్తున్నాయి.

**1.శుద్ధ గతిశాస్త్రం :-** గతిశాస్త్రం, స్థితి శాస్త్రములను గురించి తెల్పేది శుద్ధగతి శాస్త్రము.

**2.గతి శాస్త్రం :-** బల ప్రభావంలో ఉన్న వస్తువు చలనాన్ని గురించి తెలిపే శాస్త్రాన్ని గతిశాస్త్రం అంటారు.

**3.స్థితి శాస్త్రం :-** బల ప్రభావంలో ఉన్న వస్తువు సమతాస్థితిని గురించి తెలిపే శాస్త్రాన్ని స్థితి శాస్త్రం అంటారు.

**4.వాయు శాస్త్రం :-** వివిధ రకముల వాయువుల గురించి తెలిపే శాస్త్రాన్ని వాయు శాస్త్రము అంటారు.

20వ శతాబ్దంలో ఐన్‌స్టీన్‌సాపేక్షసిద్ధాంతం భౌతికశాస్త్రంను మరోఅడుగు నడిపించింది. లేజర్లు కనిపెట్టిన తర్వాత అవి మానవ జీవితాన్ని సుఖప్రదం చేసాయి.

**LASER** అనగా **Light Amplification by Stimulated Emission of Radiation.** సాధారణ కాంతి విభిన్న కాంతి తరంగ ధైర్ఘ్యాలను కల్గి ఉంటుంది. కాని లేజర్ కాంతి తరంగాలు ఒకే తరంగ ధైర్ఘ్యంతో సన్నని కాంతి పుంజమై శక్తి వంతంగా పనిచేస్తాయి. శస్త్ర చికిత్సలోను, ఇనుమును కోయుటకు సంగీతం పాడించుటలోను లేజర్లు ఉపయోగపడతాయి.
భైతిక శాస్త్రంలో 12 శాఖలున్నాయి.

# భౌతిక శాస్త్రం - శాఖలు

**1.శబ్ద శాస్త్రము :-** వివిధ ధ్వని తరంగాల గురించి తెలియజేయు శాస్త్రం.

**2.పరమాణు భౌతిక శాస్త్రం :-** లోహ,అలోహ పరమాణువు, పరమాణువు యొక్క నిర్మాణం, ధర్మాలు, సూత్రాలను తెలుపు శాస్త్రం.

**3.జీవ భౌతిక శాస్త్రం :-** మొక్కలు జంతువులలో జీవ క్రియలను, భౌతిక ధర్మాలను అధ్యయనం చేసే శాస్త్రం

**4.విద్యుత్ శాస్త్రం :-** విద్యుత్ మరియు యాంత్రిక శాస్త్రాలసంబంధాన్ని తెలుపు శాస్త్రం.

**5.యాంత్రిక శాస్త్రం :-** నిశ్చల స్థితిలో కదులుతున్న వివిధ వస్తువుల గమనము మరియు వివిధ యంత్రాల గురించి అధ్యయనం చేసే శాస్త్రం.

**6.కేంద్ర భౌతిక శాస్త్రం :-** పరమాణు కేంద్రాన్ని దానిలో జరుగు భౌతిక, రసాయనిక మార్పులను తెలుపు శాస్త్రం.

**7.అతి శీతల శాస్త్రం :-** అతి శీతల ఉష్ణోగ్రతలను గురించి తెలుపు శాస్త్రం.

**8.కాంతి శాస్త్రం :-** వివిధ కాంతులను గురించి అధ్యయనం చేసే శాస్త్రం.

**9.ఘనస్థితి భౌతిక శాస్త్రం :-** ఘనస్థితిలోగల వివిధ మూలకాల ధర్మాలను, సూత్రాలను తెలుపు శాస్త్రం.

**10.ద్రవ భౌతిక శాస్త్రం :-** వివిధ రకాలద్రవములు, వాయువుల ధర్మాలను తెలుపు శాస్త్రం.

**11.భూ భౌతిక శాస్త్రం :-** భూమి ఉపరితలం మరియు, భూమి పొరలలోని విషయాలను అధ్యయనం చేసే శాస్త్రం.

**12.తాప గతిశాస్త్రం :-** ఉష్ణము – ఉష్ణశక్తి – పనులు గురించి తెలుపు శాస్త్రం.

## రసాయన శాస్త్రం

ద్రవ్యంఅంటే రసాయనిక మూల ద్రవ్యాల మిశ్రమం. ఈ మూలద్రవ్యాలు ఒక దానితో ఒకటికి సంబంధం ఉండదు. ఈ మూల ద్రవ్యాలనే మూలకాలు అంటారు. వీటి అధ్యయనాన్నే రసాయన శాస్త్రం అంటారు.

మూలకాలన్నీ పరమాణువులతో నిర్మించబడి ఉంటాయి. ఈ పరమాణువుల నిర్మాణము వివిధ రకాల బంధాలతో ఉంటుంది. వీటి మధ్య ప్రోటానులలో కూడిన కేంద్రకం ఉంటుంది. ఇవి ధన విద్యుదావేశం కలవి. కేంద్రకం చుట్టూ ప్రోటానుల సంఖ్యకు సమానంగా ఋణవిద్యుదావేశం గల ఎలక్ట్రానులు భిన్న కక్ష్యలలో పరిభ్రమిస్తూ ఉంటాయి.

**1.పరమాణు :-** ఎలక్ట్రాన్, ప్రోటాన్, న్యూట్రాన్‌లను పరమాణువు అంటారు.

**2.న్యూక్లియన్‌లు :-** పరమాణు కేంద్రకములో గల ప్రోటాన్‌లను, న్యూట్రాన్‌లను న్యూక్లియన్‌లు అంటారు.

**3.కక్ష్య :-** కేంద్రకము చుట్టూ ఎలక్ట్రాన్‌లు తిరిగే ప్రదేశము కక్ష్య అంటారు.

**4.పరమాణు సంఖ్య :-** పరమాణువులోని ప్రోటీనుల సంఖ్యని పరమాణు సంఖ్య అంటారు.

వీటినిప్రత్యేకమైనపేర్లతోచదువుతారు.వాటిని సాంకేతిక నామాలంటారు. దీనివల్లఅణునిర్మాణంలోఉన్నమూలకాలవివరాలు అణువులతో సహా తెలుస్తాయి.

**ఉదా :-** నీటి రసాయనిక నామం $H_2O$ దీనిలో H అనగా హైడ్రోజన్, O అనగా ఆక్సిజన్, క్రింద ఉన్న సంఖ్య అందులోని పరమాణువుల సంఖ్యను తెలియచేస్తుంది. దీనిని బడట్టి నీటి అణువునందు 2 హైడ్రోజన్ పరమాణువులు. ఒక ఆక్సిజన్ పరమాణువు ఉన్నదని తెలుస్తున్నది.

ఈ మూలకాలన్నింటిని ఒక క్రమపద్ధతిలో రసాయనిక ధర్మాలు, పరమాణుభారాల ఆధారంగా మూలద్రవ్యాలఆవర్తన పట్టికను రష్యా శాస్త్రవేత్త మెండలీఫ్ రూపొందించెను. తనకు తెలియని మూలద్రవ్యాలస్థానాలను ఊహించి పట్టికలో ఖాళీ ఉంచాడు. ఈనాడు అవి మెండలీఫ్ ఊహించిన విధంగానే చెప్పబడ్డాయి.

# జీవశాస్త్రం

**బాక్టీరియా :-** ఇది అతి సూక్ష్మజీవి. అంగుళము నుంచి అంతకంటె కూడా చిన్నగా ఉంటాయి. ఇవి ఏక కణజీవులు. బాక్టీరియా నాలుగు రకాలు గుండ్రంగా ఉండేవి కోకస్. సన్నగా తీగలా ఉండేవి బేసిలస్ అనీ స్ప్రింగ్ చుట్టవలె ఉండేవి స్పైర్లమ్ అనీ కామా ఆకారంలో ఉండేవి వైబ్రియా అని పిలుస్తారు. బక్టీరియా రెండు రకాలుగా ఉంటాయి. 1) ఉపయోగకరమైనవి 2) హానికరమైనవి.

**ఉపయోగరకరమైన బాక్లీరియా :-** పాలను పెరుగుగా మార్చటానికి రెనిన్ అనే బాక్టీరియా ఉపయోగపడుతుంది. నెమరువేసె జంతువుల జీర్ణాశయంలో బాక్టీరియా ఉంటుంది. ఈ బాక్టీరియా మూలాన తీసుకున్న ఆహారం జీర్ణమవుతుంది. ఎరువుల తయారీకి రొట్టెల పిండి పులవటానికి మందుల తయారీలో కూడా బాక్టీరియా ఉపయోగపడుతుంది.

**హానికరమైన బాక్టీరియా:-** ఈబాక్టీరియామూలాన టీ.బి., కలరా, విరోచనాలు, ర్మ వ్యాధులు వస్తాయి. ఈ బాక్టీరియా మూలాన పంటల దిగుబడి తగ్గుతుంది.

**వైరెస్ :-** ఈ వైరెస్ కూడా బాక్టీరియా వంటి సూక్ష్మజీవి. దీనిని 1888లో మేయర్అనే అతను కనుగొన్నాడు. ఇది వివిధ రూపాలలో, వివిధ పరిమాణాలలో ఉంటుంది. ఈవైరెస్ ప్రాణంతకరమైన జబ్బులను కలుగుజేస్తుంది. ఉదాహరణకు వరి అగ్గి తెగులు. ఒక అకుకు వైరెస్ మూలాన చీడ వస్తే అది ఆ మొక్క నుంచి మొత్తం పంట అంతా వ్యాపిస్తుంది. ఇది మొక్కలకే కాదు మనుషులకు, జంతువులకు, పక్షులకు, చెట్లకు కూడా వస్తుంది. మనుషులకు వైరెస్ ద్వారా అనేక రోగములు కలుగుతాయి. పోలియో, పొంగు, రబీస్, కామెర్లు, పక్షవాతం, అమ్మవారు, రొంప ఇలాగ ఎన్నో రకాలైన రోగములను ఈ వైరెస్ కలుగజేస్తుంది. మనుషులలో ఈ వైరెస్ వల్ల వచ్చే రోగాలకు ఏంటి బయోటిక్ వాడతారు. ఈ వైరెస్ ఒకళ్ళ నుంచి ఒకళ్ళకి త్వరగా వ్యాపిస్తుంది. దీని పరిమాణం బాక్టీరియా కన్నా చిన్నగా ఉండటం మూలన ఇది తేలికగా వాతావరణంలో ప్రవేశిస్తుంది. కనుక కొన్ని వైరెస్‌లపై వాతావరణ ప్రభావం ఉంటుంది. కనుక వీటిని చంపటానికి క్లోరిన్, హైడ్రోక్లోరిక్ ఆమ్లములను వాడతారు.

**ఏంటిబయోటిక్స్ :-** మనశరీరంలో సూక్ష్మజీవుల వల్ల వచ్చే రోగాలకు మనం తీసుకునే మందులను ఏంటిబయోటిక్స్ అంటారు. మొట్టమొదటి సారిగా దీనిని అలెగ్జాండర్ ఫ్లెమింగ్ అనే అతనుపెన్సిలిన్‌ని కనిపెట్టాడు. ఇది పందుల నుంచి తయారు చేయబడినది. ఆ తర్వాత స్ట్రెప్టోమైసిన్, ఏంపిసిలిన్, టెట్రాసైక్లిన్, క్లోరోమైసిటిన్ మొదలగు ఏంటిబయోటిక్ మందులను కనిపెట్టారు.

ఇదిదగ్గు,గొంతువాపు, కురుపులనుతగ్గిస్తుంది.కొంతమందికి ఏంటి బయోటిక్స్ పడవు. వీటిమూలాన వాళ్ళకు శరీరంపై దురదలు నాలుకపై పుళ్ళు పడుట, తూలు రావటం మొదలైనవి జరుగుతాయి. కొన్ని కొన్ని సమయాలలో మరణం కూడా సంభవించవచ్చు.

**పాలు :-** ఆవు, గేదె, గొర్రె, మేక, ఒంటె మొదలైన జంతువులు మనకు పాలు ఇస్తాయి. మనం రోజూతీసుకునే ఆహారంలో పాలు కూడా ఒకటి. ఇది మనకు ఆరోగ్యానికి కావాల్సిన పోషకపదార్థాలన్నీ ఉంటాయి. ఈపాలల్లో మాంసపు కృతులు, క్రొవ్వు పదార్థాలు, విటమిన్లు, లవణాలు ఉన్నాయి. ఆవు పాలలో 87.2% నీరు, 3.7% క్రొవ్వు, 3.5% మాంసకృతులు, 4.9% చెక్కెర కలిగి ఉంటాయి. పాలల్లో ఏ,బి,సి,డి విటమిన్లు ఉన్నాయి. పాలల్లో ఉన్న క్రొవ్వు పదార్థాలు మూలంగా మనకు శక్తి లభిస్తుంది. ప్రతి రోజూ పాలను తీసుకోవటం వలన విటమిన్ల వలన వచ్చే రోగాలను అరికట్టవచ్చు. ఒంటె పాలు అతిఖరీదు అయిన పాలుకింద పరగణించవచ్చు. ఈ పాలల్లో రోగనిరోధక శక్తి అధికంగా ఉంటుంది. ఈ పాలు ఆరు నెలల వరకు నిల్వ ఉంటాయి.

**విటమిన్లు:-** ఈ విటమిన్లు అయిదు రకాలు. మనం ఆరోగ్యవంతంగా ఉండా లంటే మనం తీసుకునే ఆహారంలో పిండి పదార్థాలు, క్రొవ్వు, మాంసకృత్తులు, లవణాలు, విటమిన్లు, నీరు అనేవి ఉండాలి.

ప్రస్తుతం 20 రకాల విటమిన్లను కనుగొన్నారు. వాటిలో ముఖ్యమైనవి ఏ,బి,సి,డి,ఇ,కె. ఈ విటమిన్లు లోపించటం వలన అనేక రకమైన వ్యాధులు వస్తాయి. ఇవి ముఖ్యంగా చిన్న పిల్లల్లో త్వరగా బయటపెడుతుంది. పిల్లల్లో ఈవిటమిన్ల లోపం వల్ల వచ్చేది క్యాష్వోకర్సీ అని అంటారు. ఈ వ్యాధి వచ్చిన వారికి పొట్ట పెద్దదిగానూ, కాళ్ళు చేతులు సన్నబడి ఆకలి వెయ్యకపోవటం వంటి లక్షణాలు కలిగి ఉంటారు.

**విటమిన్ ఏ :-** ఇది పాలు, వెన్న, జున్ను, మీగడ, గుడ్లు, చేప, వంటనూనె, క్యాబేజి, క్యారెట్ ఇటువంటి వాటిలో అధికంగా లభిస్తుంది. 'ఏ' విటమిన్ శరీర పెరుగుదలకు చాలా అవసరము. 'ఏ' విటమిన్ లోపం మూలాన రేచీకటి, చూపుతగ్గుట, చర్మరోగాలు అంటువ్యాధులు మొదలైనవి కలుగుతాయి.

**-: విటమిన్ బి :-**

**1. థైమిన్ (బి1) :-** ఇది పందిమాంసములో మరియు పులిసిన పదార్థాలలో అధికంగా ఉంటుంది. ఇది లోపిస్తే రక్తహీనత ఏర్పడుతుంది. ఈ రక్తహీనత మూలాన కాళ్ళు, చేతులు పరిమాణం కన్నా పెద్దవిగా కనబడతాయి. బెరీబెరీ అనే వ్యాధి కలుగుతుంది. మనం తీసుకునే ఆహారంలో వంట సోడాను ఉపయోగిస్తే ఈ విటమిన్ నశిస్తుంది.

**2. రిబోఫ్లెవిన్ (బి2) :-** ఇదిపాలు,గుడ్డులలో అధికంగా లభిస్తుంది. ఈ లోపంతో చర్మ వ్యాధులు, చత్వారము, పెదవులు పగులుట మొదలైన లక్షణాలను మనం చూడవచ్చు.

**3. నైసిన్ (బి6) :-** ఇది ధాన్యములో, మాంసము, గోధుమ పిండి, పండ్లు, కూర గాయలు, పాలల్లో లభిస్తుంది. దీని లోపం వల్ల ఆ ప్రభావం మెదడుపై పడుతుంది. అంతేకాకుండాచిగుళ్ళనుంచి రక్తంరావటం,కొండ నాలిక, నాలికపైన పుండ్లు పడతాయి. ఆకలి నశించటం వంటి లక్షణాలు బయటపడతాయి.

**4. (బి7)** ఇవి తజా కూరగాయలలో, గుడ్లు, మాంసం, పాలల్లో అధికంగా ఉంటాయి. దీని లోపంవల్ల కడుపులో మంట రావటం, పెద్ద పేగులపై ప్రభావం పడి జీర్ణం కాకపోవటం, వాంతులు అవ్వటం వంటివి జరుగుతాయి.

**5.క్యానోకోబాల్మిన్ (బి12)** :- ఇది పాలు, మాంసంలో అధికంగా లభిస్తుంది. బి12లోపంమూలాన రక్తహీనత,ఒళ్ళునొప్పులు,కాళ్ళుచేతులులాగుట, పక్షవాతం కలుగుతాయి. మనశరీరంలోఎర్రరక్త కణాలు పెరగడానికి బి12 చాలా అవసరం.

**విటమిన్ సి** :- నారింజ, బత్తాయి, నిమ్మ, టమాట, అనాస, పొప్పు దినుసులు, తాజాకూరలు, చిక్కుడు గింజలు, అరటి పండ్లలో ఇది ఉంటుంది. దీని లోపం వల్లస్కార్వీ అనేవ్యాధివస్తుంది. అంతేకాకుండాచిగుళ్ళువాపు,పిప్పన్ను, అలసట, నీరసం, దృష్టిదోషం, చర్మంపై పొర ఊడిపోవటం వంటివి జరుగుతాయి.

**విటమిన్ డి** :- పాలు,వెన్న,గుడ్లలో ఉంటుంది. మరియు సూర్యరస్మిలో కూడా ఉంటుంది. దీనిలోపం వల్ల ఎముకలకు సంబంధించిన వ్యాధులు వస్తాయి. ఎముకలువంకర్లుపోవటం,ఎముకల్లోగట్టితనంలేకపోవటంవంటివికలుగుతాయి.

**విటమిన్ ఇ** :- ఇది కాయగూరలు, ఉల్లిపాయలు, వంటనూనెల్లో ఉంటుంది. దీనిలోపంవల్ల రక్తం, మెదడు, కాలేయములకు సంబంధించిన రోగాలు వస్తాయి.

**విటమిన్ కె** :- ఇది పచ్చికాయగూరల్లో, ఆకుకూరల్లో ఉంటుంది. గాయం అయినప్పుడు అధిక రక్తస్రావం జరగకుండా ఆ రక్తం గడ్డకట్టుటకు మరియు పచ్చకామెర్లు తగ్గటానికి ఇది ఉపయోగపడుతుంది.




**జీర్ణక్రియ** :- మనం ఆహారాన్ని తీసుకున్నప్పుడు నోటిలో లాలాజల గ్రంథులు లాలాజలాన్ని స్రవిస్తూ ఉంటాయి. మనం తీసుకున్న ఆహారంతో బాగా కలిసి ముద్దవలె తయారవుతుంది. నోటినుంచి ఆహారం ఆహారవాహికలోకి వెళుతుంది. అక్కడ నుంచి జీర్ణాశయంలోకి చేరుతుంది. ఇక్కడ ఆహారం రెండు మూడు గంటలు నిలువ ఉంటుంది.ఆసమయంలో జీర్ణాశయం గోడల నుండి జఠిర రసం ఉత్పత్తిఅవుతుంటుంది.జఠిర రసం జఠిర గ్రంథులు నుంచి ఉత్పత్తి అవుతుంటుంది. ఈ జఠిర రసం ఆహారంతో బాగా కలిసి దానిని ద్రవ రూపంలోకి మారుస్తుంది. అక్కడ నుంచి చిన్న ప్రేగులోకి ప్రయాణిస్తుంది.

ఆ త్రోవలో కాలెయం నుండి వచ్చే పైత్యరసంతోను, క్లోమం నుండి వచ్చే క్లోమ రసంతోను కలుస్తుంది. ఈ పైత్యరసం మనం తీసుకున్న ఆహారంలో ఉన్న క్రొవ్వు పదార్థాలను చిలికి జీర్ణం చేసుకుంటుంది. క్లోమరసం ఆమ్లం అన్నిటిని సమపాళ్ళల్లో ఉంచుటకు మరియు ప్రోటీన్లు జీర్ణమవుటకు ఉపయోగపడుతుంది. చిన్న పేగుల్లో ఊరే అంతరరసం చెక్కరను గ్లూకోస్‌గా మారుస్తుంది. ఇక్కడ ఆహారం ఎంజైమ్‌లతో కలిసి ఆహారం పూర్తిగా జీర్ణమవుతుంది. చిన్న పేగుల్లో వేళ్ళ వంటి నిర్మాణం ఉంటుంది. వాటిని చూషకాలు అంటారు. ఈ చూషకాలు జీర్ణమైన ఆహారాన్నిరక్తంలోనిపంపుతుంది. మిగిలిన జీర్ణం కాని ఆహారం పెద్ద పేగుల్లోకివెలుతుంది. అక్కడజీర్ణంకాని ఆహారంలో ఉన్న నీటిని పీల్చుకుంటుంది. మిగిలిన వ్యర్థ పదార్థాన్ని పురిషము ద్వారా బయటకు విసర్జించబడుతుంది. ఈ విధంగా మనం తీసుకున్న ఆహారం జీర్ణమవుతుంది. ఆహారంలోని పోషక పదార్థాలన్నీ మన శరీరానికి లభిస్తాయి.

# మన భారతదేశం

1.ప్రపంచమున గల ఖండములలో ఆసియా ఖండము ఒకటి. భారతదేశము ఆసియా ఖండమున గలదు. భారత దేశమునకు ఖండమునకు గల లక్షణములు అన్నియూ కలవు. కనుక దీనికి 'ఉపఖండము' అని పిలిచెదరు.

2.పూర్వమున 'భరతుడు' అను రాజు మనదేశమును చక్కగా పరిపాలించుట వలన మనదేశమునకు భారతదేశము అని పేరు వచ్చినదని చరిత్రకారులు చెప్పుచుందురు.

3.అత్యంత పురాతనమైన చరిత్ర కలిగిన దేశం భారతదేశం. అత్యంత పురాతన మైన సింధు నాగరికత ఈ దేశంలోనిదే. ఈ నాగరికత సుమేరి, ఈజిప్టు, మెసపటోమియా నాగరికతలకంటే విశిష్టమైనదని చరిత్రకారుల అభిప్రాయం. వేదాలు, బ్రాహ్మణాలు, అరణ్యకాలు, ఉపనిషత్తులు, స్మృతులు, రామాయణ, మహాభారత, భాగవతాది పురాణాహితిహాసాలు, నీతి శాస్త్రం, జ్యోతిష్యశాస్త్రము, ఖగోళ శాస్త్రము, వైద్య గణిత శాస్త్రాలు మొదలైనటువంటి శాస్త్రాలు ఇచ్చటనే అభివృద్ధి చెందాయి.

4.నందులు, మౌర్యులు, కుషానులు, గుప్తులు, పల్లవులు, పాండ్యులు, చాళుక్య, కాకతీయులు, రాజపుత్రులు, మొగలాయిలు, చోళులు, తుళువంశస్థులు, స్వర్ణ యుగాన్ని సృష్టించారు. బౌద్ధమతాన్ని స్థాపించిన గౌతమ బుద్ధుడు, జైన మత స్థాపకుడైన మహావీరుడు, అద్వైతప్రవక్త శంకరాచార్యులు,రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, సూరదాసు, కబీరుదాసు, తుకారాం, మీరాబాయి వంటి మహ నీయులు; వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, మాఘుడు, బాణుడు వంటి ఉద్దండ కవులు, ధన్వంతరి, చరకుడు, సుస్రుతుడు, వాగ్భటుడు వంటి ఆయుర్వేద శాస్త్రవేత్తలు ఈ దేశం వారే.

5.సూన్యం(0) అనే గణిత భావనకు రూపకల్పన ఇక్కడే జరిగింది. కణాదుడు వంటి పరమాణు శాస్త్రవేత్త, ఆర్యభట్టు, భాస్కరాచార్యులు, వరాహమిహిరుడు వంటి ఖగోళ శాస్త్రజ్ఞులు, అహింస ద్వారా స్వాతంత్ర్యాన్ని సంపాదించిన మహాత్మాగాంధీ మన దేశస్థులే.

6.విశేషమైన ఖనిజనిక్షేపాలు, అపారజలసంపద,సుదీర్ఘమైనకోస్తాప్రాంతం, విశేషమైన పశుసంపద, అపూర్వమైన రత్న సంపద, ఈ దేశం యొక్క ప్రాకృతిక సంపద.

7.మన దేశ వైశాల్యము 23,67,500 చ.కి.మీ. తూర్పున బంగాళాఖాతము, పశ్చిమమున అరేబియా సముద్రము, దక్షిణమున హిందూమహాసముద్రము, ఉత్తరమున అత్యున్నత హిమాలయ పర్వతములు మనదేశమునకు ఎల్లలుగా కలవు. మనదేశము రత్నగర్భగా, కర్మభూమిగా, పుణ్యభూమిగా మహాత్ములకు పుట్టినిల్లుగా పేరొందినది.

8.ఎంతోగొప్పదేశంగాపేరొందిన మనదేశాన్నిఆక్రమించుట కొరకు విదేశీయులు యత్నంచిరి. వారిలో పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి, బ్రిటీషు వారు ముఖ్యులు. అయితే చివరికి బ్రిటీషువారు మన దేశాన్ని తమ హస్తగతము చేసికొని 200 సం॥లు పరిపాలించిరి. 1857 మొదలుకొని 1947 వరకు భారతీయులు నిరంతం బ్రిటీషు పరిపాలను వ్యతిరేకించి, తమ ప్రాణాలను సైతము లెక్కచేయక దేశస్వాతంత్ర్యంకోసం కృషి చేసిరి. చివరకు 1947 ఆగష్టు 15వ తేదీన మన దేశమునకు బ్రిటీషు పరిపాలన నుండి విముక్తి లభించినది. ప్రతీ సంవత్సరము ఆగష్టు 15వ తేదిన స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలను జరుపుకుంటున్నాము.

9.తరువాత పాకిస్తాన్ మతప్రాతిపదికపైన మనదేశం నుండి విడిపోయింది. మన దేశనాయకులు ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయుటకు, దేశాన్ని చక్కగా పరిపాలించుటకు ఒక రాజ్యాంగాన్ని తయారు చేసారు. మన దేశం విభిన్న సంస్కృతులు, మతాలు, భాషలు, ఆచారాలకు ఆలవాలమైనది. వీటిని దృష్టిలో పెట్టుకొని రాజ్యాంగాన్ని రచించుట జరిగినది. మన రాజ్యాంగము ప్రపంచం లోని అతి పెద్దదైన లిఖితపూర్వకమైన రాజ్యాంగము. దీనిలో 444 ఆర్టికల్స్ మరియు 12 షెడ్యూల్స్ కలవు. ఈ రాజ్యాంగమును రచించుటకు 2 సంవత్స రముల 11 నెలల 18 రోజులు పట్టినది.

10.ఈ రాజ్యాంగమును 1950 జనవరి 26వ తేదీ నుండి ప్రవేశపెట్టి, మనదేశ మును రిపబ్లిక్‌గా ప్రకటించుకున్నాము. కనుక జనవరి 26వ తేదిన మనము రిపబ్లిక్ డేగా ఉత్సవములు జరుపుకుంటున్నాము.

11.భారత రాజ్యాంగము ప్రకారము మన దేశములో ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిరి. ప్రజాస్వామ్యంలో ప్రజలే ప్రభుత్వము. ప్రజలే పాలకులు. ప్రజలు కొరకే ప్రభుత్వము. ప్రజలు ఎలక్షన్లలో వారి నాయకులను ఎన్నుకొని, వారి ద్వారా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసెదరు.

12. మనదేశంలో పాలకులను ప్రజలే ఎన్నుకుంటారు. ప్రతి ఐదేండ్లకు ఒకసారి ఎన్నికలను నిర్వహించి, పాలకులను ఎన్నుకొనుట జరుగును. మనదేశ సర్వాధికారి రాష్ట్రపతి. ఈయన పార్లమెంటు ద్వారా పరిపాలనను నిర్వహిస్తాడు.

పార్లమెంటునందు రాజ్యసభ (ఎగువసభ), లోక్‌సభ (దిగువసభ) అను రెండు సభలుంటాయి. ఎగువ సభకు శాశ్వత సభ అంటారు. ప్రధానమంత్రి, అతని మంత్రి వర్గ సభ్యులు దేశపరిపాలనలో ముఖ్యపాత్రవహించెదరు.

13. పరిపాలనను చక్కగా నిర్వహించుటకు మనదేశమును భాషా ప్రాతిపదికగా 28 రాష్ట్రాలుగా విభజించిరి. రాష్ట్రపతి తరపున గవర్నరు రాష్ట్ర వ్యవహారాలను పర్యవేక్షించును. రాష్ట్రానికి అధిపతి ముఖ్యమంత్రి. ఇతడి సహాయంతో గవర్నరు రాష్ట్రాన్ని పరిపాలించును.

14. రాష్ట్రాలు స్థానిక స్వపరిపాలనను ప్రవేశపెట్టిరి. పట్టణాలలో కార్పొరేషన్‌లు, మున్సిపాలిటీలు, గ్రామాలలో పంచాయితీలు, పరిషత్‌లుగా స్థానిక స్వపరిపాలన సంస్థలుగా ఉండి పరిపాలనా వ్యవహారాలు నడుపును.

మనదేశ జాతీయభాషహింది. ఇదిగాక 17 భాషలను అధికార భాషలుగా గుర్తించుట జరిగినది. ఉదా:- తెలుగు, తమిళము, కన్నడము మొ॥.

| | **రాష్ట్రాలు** | **రాజధానులు** | **వైశాల్యములు** |
|---|---|---|---|
| 1. | ఆంధ్రప్రదేశ్ | హైదరాబాదు | 2,75,045 చ.కి.మీ |
| 2. | అరుణాచల్‌ప్రదేశ్ | ఇటానగర్ | 83,743 చ.కి.మీ |
| 3. | అస్సాం | డిస్పూర్ | 78,438 చ.కి.మీ |
| 4. | బీహార్ | పాట్నా | 94,163 చ.కి.మీ |
| 5. | గోవా | పానాజి | 3,703 చ.కి.మీ |
| 6. | గుజరాత్ | గాంధీనగర్ | 1,96,024 చ.కి.మీ |
| 7. | హర్యానా | ఛండీఘర్ | 44,212 చ.కి.మీ |
| 8. | హిమాచల్‌ప్రదేశ్ | సిమ్లా | 55,673 చ.కి.మీ |
| 9. | జమ్మూ & కాశ్మీర్ | శ్రీనగర్ (వేసవికాలం) | |
| | | జమ్ము (శీతాకాలం) | 2,22,236 చ.కి.మీ |
| 10. | కర్నాటక | బెంగుళూరు | 1,91,791 చ.కి.మీ |
| 11. | కేరళ | తిరువనంతపురం | 38,863 చ.కి.మీ |
| 12. | మధ్యప్రదేశ్ | భోపాల్ | 3,08,000 చ.కి.మీ |
| 13. | మహరాష్ట్ర | ముంబాయి | 3,07,713 చ.కి.మీ |
| 14. | మణిపూర్ | ఇంపాల్ | 22,327 చ.కి.మీ |
| 15. | మేఘాలయ | షిల్లాంగ్ | 22,429 చ.కి.మీ |
| 16. | మిజోరాం | ఐజ్వాల్ | 21,081 చ.కి.మీ |
| 17. | నాగాలాండ్ | కోహిమ | 16,579 చ.కి.మీ |
| 18. | ఒరిస్సా | భువనేశ్వర్ | 1,55,707 చ.కి.మీ |
| 19. | పంజాబ్ | ఛండీఘర్ | 50,362 చ.కి.మీ |
| 20. | రాజస్థాన్ | జైపూర్ | 3,42,239 చ.కి.మీ |
| 21. | సిక్కిం | గ్యాంగ్‌టక్ | 7,096 చ.కి.మీ |
| 22. | తమిళనాడు | చెన్నై | 1,30,058 చ.కి.మీ |

| | | |
|---|---|---|
| 23. త్రిపుర | అగర్తల | 10,486 చ.కి.మీ |
| 24. ఉత్తరప్రదేశ్ | లక్నో | 2,38,566 చ.కి.మీ |
| 25. బెంగాల్ | కోల్‌కత్తా | 88,752 చ.కి.మీ |
| 26. ఛత్తీస్‌ఘడ్ | రాయ్‌పూర్ | 1,35,191 చ.కి.మీ |
| 27. ఉత్తరాంచల్ | డెహరాడూన్ | 53,483 చ.కి.మీ |
| 28. జార్ఖండ్ | రాంచీ | 79,714 చ.కి.మీ |

## కేంద్రపాలిత ప్రాంతాలు

| | | |
|---|---|---|
| 1. ఢిల్లీ | ఢిల్లీ | 1,483 చ.కి.మీ |
| 2. అండమాన్ మరియు నికోబార్ దీవులు | పోర్ట్‌బ్లెయిర్ | 8,249 చ.కి.మీ |
| 3. చంఢీఘర్ | ఛండీఘర్ | 114 చ.కి.మీ |
| 4. దాదర్ మరియు నాగర్‌హవే | లిసిల్‌వాసా | 491 చ.కి.మీ |
| 5. డామన్ మరియు దయ్యూ | డామన్ | 112 చ.కి.మీ |
| 6. లక్ష దీవులు | కవరతి | 32 చ.కి.మీ |
| 7. పాండిచేరి | పాండిచేరి | 492 చ.కి.మీ |

## జాతీయ చిహ్నములు

1.జాతీయ ముద్ర - అశోకుని స్థంభము, 3 సింహములు- క్రింద దేవనాగర భాషలో సత్యమేవజయతే అని వ్రాయబడి వున్నది.
2.జాతీయ గీతము - "జనగణమన" గీతము రవీంద్రనాథ్ ఠాగూర్ రచించెను.
3.జాతీయ పతాకము - 3 రంగులు - పైన కాషాయము, మధ్య తెలుపు, అడుగున ఆకుపచ్చ తెలుపు రంగులో నీలి రంగులో అశోకుని ధర్మచక్రం.

| | | |
|---|---|---|
| 4.జాతీయ పక్షి | - | నెమలి |
| 5.జాతీయ పుష్పము | - | తామర పువ్వు |
| 6.జాతీయ జంతువు | - | చారల పులి |

## భారత దేశములోని నదులు

గంగానది, సింధునది, గోదావరి, కృష్ణ, కావేరి, పెరియారు నది, బ్రహ్మపుత్ర, మహానది, యమున, హుగ్లీ, గోమతి, జీలం, తపతి.

## బహుళార్థక సాధక ప్రాజెక్టులు

**1.భాక్రానంగల్ ప్రాజెక్ట్ :-** ఇది హిమాచల్‌ప్రదేశ్‌లో సట్లేజ్‌నదిపై భాక్రా మరియు నంగల్ అను ప్రదేశాల్లో నిర్మించబడినది. ఈ ప్రాజెక్టును పంజాబ్, హర్యానా, రాజస్థాన్ రాష్ట్రాలు ఉపయోగించుకుంటున్నాయి. దీని ద్వారా నీటి పారుదల మరియు జలవిద్యుచ్ఛక్తి లభిస్తున్నాయి. 14.6 లక్షల హెక్టార్లు భూమికి నీటి వసతి కలగజేస్తున్నది.

**2.బీయాస్ ప్రాజెక్టు :-** ఇది బీయాస్ జలాలను, సట్లేజ్ జలాలతో కలుపుతుంది. బీయాస్ నదిపై పాంగ్ వద్ద ఆనకట్ట నిర్మించబడింది. పంజాబ్, హర్యానా, రాజస్థాన్ రాష్ట్రాలు ఈ ప్రాజెక్టును ఉపయోగించుకొనుచున్నవి. దీని ద్వారా ప్రధానంగా జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తి, నీటిపారుదల పొందుచున్నాము. 17 లక్షల హెక్టార్ల భూమికి నీటిని అందించుట జరుగుచున్నది.

**3.దామోదర్‌లోయ ప్రాజెక్టు :-** బీహార్‌లోని దామోదర్ నది ఉపనదులపై అనేక ఆనకట్టలు నిర్మించబడ్డాయి. పశ్చిమ బెంగాల్, బీహార్ రాష్ట్రాలు ఈ పథకాన్ని ఉపయోగించుకుంటున్నాయి. నీటిపారుదల, వరదల నియంత్రణ, విద్యుదుత్పత్తి, నౌకాయానం ప్రాజెక్టు యొక్క ముఖ్యోద్దేశాలు. 4.5 లక్షల హెక్టార్ల భూమికి నీటిపారుదల సౌకర్యం లభిస్తోంది.

**4.హీరాకుడ్ ప్రాజెక్టు :-** ఒరిస్సాలో సంబల్‌పూర్ సమీపంలో మహానదిపై నిర్మించబడింది. ఒరిస్సా రాష్ట్రం ఈ ప్రాజెక్టును ఉపయోగించుకొనుచున్నది. నీటిపారుదల, వరదల నియంత్రణ, విద్యుదుత్పత్తి దీని ముఖ్య ఉద్దేశ్యాలు. ప్రపంచంలోని పొడవైన ఆనకట్టలలో ఇది ఒకటి. 2.5 లక్షల హెక్టార్ల భూమికి నీరు లభిస్తున్నది.

**5.నాగార్జునసాగర్ ప్రాజెక్టు :-** ఆంధ్రప్రదేశ్‌లోని నల్గొండజిల్లాలో నంది కొండ గ్రామ సమీపాన కృష్ణానదిపై నిర్మించబడింది. ఆంధ్రరాష్ట్రం ఈ ప్రాజెక్టును ఉపయోగించుకుంటున్నది. విద్యుదుత్పాదన, నీటిపారుదల సౌకర్యం కల్పించుట ఈ ప్రాజెక్టు ముఖ్యోద్దేశాలు. 8.3 లక్షల హెక్టార్ల భూమికి నీటి పారుదల సౌకర్యం ఈ ప్రాజెక్టు ద్వారా లభిస్తోంది.

**6.తుంగభద్రా ప్రాజెక్టు :-** కర్నాటకలోని బళ్లారి జిల్లాలో మల్లాపూర్ వద్ద తుంగభద్రానదిపై నిర్మించబడింది. కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు ఈ ప్రాజెక్టును ఉపయోగించుకొనుచున్నవి. నీటిపారుదల, విద్యుదుత్పాదన ఈ ప్రాజెక్టు ముఖ్యోద్ధేశాలు. 3.5 లక్షల హెక్టార్ల భూమికి నీటిసౌకర్యం లభిస్తోంది.

**7.కోసి ప్రాజెక్టు :-** బీహార్, నేపాల్ సరిహద్దులోని హనుమాన్ నగర్ సమీపంలో కోసినదిపైనిర్మించబడింది. బీహార్,నేపాల్‌దీనివలన ప్రయోజనం పొందుచున్నవి. అంతర్జాతీయపథకంక్రిందఈ ప్రాజెక్టు నిర్మించిరి. నీటిపారుదల, విద్యుదుత్పాదన దీని ముఖ్య ఉద్దేశ్యాలు. 5.66 లక్షల హెక్టార్ల భూమికి నీరు లభిస్తున్నది.

**8.చంబల్ ప్రాజెక్ట్ :-** చంబల్ నదిపై ఈ ఆనకట్టను నిర్మించిరి. మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలు ఈ ప్రాజెక్టును ఉపయోగించుకొనుచున్నవి. నీటిపారుదల, విద్యుదుత్పాదకత దీని ముఖ్యఉద్దేశ్యాలు. 5.66 లక్షల హెక్టార్ల భూమికి ఈ ప్రాజెక్టు ద్వారా నీరు లభ్యమవుతోంది.

**9.గండక్ ప్రాజెక్టు :-** బీహార్‌లోని వాల్మీకి నగర్ వద్ద గండక్ నదిపై నిర్మించబడింది. బీహార్, ఉత్తరప్రదేశ మరియు నేపాల్ ఈ ప్రాజెక్టు ద్వారా లబ్దిపొందు చున్నవి. నీటిపారుదల, జలవిద్యుత్పాదకత ఈ ప్రాజెక్టు ముఖ్యలక్ష్యం. 14.88 లక్షల భూమికి నీరులభిస్తోంది.

**10.రామ్ గంగా ప్రాజెక్టు :-** ఉత్తరప్రదేశ్‌లో రామ్‌గంగానదిపై నిర్మించబడింది. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఈ ప్రాజెక్టు ద్వారా లబ్ధిపొందుచున్నది. నీటిపారుదల, విద్యుదుత్పాదన మరియు వరదల నియంత్రణ ఈ ప్రాజెక్టు యొక్క ముఖ్యోద్దేశ్యం. 5.75 లక్షల హెక్టార్ల భూమికి నీరు లభిస్తున్నది.

## రేవులు ప్రాముఖ్యత

1. బొంబాయి - గేట్‌వే ఆఫ్ ఇండియా
2. కోల్‌కత్తా - హుగ్లీ నదిపై నున్న పెద్దరేవు
3. కాండ్ల - గుజరాత్‌కచ్చిసింధుశాఖ మీద వాణిజ్యమండలి.
4. కొచ్చిన్ - రెండవ నౌకా నిర్మాణ కేంద్రము
5. విశాఖపట్టణము - నౌకానిర్మాణ కేంద్రము
6. పరదీప్ - ఒరిస్సాలోని రేవు పట్టణము
7. భావనగర్ - బాంబే సింధుశాఖ మీద నున్న రేవు
8. నాగపట్టణము - తంజావూరు జిల్లాలో ఉన్నది.
9. పోర్‌బందర్ - గుజరాత్‌లో నున్న రేవు
10. కాకినాడ - ఆంధ్రలోని గోదావరి జిల్లాకురేవు
11. మాతపి - గోవా, కొచ్చిన్‌లకు రేవు
12. మచిలీపట్టణము - ఆంధ్రలోని క్రిష్ణాజిల్లాకు రేవు

ఇవికాక కడలూరు, అలెప్పీ, మార్మగోవా, భాత్‌కల్, తుత్తుకుడి, మంగుళూరు మొదలైన రేవుపట్టణములు కలవు.

## దర్శనీయ ప్రదేశాలు

1. అజంతా గుహలు - ఇవి మహారాష్ట్రలో కలవు
2. ఎలిఫాంట్ గుహలు - ఇవి మహారాష్ట్రలో కలవు (34 గుహ దేవాలయాలు)
3. గోల్డెన్ టెంపుల్ - సిక్కుల పవిత్ర దేవాలయము. ఇది పంజాబ్‌లో కలదు.
4. గేట్‌వే ఆఫ్ ఇండియా - ఇది మహారాష్ట్ర రాజధాని ముంబాయిలో కలదు.
5. కోణార్క్ సూర్యదేవాలయం - ఇది ఒరిస్సాలో కలదు.
6. పోర్ బందర్ - మహాత్మాగాంధి పుట్టిన స్థలము గుజరాత్‌లో కలదు.
7. ఎర్రకోట - ఢిల్లీలో కలదు.
8. సాంచి - బుద్ధుని స్థూపము కలదు. ఇది మధ్యప్రదేశ్‌లో కలదు.
9. గార్డెన్ సిటీ - బెంగుళూరు, కర్ణాటక, రాష్ట్ర రాజధాని.
10. డార్జిలింగ్ - పశ్చిమ బెంగాల్‌లో కలదు.
11. కొడైకెనాల్ - తమిళనాడు రాష్ట్రంలో కలదు.
12. మహాబలేశ్వర్ - మహారాష్ట్రలో కలదు
13. మౌంట్ అబూ - రాజస్థాన్‌లో కలదు. జైనుల ప్రార్థనామందిరం కలదు.
14. ఊటీ - తమిళనాడు రాష్ట్రంలో కలదు.

15. సిమ్లా - హిమాచల్ ప్రదేశ్‌లో కలదు.
16. నైనితాల్ - ఉత్తరప్రదేశ్‌లో కలదు.
17. డెహ్రాడూన్ - ఉత్తరప్రదేశ్‌లో కలదు.

## ఎత్తైన కట్టడములు

| కట్టడముపేరు | స్థలము | ఎత్తు(అడుగులలో) |
|---|---|---|
| కుతుబ్‌మినార్ | ఢిల్లీ | 288 |
| బృహదీశ్వర దేవాలయము | తంజావూరు | 216 |
| పూరీ దేవాలయం | పూరీ | 142 |
| మీనాక్షి దేవాలయ గోపురం | మధురై | 152 |
| లింగరాజ దేవాలయము | భువనేశ్వరం | 127 |
| విక్టరీ టవర్ | చిత్తూరు | 122 |
| చార్‌మీనార్ | హైదరాబాదు | 186 |
| కోల్‌కత్తాహైకోర్టు | కోల్‌కత్తా | 180 |
| రాజబరీ టవర్ | ముంబాయి | 260 |
| అరుణాచలదేవాలయగోపురం | తిరువన్నామలై | 290 |
| గోల్ గుంబాజ్ | బిజాపూర్ | 1981/2 |
| ఏకాంబరనాథ దేవాలయ గోపురము | కాంచీపురం | 188 |
| విక్టోరియా మెమోరియల్ | కోల్‌కత్తా | 182 |
| తాజ్‌మహల్ | ఆగ్రా | 178 |
| బులంద్ దర్వాజా | ఫతేపూర్‌సిక్రి | 176 |

భారతేదేశం - ముఖ్యవిశేషాలు
పెద్ద రాష్ట్రము - రాజస్థాన్
ఎక్కువ జనాభా గల రాష్ట్రం - ఉత్తరప్రదేశ్
అత్యధిక అక్షరాస్యతగల రాష్ట్రం - కేరళ
అతి పెద్ద నగరం - కోల్‌కత్తా
ఎత్తైన శిఖరము -
ఎత్తైన జలపాతము - జోగ్ (కర్ణాటక)
ఎత్తైన విమానాశ్రయము - లధక్ (కాశ్మీర్)
ఎత్తైన ద్వారము - ఫతే పూర్ సిక్రీ (బులంద్ దర్వాజా)
ఎత్తైన కొండ ప్రదేశము - గుల్మార్గ్ (కాశ్మీర్)
ఎత్తైన ఆనకట్ట - భాక్రానంగల్
పొడవైన ఆనకట్ట - హీరాకుడ్

పొడవైన నది - గంగానది
పొడవైన టి.వీ. టవర్ - ఢిల్లీ (235 మీటర్లు)
అతిపెద్ద జిల్లా - లఢక్
అధిక వర్షపాతం గల ప్రాంతం - చిరపుంజి
అతిపెద్ద సరస్సు - ఉలార్ (కాశ్మీర్)
మొట్టమొదటిఅంతరిక్షయాత్రికుడు- రాకేశ్‌శర్మ
అతిపొడవైన రోడ్డు, వంతెన - నెహ్రూసేత్ (సోన్‌నదిపైన 235 మీటర్లు)
పెద్ద జూ - జూలాజికల్ గార్డెన్, కోల్‌కత్తా
పొడవైన సొరంగము - జవహర్ సొరంగము (జమ్మూ)
పొడవైన రోడ్డు - గ్రాండ్ ట్రంక్ రోడ్డు
పొడవైన రైల్వేప్లాట్ ఫారం - ఖరగ్ పూర్
వేగంగా ప్రయాణించే రైలు - శతాబ్ది ఎక్స్‌ప్రెస్ (న్యూ ఢిల్లీ - భోపాల్)
పొడవైన బ్యారేజి - సోన్ బ్యారేజి
అతిపెద్ద పురస్కారము - భారతరత్న
మొట్టమొదటి బ్రిటీషు గవర్నర్ జానరల్ - వారన్ హేస్టింగ్స్
స్వతంత్ర భారతదేశ మొదటి గవర్నర్ జనరల్ - లార్డ్ మౌంట్ బాటన్
మొదటి మొఘల్ చక్రవర్తి - బాబర్
ఇంగ్లీషు ఛానల్‌ను ఈదిన మొదటి భారత మహిళ - ఆరతీషా
ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించిన తొలి ముస్లిం మహిళ - రజియా బేగం
మెగసేసే అవార్డుపొందిన మొదటిభారతీయుడు-ఆచార్య వినోభా భావే (1958)
నోబుల్ బహుమతి పొందిన మొదటి భారతీయుడు - రవీంద్రనాథ్ ఠాగూర్
భారతజాతీయ కాంగ్రెస్ మొదటి అధ్యక్షుడు - డబ్ల్యు.సి.బెనర్జి
భారత జాతీయ కాంగ్రెస్‌కు మొదటి మహిళా అధ్యక్షురాలు - అనీబిసెంట్
భారత రిపబ్లిక్‌కు మొదటి రాష్ట్రపతి -డా॥ రాజేంద్రప్రసాద్
మొదటి భారతదేశ ప్రధాని -జవహర్‌లాల్ నెహ్రూ
మొదటి ఉపప్రధాని -సర్దార్ వల్లభాయ్ పటేల్
మొట్ట మొదటి టెస్ట్‌బ్యూట్ బేబి -ఇందిర (బేబి హర్ష)
మొదటి వైస్రాయి -లార్డ్ కానింగ్
మొదటి మహిళా ముఖ్యమంత్రి -శ్రీమతి సుచితా క్రిపాలిని
మొదటి మహిళా గవర్నర్ -శ్రీమతి సరోజినీ నాయుడు
మొదటి మహిళా ప్రధానమంత్రి -శ్రీమతి ఇందిరాగాంధి
తొలిసారిగా అంతరిక్షంలోకివెళ్ళినమహిళ - కల్పనా చావ్ల
మొదటి మహిళా పైలెట్ -దుర్గా బెనర్జి
సుప్రీం కోర్టుకు జడ్జిగా ఎన్నికైన తొలిమహిళ - మీర్ సాహెబ్ ఫాతిమా బీవి

# రైల్వేలు

భారతదేశములో అతి పెద్ద పరిశ్రమ రైల్వేలు. రైలు మార్గము పొడవు 31,774 మైళ్ళు, ఇది ఆసియాలో కెల్లా పొడవైనది. మన దేశంలో మొదటి రైలు మార్గం 1853 సం॥లో ఏప్రియల్ 16వ తేదిన బొంబాయి నుండి థాణకి వేయబడినది.

## మనదేశములో రైల్వే గేజ్‌లు మూడు రకములు అవి

1. బ్రాడ్ గేజ్ 5-6
2. మీటర్ గేజ్ 3-4, 8-3
3. నేరోగేజ్ 20-002-6.

## మనదేశములో 16 రైల్వేజోన్సు కలవు అవి

| రైల్వేజోను | ప్రధానకార్యాలయము | ప్రారంభ తేది |
|---|---|---|
| 1.దక్షిణరైల్వే | చెన్నై | ఏప్రిల్ 14,1951 |
| 2.మధ్యరైల్వే(సెంట్రల్) | ముంబాయి | నవంబరు 5, 1951 |
| 3.పశ్చిమ రైల్వే | ముంబాయి | నవంబరు 5, 1951 |
| 4.ఉత్తర రైల్వే | న్యూఢిల్లీ | ఏప్రిల్ 14, 1952 |
| 5.ఉత్తర-తూర్పు రైల్వే | గోరక్‌పూర్ | ఏప్రిల్ 14, 1952 |
| 6.తూర్పు రైల్వే | కోల్‌కత్తా | ఆగష్టు 1, 1955 |
| 7.దక్షిణ-తూర్పు రైల్వే | కోల్‌కత్తా | ఆగష్టు 1, 1955 |
| 8.నార్త్ ఈస్ట్ ఫ్రాంటైర్ | గౌహతి | జనవరి 15, 1958 |
| 9.దక్షిణ-పశ్చిమ రైల్వే | సికింద్రాబాద్ | అక్టోబర్ 2, 1966 |
| 10.దక్షిణ-మధ్యరైల్వే | బెంగుళూరు | అక్టోబర్, 1966 |
| 11.తూర్పు కోస్తా రైల్వే | భువనేశ్వర్ | ఆగష్టు 8, 1966 |
| 12.ఉత్తర మధ్యరైల్వే | అలహాబాద్ | ఆగష్టు28, 1966 |
| 13.తూర్పు మధ్యరైల్వే | హాజీపూర్ | సెప్టెంబరు 8, 1996 |
| 14.ఉత్తర పశ్చిమ రైల్వే | జైపూర్ | అక్టోబరు 10, 1996 |
| 15.పశ్చిమ మధ్యరైల్వే | జబల్‌పూర్ | డిసెంబరు 9, 1996 |
| 16.మధ్య తూర్పురైల్వే | బిలాస్‌పూర్ | సెప్టెంబరు9, 1998 |

# ఆంధ్రప్రదేశ్ చరిత్ర

భాషాప్రయుక్త రాష్ట్రంగా ఏర్పడిన మొట్టమొదటి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. 1953 అక్టోబరు 1వ తేదిన, అమరజీవి పొట్టి శ్రీరాములు గారి ఆమరణ దీక్షతో అసువులు బాయటంతో ఆంధ్రరాష్ట్రం కర్నూలు రాజధానిగా ఏర్పడింది. భారత రిపబ్లిక్‌లో ఆంధ్రరాష్ట్రాన్ని విలీనం చేయుట ద్వారా తెలుగు మాట్లాడే జిల్లాలను అన్నింటినీ కలిపి ఆంధ్రప్రదేశ్‌గా 1956 నవంబరు 1వ తేదిన వెలిసింది. అప్పటి నుండి హైదరాబాదు రాజధానిగా మారింది.

ఈ ప్రాంతాన్ని శాతవాహనులు, విష్ణుకుండినులు, శాలంకాయనులు, రాష్ట్రకూటులు, చాళుక్యులు, కళింగులు, కాకతీయులు, మొగలాయిలు, గోల్కొండ నవాబులు పరిపాలించిరి. భారతదేశం బ్రిటీషు వారి ఆధీనంలోకి వచ్చినపుడుమద్రాసు ప్రెసిడెన్సీలో అంతర్భాగంగా కోస్తా రాయలసీమ ప్రాంతాలు ఉండేవి. మిగిలినప్రాంతాలు తెలంగాణాలో నిజాం నవాబు ఏలుబడిలో ఉండేవి.

ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు అనే వాదం 1913 డిసెంబరులో బాపట్లలో జరిగిన ప్రథమ ఆంధ్రమహాసభలో ప్రారంభించిరి. చివరకు అమరజీవి పొట్టి శ్రీరాములు గారికి ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించిన ఘనత దక్కింది.

ఆంధ్రదేశమునకు దక్షిణ భారతధాన్యాగారమని పేరు కలదు. సారవంత మైన డెల్టా భూములతో ఈ ప్రాంతం అలరారుతోంది. గోదావరి, కృష్ణ, తుంగ భద్ర,నాగావళి,మంజీర, పాపాఘ్నిమొదలైననదులు ఈప్రాంతాన్ని సస్యశ్యామలం చేస్తున్నాయి. మన రాష్ట్రంలో వరి, జొన్న, రాగులు, ప్రత్తి, చెఱకు, పొగాకు, వేరుశనగ, మిర్చి మొదలైన పంటలు పండుతున్నాయి. ద్రాక్ష, నిమ్మ, కొబ్బరి, దానిమ్మవంటి పండ్లు పండుతున్నాయి. అంతేకాక అనేక ఖనిజ నిక్షేపాలున్నాయి. అంతర్జాతీయ ఖ్యాతి గడించిన తిరుమల పుణ్యక్షేత్రం మరియు ఇతర పుణ్య క్షేత్రాలకు నెలవు మన రాష్ట్రం. అనేక కళలకు ఆలవాలము మన రాష్ట్రం.

11వ శతాబ్దిలోని నన్నయ, 12వ శతాబ్దిలోని చోళుడు, 13వ శతాబ్దపు తిక్కన, గోనబుద్ధారెడ్డి, 14వ శతాబ్దపు శ్రీనాథుడు, రాచనసోముడు, పోతనా మాత్యుడు, 15వ శతాబ్దపు అనంతుడు, తాళ్ళపాక అన్నమాచార్యులు, శ్రీకృష్ణదేవ రాయలు, నందితిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, ధూర్జటి, పింగళి సూరన, భట్టుమూర్తి, 16వ శతాబ్దిపు, కవయిత్రి మొల్ల, కుంచి మంచి జగ్గకవి, 17వ శతాబ్దపు కంచర్ల గోపన్న, చేమకూర వెంకటకవి, వేమన, 18వ శతాబ్దపు

ఏనుగు, లక్ష్మణకవి, ముద్దుపళని, 19వశతాబ్దపు చిన్నయసూరి, 20వ శతాబ్దపు కందుకూరి వీరేశలింగం పంతులుగారు, గురజాడ అప్పారావు, తిరుపతి వేంకటకవులు, విశ్వనాథ సత్యనారాయణ, చిలకమర్తి లక్ష్మీనరసింహం గణపతి, బసవరాజు అప్పారావు, శ్రీశ్రీ, గుఱ్ఱం జాషువా, దేవులపల్లి కృష్ణశాస్త్రి, సి.నారాయణరెడ్డి వంటి మహాకవులతో సాహిత్య వెలుగులతో నిండినదీ రాష్ట్రం.

## ఆంధ్రప్రదేశ్ - భౌగోళిక స్వరూపము



**ఉనికి :-** 12° 37'-19° 54'ఉత్తర అక్షాంశములు 76°46'-84°46' రేఖాంశముల మధ్య కలదు
**విస్తీర్ణము :-**2,75,045 చ.కి.మీ
**రాజధాని :-** హైదరాబాదు
**జనాభా :-** 75.7 మిలియన్లు
**అధికారభాషలు :-** తెలుగు, ఉర్దూ
**మహానగరాలు :-** 8
**గ్రామాలు :-**29,379
**సముద్రతీరం :-** 974 కి.మీ.
**లోక్‌సభ నియోజక వర్గాలు :-** 42
**రాజ్యసభ నియోజక వర్గాలు :-** 18 **శాసన సభా నియోజక వర్గాలు :-** 294
**మొత్తం జిల్లాలు :-** 23 **జనసాంద్రత :-** 275 (ఒక చదరపు కిలోమీటరుకు)
**అత్యధిక జనసాంద్రత గల ప్రాంతం** కోస్తా ఆంధ్ర 340
**అత్యధిక జనసాంద్రత గల జిల్లా** హైదరాబాదు (16,988)
**అత్యల్ప జనసాంద్రత గల జిల్లా** ఆదిలాబాదు (154)
**ఎల్లలు :-** ఉత్తరాన చత్తీస్ ఘడ్, ఒరిస్సా రాష్ట్రాలు, దక్షిణాన తమిళనాడు పశ్చిమోత్తరంగా మహారాష్ట్ర, పశ్చిమంగా కర్ణాటక, తూర్పున బంగాళాఖాతము
**ముఖ్యప్రాంతాలు :-** కోస్తా ఆంధ్రా, రాయలసీమ, తెలంగాణ

**కోస్తా ఆంధ్రా :-** కోస్తా ఆంధ్ర వైశాల్యం 92, 900 చ.కి.మీ. కోస్తా ఆంధ్రాలో మొత్తం 9 జిల్లాలు ఉన్నాయి. అవి శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు.

**రాయలసీమ :-** రాయలసీమ వైశాల్యం 67,400చ.కి.మీ. ఈప్రాంతంలో మొత్తం 4 జిల్లాలుఉన్నాయి. అవిచిత్తూరు,కడప,కర్నూలు,అనంతపురంజిల్లా.

**తెలంగాణా :-** తెలంగాణాప్రాంతవైశాల్యం 1,14,800 చ.కి.మీ. తెలంగాణా ప్రాంతంలో మొత్తం 10 జిల్లాలు ఉన్నాయి.అవిమహబూబ్ నగర్, హైదరాబాదు, రంగారెడ్డి, మెదక్, నిజామాబాదు, ఆదిలాబాదు, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మం, నల్గొండ జిల్లాలు. **నియోజక వర్గాలు :-** శాసన సభ - 12, లోక్‌సభ-1

# మన రాష్ట్రంలోని జిల్లాలు - మండలాల వివరాలు



**శ్రీకాకుళం :-** శ్రీకాకుళం జిల్లా వైశాల్యం 5837. ఈ జిల్లా మన రాష్ట్రానికి తూర్పు కోస్తాలోకలదు. ఈజిల్లాకేంద్రంశ్రీకాకుళం.

**జిల్లాలో మండలాలు :-** 1. ఇచ్ఛాపురం 2. కవిటి 3. కంచిలి 4. సోంపేట 5. మందన 6. పలాస 7. వజ్రపు కొత్తూరు 8. నందిగాం 9. టెక్కాలి 10. సంత బొమ్మాళి 11. కోట బొమ్మాళి 12. జలుమూరు 13. సారవకోట 14. పాతపట్నం 15. మోలాపుటి 16. హీరమండలం 17. కొత్తూరు 18. భూమిని 19. సీతంపేట 20. వీరఘట్టం 21. బూర్జ 22. పాలకొండ 23. వంగర 24. రేగిడి ఆముదాల వలస 25. సంతకవిటి 26. రాజాం 27. నరసన్నపేట 28. పోలాక 29. శ్రీకాకుళం 30. గార 31. ఆముదాలవలస 32. సరుబుజ్జిలి 33. ఎచ్చెర్ల 34. గంగువారి సిగదం 35. పొందూరు 36. రణస్థలి 37. లావేరు

**పంటలు :-** జీడిమామిడి, చింతపండు, వేరుశెనగ, రాగులు, పెసలు, మొక్క జొన్న, మినుములు, నువ్వులు, గంటెలు, సజ్జలు, పసుపు, మిర్చి.

**ఖనిజములు :-** మాంగనీసు, గ్రాఫైటు

**నదులు :-** వంశధార, నాగావళి, బాహుద, వేదవతి

**పరిశ్రమలు :-** జనపనార, జీడిపప్పు, చక్కెర, ఫెర్రో, మాంగనీసు పరిశ్రమ

**దర్శనీయ స్థలాలు :-** అరసవెల్లి శ్రీ సూర్యనారాయణ దేవాలయము, ముఖలింగతో శివాలయం, శాలిగుండలోని బౌద్ధస్తూపం, శ్రీకూర్మంలోని వైష్ణవ క్షేత్రం.





**విజయనగరంజిల్లా :-** ఈజిల్లా వైశాల్యం 6539చ. కి. మీ జిల్లాలోమండలాలు-34 1. విజయనగరం 2. గంటాడ 3. భోగాపురం 4. డెంకాడ 5. పూసపాటిరేగ 6. శృంగవరపు కోట 7. జామి 8. వేపాడు 9. కొత్త వలస 10. నెల్లిమర్ల 11. లక్కవరపు కోట 12. చీపురుపల్లి 13. గుర్ల 14. మొరక మండిదం 15. గరివిడి 16. గజపతి నగరం 17. మెంటాడ 18. దత్తిలారారు 19. బొండపల్లి 20. పార్వతీ పురం 21. కొమరాడ 22. గరుగుబిల్లి 23. జి. యమ్మ వలస 24. కురుపాం 25. గుమ్మలక్ష్మీపురం 26. బాదంగి 27. తుర్లం 28. సాలూరు 29. పాచిపెంట 30. మక్కువ 31. రామ భద్రాపురం 32. బొబ్బిలి 33. సీతానగరం 34. బలిజిపేట.

**పంటలు :-** రాగులు, సజ్జ, వరి, వేరుశెనగ, చెఱకు,నువ్వులు, ఉలవలు, జనుము ప్రధాన పంటలు.

**ఖనిజములు :-** గ్రాఫైటు, ఇనుము, మాంగనీస్, అభ్రకము, జేగురు మన్ను, ఎపటైట్ ఖనిజాలు లభ్యమవుతున్నాయి.
**నదులు :-** గోముఖి, చంపావతి, నాగావళి, జంఝావతి, సువర్ణముఖి, వేదవతి, శారద నదులు ప్రవహించుచున్నవి.
**పరిశ్రమలు :-** పెర్రో మాంగనీసు, చక్కెర, జనపనార, నూలు
**దర్శనీయ స్థలాలు :-** బొబ్బిలి కోట, విజయనగరం, రామతీర్థం.
**నియోజక వర్గాలు :-** శాసనసభ -12, లోక్‌సభ -2

**3.విశాఖపట్నం :-**ఈజిల్లావైశాల్యం11161 చ.కి. మీ జిల్లాకేంద్రంవిశాఖపట్నం. జిల్లాలో మండలాలు -42 1.గంగరాజుమాడుగుల 2.పాడేరు 3.గుండెం కొత్తవీధి4.కొయ్యూరు5.చింతలపల్లి 6. మంచింగి పుట్టు 7. అనంతగిరి 8. అరుకు లోయ9.హుకుం పేట 10.పెదబయలు11.దుంబ్రి గుండ 12. చోడవరం 13. రావి కమతం 14. బుచ్చయ్య పేట 15.చీడికడ 16.మాడుగుల 17.నర్సీ పట్నం 18. గోలుకొండ 19. కోట అవురట్లు 20.రోలు గుంట 21. మాకవారిపాలెం 22. నాతవరం 23.వక్కపల్లి 24. యలమంచిలి 25. పాయకరావుపేట 26. యస్. రాయవరం 27. అచ్యుతాపురం 28. రాంబిల్లి 29. అనకాపల్లి 30 మునగపాక 31. కసింకోట 32. సబ్బవరం 33.దేవరపల్లి 34.కె.కోటపాడు 35.పరవాడ 36. విశాఖపట్నం 37. పెందుర్తి 38. గాజువాక 39. పెదగంట్యాడ 40. భీముని పట్టణం 41. పద్మనాభం 42. ఆనందపురం.





**పంటలు :-** వరి, రాశులు, సజ్జలు, పెసలు, నువ్వులు, చెఱకు, వేరుశనగ, నీరుల్లి, జనుము, అనాస, జీడగింజలు
**ఖనిజములు :-** గ్రానైట్, మాంగనీసు, బాక్సైట్, రంగురాళ్ళకు ప్రసిద్ధి.
**నదులు :-** శారద, వారాహ, గోస్తకి, తాండవ
**పరిశ్రమలు :-** ఉక్కు కర్మాగారము, నౌకానిర్మాణ కేంద్రం, సామాగ్రి కర్మాగారం, జింకు,ఎరువులఫ్యాక్టరీలు,పంచదార మిల్లులు, నూనెశుద్ధి కర్మాగారము, బెల్లము, చేపల పరిశ్రమలు మొదలైన పరిశ్రమలతో పారిశ్రామిక జిల్లాగా పేరొందినది.
**దర్శనీయస్థలాలు :-** సింహాచలం, బొర్రాగుహలు, అరకులోయ, బొజ్జనకొండ, రామకృష్ణామిషన్ బీచ్. **నియోజక వర్గాలు :-** శాసనసభ -13, లోక్‌సభ - 2

**తూర్పుగోదావరి జిల్లా :-** ఈ జిల్లా వైశాల్యం 10,807 చ.కి.మీ జిల్లా కేంద్రము కాకినాడ. జిల్లాలో మండలాలు 57
1. తాళ్ళరేవు 2. కాజులూరు 3. కరప 4. కాకినాడ రూరల్ 5. తొండంగి 6. తుని 7. రంగంపేట 8. గండేపల్లి 9. జగ్గంపేట 10. కిర్లంపూడి 11. పెద్దాపురం 12. శంఖవరం 13. ఏలేశ్వరం 14. ప్రత్తిపాడు 15. కొత్తపల్లి 16. గొల్లప్రోలు



17. పిఠాపురం 18. పెదపూడి 19.సామర్లకోట 20.కోటనందూరు 21. అడ్డతీగల 22. రాజ వొమ్మంగి 23. వై. రామవరం 24. గంగవరం 25. రంపచోడవరం 26. దేవీపట్నం 27.మారేడు పల్లి 28.రాజమండ్రిరూరల్ 29.రాజానగరం 30. కడియం 31. మండపేట 32.ఆలమూరు 33.పామర్రు 34.రామచంద్రాపురం 35.అనపర్తి 36.బిక్కవోలు 37. రాయ వరం 38. సీతానగరం 39. గోకవరం 40. కోరుకొండ 41. కపిలేశ్వరం 42. సఖినేటిపల్లి 43. మల్కిపురం 44. రాజోలు 45.మామిడికుదురు 49.కొత్తపేట 50. అభాజీ పేట 51. అమలాపురం 52. అల్లవరం 53. ఉప్పలగుప్తం 54. అయినవిల్లి 55. ముమ్మిడివరం 56. కాట్రేజికోవ 57. ఐపోలవరం

**పంటలు :-** వరి, జొన్న, చెఱకు, పొగాకు, ఉలవలు, సజ్జ, మినుము, పెసర, మిర్చి, ఉల్లి, పసుపు, కొబ్బరి, మామిడితోటలు, నర్సరీలు మొదలైనవి ప్రసిద్ధము.

**ఖనిజములు :-** గ్రానైట్, పింగాణీ మట్టి, ఇనుపరాయి బాగా లభ్యమగును.

**నదులు :-** గోదావరి, ఏలేరు.

**పరిశ్రమలు :-** ఇనుపసామాను, హార్లిక్సు, పంచదార, కాగితం, పట్టు, బెల్లం, నూనె పరిశ్రమలు కలవు.

**దర్శనీయ స్థలాలు :-** రోడ్‌కమ్‌రైల్వే బ్రిడ్జి, కోటిలింగాల వద్ద కైలాస భూమి, పిఠాపురం, కోరుకొండ, అన్నవరం, ద్రాక్షారామం, ధవళేశ్వర బ్యారేజి, అంతర్వేది

**నియోజకవర్గాలు :-** శాసనసభ-21, లోక్‌సభ-3



**పశ్చిమగోదావరి జిల్లా:-** ఈ జిల్లా వైశాల్యం 7742 చ.కి.మీ. రాష్ట్రంలోకెల్లా ఎక్కువ పంటలు ఈ జిల్లాలో పండుచున్నవి. ఈ జిల్లా కేంద్రం ఏలూరు.

**జిల్లాలోమండలాలు -46** :- 1.ఏలూరు 2.పెదపాడు 3.పెదవేగి 4.భీమరాజు 5.ద్వారకాతిరుమల 6.దెందు లూరు 7. చింతపూడి 8. లింగపాలెం 9. కామవరపు కోట 10.టి.నర్సాపురం 11.తాడేపల్లిగూడెం 12.గణపవరం 13.నల్ల జర్ల 14.నిడమర్రు 15.ఉంగుటూరు 16.పెంటపాడు 17.కొవ్వూరు 18.చాగల్లు 19. నిడద వోలు 20.దేవరపల్లి 21.గోపాలపురం 22.తాళ్ళపూడి 23.పోలవరం 24.కొయ్యలగూడెం 25. జంగా రెడ్డిగూడెం 26. బుట్టాయగూడెం 27. జీలుగుమిల్లి 28. తణుకు 29.ఇరగవరం 30.ఉండ్రాజవరం 31.అత్తిలి 32. పెనుమంట్ర 33.పెనుగొండ 34.పెరవలి 35. నరసాపురం 36. మొగలూతరు 37. యల మంచిలి 38. పాలకొల్లు 39.పోడూరు 40.ఆచంట 41.భీమవరం 42. పాల కోడేరు 43. వీరవాసరం 44. ఆకివీడు 45. కాళ్ల 46. ఉండి.



**పంటలు :-** వరి, చెఱకు ఉలవ, పొగాకు, మిర్చి, పసుపు, శెనగలు,.
**ఖనిజములు :-** పింగాణీ మట్టి, గ్రాఫైట్, సున్నపురాయి, సహజవాయువు
**నదులు :-** గోదావరి, కృష్ణ, ఎర్రకాలువ
**పరిశ్రమలు :-** జనపనార, ఎరువుల కర్మాగారములు, పింగాణీ, తివాసీలు, చేపలు, గ్రుడ్లు, పక్షిజాతులు, బియ్యం మిల్లులు, పంచదార ఫ్యాక్టరీలు కలవు.
**దర్శనీయ స్థలాలు :-** ద్వారకా తిరుమల, పట్టి సీమ, పెనుగొండ, నరసాపురం
**నియోజకవర్గాలు :-** శాసనసభ -16, లోక్‌సభ -2.



**కృష్ణాజిల్లా :-** ఈజిల్లా వైశాల్యం 8,727 చ.కి.మీ. జిల్లా ముఖ్య నగరము మచిలీపట్నం. ఇది రేవు పట్టణము. కృష్ణాజిల్లాకు వాణిజ్య నగరము విజయవాడ. జిల్లాలో మండలాలు - 49
**జిల్లాలు :-** మచిలీపట్నం, గూడూరు, పెడన, కృత్తివెన్ను, బంటుమిల్లి, అవనిగడ్డ, నాగాయలంక, కోడూరు, మొవ్వ, చల్లపల్లి, ఘంటసాల, గుడివాడ, ముదినేపల్లి, నందివాడ, పెదపారుపూడి, గుడ్లవల్లేరు, పామర్రు, మండవల్లి, కైక లూరు,కలిదిండి, విజయవాడరూరల్,విజయవాడ అర్బన్, పెనమలూరు, ఇబ్రహీంపట్నం, జీకొండూరు, కంచికచర్ల, వీరుల్లపాడు, నందిగామ, పెదగంచిప్రోలు, చందర్లపాడు, జగ్గయ్యపేట, వత్సవాయి, నూజివీడు, ఆగిరిపల్లి, ముదు నూరు,బొపులుపాడు,గన్నవరం,ఉంగుటూరు, ఉయ్యూరు, పమిడిముక్కల, తోట్లవల్లూరు, విస్సన్న పేట, చట్రాయి, రెడ్డిగూడెం, కొండూరు, తిరువూరు, గంపల గూడెం.



**పంటలు :-** వరి, జొన్న, వేరుశనగ, పొగాకు, చెఱకు మిరప, మామిడి
**ఖనిజములు :-** క్రొమైట్,పెట్రోలియం,సహజవాయువు,సున్నపురాయి, వజ్రాలు
**నదులు :-** కృష్ణ, బుడమేరు, మున్నేరు, తమ్మిలేరు
**పరిశ్రమలు :-** పంచదార, సిమెంటు, ఔషధములు, సాంకేతిక పరికరములు, గోల్డ్‌కవరింగ్
**దర్శనీయ స్థలాలు :-** విజయవాడ కనకదుర్గమ్మ గుడి, జగ్గయ్యపేట, కొండపల్లి, ఘంటసాల,మొగల్రాజపురం,గుహలు,కూచిపూడి,మొవ్వ,చిలకలపూడి, మంగిన పూడి బీచ్, ప్రకాశంబ్యారేజి. **నియోజకవర్గాలు :-** శాసనసభ-17,లోక్‌సభ-2.



**గుంటూరు జిల్లా :-**ఈజిల్లా వైశాల్యం11,391చ.కి.మీ. జిల్లా కేంద్రముగుంటూరు గుంటూరుజిల్లా పొగాకువాణిజ్యానికి ప్రసిద్ధి.
**జిల్లాలో మండలాలు-57** :-గుంటూరు, వెల్దుర్తి, మాచర్ల, దుర్గి, రెంటచింతల,చెరకుపల్లి,భట్టిప్రోలు,కారంపూడి,గురజాల దాచేపల్లి, మంచవరం, పిడుగురాళ్ళ, ఊపూరు, బొల్లపల్లి, వినుకొండ, మాజెండ్ల, కనుమర్లపూడి, రొంపిచెర్ల,నకరికల్లు,నర్సరావుపేట, చిలకలూరి పేట,నాదెండ్ల,ఎడ్లపాడు,బెల్లంకొండ,రాజుపాలెం ,



క్రోసూరు, ముప్పాళ, అచ్చంపేట, పెదకూరపాడు, సత్తెనపల్లి, ఫిరంగిపురం, మేడికొండూరు, పెదకాకాని, ప్రత్తిపాడు, వట్టి చెరుకూరు, మంగళగిరి, తాడేపల్లి, తాళ్ళూరు, తాడికొండ, అమరావతి, దుగ్గిరాల, తెనాలి, వేమూరు, అమృతలూరు, కొల్లిమర,కుందూరు,చేబ్రోలు,కొల్లూరు, పొన్నూరు, పెదనందిపాడు, కాకుమాను, బాపట్ల, పిట్టలవారిపాలెం, కర్లపాలెం, నగరం, నిజాం పట్నం, రేపల్లె.

**పంటలు :-** జొన్న, వరి, పొగాకు, సజ్జ, పసుపు, వేరుశనగ, మిరప, జనుము, మినుములు, జామ, చెఱకు.

**ఖనిజములు :-** సీసం, రాగి, సున్నపురాయి, బంకమన్ను

**నదులు :-** కృష్ణా, గుండ్లకమ్మ, నాగులేరు, చంద్రవంక

**పరిశ్రమలు :-** పొగాకు, ప్రత్తి, నూలు, నూనె మిల్లులు, సిమెంటు.

**దర్శనీయ స్థలములు :-** అమరావతి, భట్టిప్రోలు, ఉండవల్లి గుహలు, కోటప్ప కొండ, మంగళగిరి, బాపట్ల భావన్నారాయణస్వామి ఆలయం.

**నియోజకవర్గాలు :-** శాసనసభ -19, లోక్‌సభ -4.



**ప్రకాశంజిల్లా :-** ప్రకాశంజిల్లా వైశాల్యం 17,626 చ.కి.మీ.జిల్లా కేంద్రము ఒంగోలు.

**మండలాలు-56 :-** ఒంగోలు, టంగుటూరు, కొత్తపట్నం,వాగులుప్పలపాడు,చీమకుర్తి,మద్దిపాడు,సంతమూతలపాడు,అద్దంకి, కోలినపాడు, జె.పొంగులూరు, పల్లికురు, సంత మాగులూరు, మార్టూరు, యద్దనపూడి, చీరాల, వేటపాలెం, చినగంజాంపరచూరు,ఇంకొల్లు, కారంచేడు, కందుకూరు, గుడ్లూరు, ఓలేటివారిపాలెం, లింగసముద్రం, కనిగిరి, తిమ్మరెడ్డిపల్లి,పామూరు, వెలిగండ్ల, చంద్రశేఖర పురం, పెదచర్లపల్లి, పొదిలి, కొనకమెట్ల, మర్రిపాడు,దర్శి,తాళ్ళూరు,ముండ్లమూరు,దొనకొండ,తుర్లపాడు, మార్కాపురం,డోర్నాల,పెదఅర్వాడు,కురిచేడు,ఎర్రగొండ పాలెం,త్రిపురాంతకం, పుల్లచెరువు, గిద్దలూరు, రాచర్ల, కొమరోలు, బెస్తవారిపేట, కంభం, అర్థవీడు.



**పంటలు :-** వరి,జొన్న,మొక్కజొన్న,వేరుశనగ,జీడిమామిడి, పొగాకు సజ్జ, పసుపు

**ఖనిజములు :-** గ్రానైట్, పలకరాయి, సున్నపురాయి, రాగి

**నదులు :-** గుండ్లకమ్మ, పాలేరు, మూసీ

**పరిశ్రమలు :-** బియ్యపుమిల్లులు, గ్రానైట్ పరిశ్రమ

**నియోజకవర్గాలు :-** శాసనసభ-13, లోక్‌సభ-2

**నెల్లూరుజిల్లా :-** వైశాల్యం 13,076కి.మీ.మండలాలు 46 1. నెల్లూరు, సీతారామపురం, ఉదయగిరి, వరికుంటపాడు, దత్తలూరు, మర్రిపాడు, వింజమూరు, కలిగిరి, కొండాపురం,కావలి, జలదంకి,నిడవలూరు,బోగోలు, కోవూరు, దగదర్తి,అల్లూరు,బుచ్చిరెడ్డిపాలెం,దొరవారిసత్రం,సంగం,ఆత్మకూరు,ఏ.సముద్రం పేట,కొడవలూరు, దక్కలి,అనంతసాగరం,ఇందుకూరుపేట,తోటపల్లి గూడురు




వెంకటాచలం,ముత్తుకూరు,పొదలకూరు చేజర్ల, కలువాయి, రాపూరు, సైదాపురం, గూడురు, మనుబోలు,చిల్లకూరు, వాకాడు, కోట, చింత మూరు, నాయుడుపేట, పెళ్ళపూరు, బిజిలి, సూళ్ళూరు పేట, తడ, వెంకటగిరి, బాలాయపల్లి.

**పంటలు** :-వరి,జొన్న,సజ్జ,ఆముదాలు,మిరప,పొగాకు,జీడిమామిడి

**ఖనిజములు** :- మంగనీసు, ఫెలస్పార్, అభ్రకం, జిప్సమ్

**నదులు** :- పెన్నా, స్వర్ణముఖి, కందాలేరు, ఉప్పుటేరు

**పరిశ్రమలు** :- బ్యాటరీలు, వెంకటగిరి చీరలు, గాజులు, పింగాణి

**దర్శనీయ స్థలాలు** :- నెల్లూరు, శ్రీహరికోట, ఉదయగిరి, వెంకటగిరి, వేదగిరి

**నియోజకవర్గాలు** :- శాసనసభ-13, లోక్‌సభ-2.



**చిత్తూరుజిల్లా** :- చిత్తూరు జిల్లా వైశాల్యం 15,152చ.కి.మీ.జిల్లా కేంద్రం చిత్తూరు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన పుణ్యక్షేత్రం తిరుపతి ఈ జిల్లాలోనే కలదు.



**మండలాలు 66** :- చిత్తూరు, గుడిపాల, యదుమర్రి, గంగాధర, నెల్లూరు, పూతల పట్టు, పెనుమూరు, బంగారుపాలెం, పవనంపల్లి,ఐరాల, యస్.ఆర్.పురం, నింద్ర, నగరి, నారాయణ పురం, కార్వేటినగరం, పుత్తూరు, పాలసముద్రం, నదమల్‌పేట, కమ్మతల్లె,పాచికపాలెం,విజయపురి,చంద్రగిరి, పాకాల, పులిచర్ల, తిరుపతి అర్బన్, తిరుపతి రూరల్, రేణిగుంట, శ్రీకాళహస్తి, ఏర్పేడు, తొట్టంబేడు, బుచ్చినాయుడు కండ్రిక, కోవనూరు, సచ్చివేడు, వరదయ్యపాలెం, నాగులాపురం, పిచ్చాటూరు,మదనపల్లె, నిమ్మనపల్లి, కులపాలకోట, బి. కొత్తపేట, పెదమాణ్యం, తంబళ్ళపల్లె, పి.టి. సముద్రం, మునకల చెరువు, వాయల్పాడు, గుఱ్ఱంకొండ, జలకాడ,కలికిరి, పీలేరు, ఎర్రవారిపాలెం, చిన్నగొట్టిగల్లు, దొంపికర్ల, కంభంవారి పల్లె, పుంగనూరు, చోడేపల్లి, రామసముద్రం, సోడం, సోమాల, పెదరంజని, పలమనేరు, గంగవరం, వైరెడ్డిపల్లె, వెంకటగిరికోట, రామకుప్పం, గూడవల్లె, శాంతిపురం, కుప్పం.

**పంటలు** :- వరి, రాగులు, సజ్జ, వేరుశనగ, చెఱకు

**ఖనిజములు** :- సీసం, ఇనుపరాయి, ప్లేటైట్, కట్టడపురాయి,

**నదులు** :- పాపాఘ్ని, గొడ్డుపంక, సువర్ణముఖి, పింఛ, ఆరణి

**పరిశ్రమలు** :- కంచు, తలనీలాలతో విగ్గులు

**దర్శనీయ స్థలాలు** :- తిరుమల,తిరుపతి,శ్రీకాళహస్తి,హార్సలి హిల్స్, మదనపల్లె, చంద్రగిరి, కార్వాణం **నియోజకవర్గాలు** :- శాసనసభ-15, లోక్‌సభ-2.



**కడపజిల్లా :-** ఈజిల్లా వైశాల్యం 15,359 చ.కి.మీ. జిల్లాముఖ్య కేంద్రం కడప.

**మండలాలు 50 :-** ఎర్రగుంట్ల, కమలాపురం, వల్లూరు, చింతకొమ్మ, దిన్నె, కడప, చెన్నూరు, కాజీపేట, చాపాడు, పొద్దుటూరు, జమ్మలమడుగు, ముద్దనూరు, తొండూరు, వీరపువాయనపల్లె, పెండ్లిమర్రి, లక్కిరెడ్డిపల్లి, రామాపురం, రాయచోటి, వీరవల్లె, సిద్దవటం, ఒంటిమిట్ట, అట్లూరు, బ్రహ్మంగారి మఠం, బి కోడూరు, మైదుకూరు, దువ్వూరు, రాజుపాలెం,పెద్దముడియం,మైలవరం,కొండాపురం,సింహాద్రిపురం,లింగాల,పులివెందుల,వేముద,వేంపల్లి, చక్రాయపేట, పుల్లంపేట, ఓబులవారి పల్లె, కోడూరు, చిట్వేలు, పెశగలూరు, నందలూరు,గోపవరం, బద్వేలు, పోరుమామిళ్ళ, నరసాపురం. గాలివీడు,చెన్నమండం,సాంబపల్లి, సుందుపల్లి, రాజంపేట.



**పంటలు :-** జొన్న, వరి, సజ్జ, కొర్ర, ఉలవలు, వేరుశనగ, ఉల్లి, రాగులు

**ఖనిజములు :-** సీసం, సున్నపురాయి, ముగ్గురాయి, ఇనుము, రాతినార

**నదులు :-** పెన్న, పాపాఘ్ని, కుందు, చెయ్యేరు, చిత్రావతి, నగిలేరు

**పరిశ్రమలు :-** నాపరాళ్ళు, సిమెంటు, బేరియం

**దర్శనీయస్థలాలు :-** తాళ్ళపాక అన్నమయ్య జన్మస్థలి, పుష్పగిరిపీఠం, బ్రహ్మంగారి మఠం, ఒంటిమిట్ట, సిద్దవటం కోట

**నియోజకవర్గాలు :-** శాసనసభ -11, లోక్‌సభ -2



**కర్నూలుజిల్లా :-** ప్రకృతి రమణీయతకు ప్రసిద్ధిచెందినజిల్లా. నల్లమల,ఎర్రమల అడవులు ఈజిల్లాలోకలవు. ఈజిల్లా కేంద్రం కర్నూలు. వైశాల్యం 17,658 చ.కి.మీ.

**మండలాలు 54:-** కర్నూలు,నంద్యాల,మహానంది,బి. ఆత్మకూరు, పాణ్యం, గడివేముల, ఆళ్ళగడ్డ, రుద్రవరం, సిరివెళ్ళ, చాగలమర్రి, కొప్పాడు, కోయిలకుంట్ల, దొర్నిపాడు, ఉయ్యాలవాడ, సంద్యామల, కొడిమిగుండ్ల, బనగానపల్లి, ఔకు, ఆత్మకూరు, వెలుగోడు, పాములపాడు,కొత్తపల్లి,శ్రీశైలం, నందికొట్కూరు, మిడుతూరు, పగిడాల,జూపాడుబంగ్లా, గూడూరు, కోడుమూరు, సీబెలగల్లు, ద్రోణాచలం, బేతంచర్ల, వెల్దుర్తి, కృష్ణగిరి, ప్యాపిలి, కల్లూరు, ఓర్వకల్లు, ఆదోని, కోసిగి, కౌతాళం, నందవరం, మంత్రాలయం, ఆలూరు, చిప్పగిరి, అస్పరి, ఫలగొండ, హలహర్వి, పత్తికొండ, దేవరకొండ, తుగ్గలి, మద్దికెర, గొనెగండ్ల.



**పంటలు :-** జొన్న, ప్రత్తి, వరి, వేరుశనగ, మిరప, పొగాకు, కందులు

**ఖనిజములు :-** సీసము, ముగ్గురాయి, సున్నపురాయి, హేమటైట్, బెరైటిస్

**నదులు :-** తుంగభద్ర, కృష్ణ, హంద్రి, కుందేరు

**పరిశ్రమలు :-** జౌళి, సిమెంటు, కాగితం, వంటనూనె
**దర్శనీయ స్థలాలు :-** శ్రీశైలంభ్రమరాంబా మల్లిఖార్జున స్వామి వారి దేవస్థానం, మహానందివద్ద శైవక్షేత్రం, అహోబిలం లక్ష్మీనరసింహస్వామి, మంత్రాలయం రాఘవేంద్రస్వామి,శ్రీశైలంభారీఆనకట్ట,ఎర్రమలకొండలలోనివేడినీటిగుండాలు.
**నియోజకవర్గాలు :-** శాసన సభ -13, లోక్‌సభ -2.



**అనంతపురం జిల్లా :-** అనంతపురం జిల్లా వైశాల్యం19,130చ.కి.మీ. పుట్ట పర్తి సత్యసాయి బాబా ఆశ్రమము. ఈ జిల్లాలోనే కలదు.
**మండలాలు 63 :-** అనంతపురం, రస్తాడ, గార్లదిన్నె, ఆత్మకూరు, కోడేరు, సింగనమల, బుక్కరాయసముద్రం, నార్పల, తాడిపత్రి, యాడికి, పుట్లూరు, పెదవొప్పూరు,యలనూరు,గుంతకల్లు,గుత్తి,తామిడి, పెదవడుగూరు, ఉరవకొండ, వజ్రకరూరు, విడపనకల్లు, ధర్మవరం, తాడిమర్రి, బద్లపల్లి, చెన్నేకొత్తపల్లి, బనగానపల్లి, రామగిరి, కళ్యాణదుర్గం, బెళగుప్ప, కంబదూరు, కుందుర్తి, బ్రహ్మసముద్రం, సెట్టూరు, రాయదుర్గం, బిహరహెల్లు, గమ్మగట్ట, కనేకల్లు, బొమ్మనకల్లు, పెనుగొండ, సోమిందిపల్లి, రొద్దం, పుట్టపర్తి, కొత్తచెరవు, బుక్కపట్నం, మడకసిర, అమరాపురం, గుడిబండ, రోళ్ళ, అగలి, హిందూపురం, పరిగి, లేపాక్షి, గోరంట్ల, చిలమర్తూరు, కదిరి, ముదిగుబ్బ, నల్లమడ, నంబులిపులికుంట, తలుపుల, నల్లచెరువు, ఓవళదేవర చెరువు, తనకల్లు, ఆమదగూడూరు, గాండ్లపెంట.



**పంటలు :-** క్రొర్రలు, జొన్న, ప్రత్తి, వరి, వేరుశనగ, నువ్వులు, రాగులు
**ఖనిజములు :-** సున్నపురాయి, ఇనుము, పింగాణీ మన్ను, బంగారము, వజ్రాలు
**నదులు :-** పెన్న, చిత్రావతి, వేదవతి
**పరిశ్రమ :-** నూనె, దూది, పట్టు పరిశ్రమ
**దర్శనీయ స్థలాలు :-** గుత్తి, లేపాక్షి, పుట్టపర్తి, పెనుగొండ, ఆలూరు, కదిరి, కటారుపల్లి (వేమన సమాధి) హేమవతి
**నియోజక వర్గాలు :-** శాసనసభ -14, లోక్‌సభ -2.

**మహబూబ్ నగర్‌జిల్లా :-** ఈజిల్లావైశాల్యం 18,432 చ.కి.మీ. జిల్లా కేంద్రం మహబూబ్‌నగర్.



**మండలాలు - 64 :-** బిజ్నపల్లి, పెద్దమందడి, ఘనాపూర్, బూత్ పూర్,శంకరమండి,చిన్నచింతకుంట కొత్తకోట, వనపర్తి, గోపాలపేట,



నాగల్‌కర్నూల్,తాండూర్,తిమ్మాజి పేట, జడ్చర్ల, మెహబూబ్‌నగర్, దేవరకద్ర, ధన్‌వాడ, నార్వా, ఆత్మకూరు, గద్వాల, మొల్దకల్లు, ఇటిక్యాల, పెబ్బేరు, పానగల్లు,

కోడేరు, పెదకొత్తపల్లి, లింగాల్, బాలామూర్, తెల్కపల్లి, కల్వకుర్తి, వెల్దండ, మిడ్జల్, బాలానగర్, యమునగండ్ల, అన్వాడ, కోయల్‌కొండ, మద్దూరు, కోసిగి, బొంబాసపేట, కొడంగల్, దౌలాతాబాద్, దామరగిద్ద, నారాయణపేట, ఉట్కూర్, మక్తల్, మంగన్నూర్, తాలూర్, ఘట్, జీజ, వడ్డేపల్లి, మనపాడ్, అలంపురం, వేపంగండ్ల, కొల్లాపూర్, అమరాబాద్, అచ్చంపేట, ఉప్పనూతల, వంగూరు, మాడ్గుల్,అమంగల్,తాలకొండపల్లి,కేరంపేట, కొత్తూరు, ఫరూక్‌నగర్, కుందుర్గ.

**పంటలు :-** జొన్న, వరి, వేరుశనగ, రాగులు, ఉలవలు, సీతాఫలం

**ఖనిజములు :-** క్వార్జ్, సున్నపురాయి **నదులు :-** దిండి, కృష్ణా, తుంగభద్రా

**పరిశ్రమలు :-** పట్టు పరిశ్రమ

**దర్శనీయ స్థలాలు :-** గద్వాల్, కొత్తకోట, అలంపురం, పానగల్లుకోట, శ్రీరంగపట్నం, పిల్లల మర్రి

**నియోజకవర్గాలు :-** శాసనసభ -13, లోక్‌సభ -2.

**హైదరాబాద్ :-** ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని హైదరాబాద్. ఈనగరంభాగ్యనగరంగాపిలవబడుతోంది. ఈ జిల్లా వైశాల్యం 217చ.కి.మీ. జిల్లా కేంద్రం హైదరాబాద్.

**మండలాలు 16 :-** (హైదరాబాద్ - సికింద్రాబాద్) అంబర్‌పేట, అమీర్‌పేట, ఆసీఫ్ నగర్, ఖైరతాబాద్, తిరుమల గిరి, నాంపల్లి, బండ్లగూడ, బహదూర్‌పుర, మారేడ్‌పల్లి, మలక్‌పేట, షేక్‌పేట, హైదారాబాద్, హిమాయత్ నగర్, సికింద్రాబాద్, ముషీరాబాద్, గోల్కొండ, చార్మినార్

**పంటలు :-** కందులు,జనుము **ఖనిజములు :-** గ్రాఫైట్,క్వార్జ్

**నదులు :-** మూసీ, **పరిశ్రమలు :-** ఔషధాలు, ముత్యాలు, లక్క గాజులు, తోలు, హెవీ ఎలక్ట్రికల్స్, పేలుడు పదార్థాలు, సిగరెట్లు, బిస్కెట్లు, ఇంజనీరింగ్ పరిశ్రమ, ప్రభుత్వ టంకశాల, ప్రాగాటూల్స్, హైటెక్ సిటీ, సాఫ్ట్‌వేర్ పరిశ్రమలు.

**దర్శనీయ స్థలాలు :-** సాలార్‌జంగ్ మ్యూజియం, చార్మినార్, ఆర్కియలాజికల్ మ్యూజియం, జమ్మామసీదు, పురానా హవేలి, ఫలక్‌మామా పాలెస్, లుంబినీ పార్కు, హుసేన్ సాగర్, గండిపేట, బిర్లా ప్లానిటోరియం, నెహ్రూ జూలాజికల్ పార్క్, బుద్ధ విగ్రహం మొ॥ **నియోజక వర్గాలు :-** శాసనసభ-14, లోక్‌సభ-2.





**రంగారెడ్డి జిల్లా :-** జిల్లా వైశాల్యం 7,493 చ.కి.మీ. హైదరాబాద్, సికింద్రాబాద్ జంట నగరాలుమినహాపాతహైదరాబాద్ జిల్లాఅంతా యీ జిల్లాగా ఏర్పాటు చేయబడినది. జిల్లా కేంద్రం వికారాబాద్‌జిల్లాలో **మండలాలు 37** :- 1. ఇబ్రహీంపట్నం 2. యాచారం 3. మంచల్ 4. మహేశ్వరం 5. కందకూరు 6. హయత్‌నగర్

7. ఉప్పల్ 8.సరూర్‌నగర్ 9. ఘటకేశర్ 10. మేడ్చల్ 11. షామిర్‌పేట 12. కుతుబల్లాపూర్ 13.కీసర 14. మల్కాజిగిరి 15. బాలానగర్ 16. సేరిలింగంపల్లి 17.రాజేంద్రనగర్ 18.శంషాబాద్ 19.శంకరపల్లి 20.చేవెళ్ల 21. మెయినాబాద్ 22.షాబాద్ 23.గండీడ్ 24.కుల్కచెర్ల 25.దోమ 26.పర్గి 27.పూడూర్ 28. దారూర్ 29. నవాబ్‌పేట 30. వికారాబాదు 31. మోమెఇన్‌పేట్ 32. మార్పల్లి 33.బంట్వారం 34.పేద్దేముల్ 35. బషీరాబాదు 36. యాలాల్ 37. తాండూరు

**నదులు :-** మూసీనది, ఈసీనది, ఆసిఫ్‌నగర్ చెరువు.

**పంటలు :-** జొన్న, సజ్జ, వేరుశనగ, ద్రాక్ష, కోళ్ళు, కోడిగ్రుడ్లు

**ఖనిజములు :-** సున్నపురాయి, క్వార్ట్జ్, గ్రానైట్

**పరిశ్రమలు :-** నూలు,సిగరెట్లు,ఎరువులు,గాజు,ఔషధులు,ఎలక్ట్రానిక్స్,డైనమైట్స్, కేబుల్స్

**చూడదగిన ప్రదేశములు :-** అనంతగిరి జాతర, గోల్కొండకోట, గండిపేట చెరువువద్ద ఓషన్‌పార్కు (జల వినోద క్షేత్రం)

**నియోజకవర్గాలు :-** శాసనసభ-6, లోక్‌సభ -1.

**మెదక్‌జిల్లా :-**ఈజిల్లావైశాల్యం 9,699చ.కి.మీ. జిల్లా కేంద్రం సంగారెడ్డి

**మండలాలు 45 :-** మెదక్, రామాయంపేట, దుబ్బాక, సిద్దిపేట,చిన్నకోడూరు, నంగనూరు,కొండపాక,జగ్దేవపూర్,నార్గల్,తుప్రాన్, జిన్నారం, రామచంద్రాపురం, పటాన్‌చెరువు, సంగారెడ్డి, కొండాపూర్, సదాశివపేట, మున్‌పల్లి, కోహిర్, జహీరాబాద్, నైల్‌కల్, బానూర్, కేంగ్‌టి, కాల్వేర్, శంకరంపేట, పావన్నపేట, రంగంపేట, వెల్దుర్తి, చేగొంట, మీర్‌దొడ్డి, దౌలతాబాద్, గజ్వేల్, వార్గల్, శివంపేట, నర్సాపూర్





**పంటలు :-** వరి,రాగులు,సజ్జ,శనగలు,చెఱకు,పెసలు

**ఖనిజములు :-** క్వార్ట్జ్, తెల్లబంకమన్ను

**నదులు :-** మంజీర, హల్దీ

**పరిశ్రమలు :-** ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ మరియు అనేక భారీ పరిశ్రమలు కలవు.

**దర్శనీయ స్థలాలు :-** కొండాపూర్, మెదక్

**నియోజకవర్గాలు :-** శాసనసభ -10, లోక్‌సభ -2.

**నిజామాబాద్‌జిల్లా :-**ఈజిల్లావైశాల్యం7,596చ.కి.మీ.జిల్లా ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రాలకు సరిహద్దు జిల్లాగా ఉంది. జిల్లా కేంద్రం నిజామాబాద్.

**మండలాలు 36 :-**నందిపేట,ఎడపల్లి,డిచేపల్లి, నిజామాబాద్, వర్ని, బిర్కూరు బన్స్వాడ, గాంధారి, సదాశివనగర్, కామారెడ్డి, ధార్పూర్, బాంగల్, వేల్పూరు జక్రాంపల్లి, మకులూర్, నవిపేట, రాంజల్, బోధన్, కోటగిరి, మద్నూరు,జుక్కల్ బిచ్‌కొండ,పిట్లం,నిజాంసాగర్,ఎల్లారెడ్డి, నాగిరెడ్డిపేట, లింగం పేట, తాడవాయి, భిక్నూరు,దోమకొండ,మాచరెడ్డి,సిరికొండ,కమ్మరపల్లి,మోర్తాడ్,బాలకొండ,ఆర్మూరు.

**పంటలు:**-వరి,చెఱకు, శనగలు మినుములు





**ఖనిజాలు:**-మాంగనీసు,ఇనుము
**నదులు:**-మంజీర,గోదావరి,పులాంగు
**పరిశ్రమలు :-** పంచదార, ఆల్కహాలు, చక్కెర, బెల్లం,ఉన్ని,పోచంపాడు వద్ద నిజాం సాగర్ డ్యామ్
**దర్శనీయస్థలాలు :-** పోచంపాడు **నియోజకవర్గాలు :**-శాసనసభ-9,లోక్‌సభ-1

**ఆదిలాబాద్ జిల్లా :-** ఆదిలాబాద్ జిల్లా వైశాల్యం 16,128 చ.కి.మీ. జిల్లా కేంద్రం ఆదిలాబాద్.



**మండలాలు 52 :-** ఆదిలాబాదు, తలమడుగు, తాంశి, జైనాథ్, బేలా, బోథ్, బజార్‌హత్నూర్, ఇచ్చోడ, నేరేడి కొండ, గుడిహత్నూర్,ఉట్నూరు, ఇంద్ర వెల్లి, సర్నూరు, జైనూరు, శిర్‌పూరు, లోహెస్రా, కుంతల, సారంగపూర్, నిర్మల్, దిల్వార్‌పూర్,మామ్డా,లక్ష్మణ్ చాందా, కుభీర్, భైంసా, ముధోల్, తానూరు, ఖనాపూర్, కడెం, జన్నారం, దండేపల్లి, లక్సెట్టిపేట, మంచిర్యాల, మందమర్రి,కాశింపేట,రెబ్బన, అసిఫా బాదు, తాండూరు, బెల్లంపల్లి, తిర్యాణి, కెరమిరి, చిన్నూరు, వాంఖిడి, కౌతాల, బెజ్జూరు, వహెగాం, భీమిని, కాగజ్ నగర్, కోటుపల్లి, సిర్‌పూర్, కోటుపల్లి, వేమనేపల్లి, జైపూర్.
**పంటలు :-** వరి, గోధుమ, జొన్న, ప్రత్తి, చెఱకు, కందులు, పెసలు.
**ఖనిజములు :-** నేలబొగ్గు, సున్నపు రాయి, పింగాణీ మట్టి.
**నదులు :-** (గోదావరి ఉపనది) పెన్‌గంగ, ప్రాణహిత, వార్ధ, కడెం.
**దర్శనీయస్థలాలు :-** కుంతల జలపాతము, పోచారం జలపాతము, బాసర సరస్వతీ దేవాలయము. **నియోజకవర్గాలు :-** శాసన సభ-19, లోక్‌సభ-1

**కరీంనగర్ జిల్లా :-** వైశాల్యం 11,823 చ.కి.మీ. జిల్లాకేంద్రం కరీంనగర్



**జిల్లాలోమండలాలు 56 :-** 1.కరీంనగర్ 2.మానకొండూరు3.తిమ్మాపూరు (సి.ఎమ్.డి. కాలనీ) 4.బెజ్జంకి 5.గంగాధర 6. రాంమడుగు 7. చొన్నదండి 8. హుస్నాబాద్ 9. చిగురుమామిడి 10. కొహెడ 11.హుజూరాబాద్ 12.జమ్మికుంట 13. వీణ వంక 14. కమలాపూర్ 15. ఎలకతురితి 16. కేశవపట్నం 17.సైదాపూర్ 18.భీమదేవరపల్లి 19.జగిత్యాల 20. రాయ కల్ 21.ధర్మపురి 22.సారంగపురం 23.మల్యాల్ 24. కోడి మాల్ 25.పెగడపల్లి 26. గొల్లపల్లి 27.మెట్‌పల్లి 28. కోరుట్ల

29.మేడిపల్లి 30.ఇబ్రహీంపట్టణం 31.మల్లాపూర్ 32. కల్లాపూర్ 33. సిర్‌సిల్లా 34.ఇల్లంతకుంట 35. గంభీరావుపేట 36. ముస్తాబాద్ 37.ఎల్లారెడ్డిపేట 38. వేములవాడ 39. బోయినపల్లి 40. కోనారావుపేట 41. చందుర్తి 42. పెద్దపల్లి 43. శ్రీరాంపూర్ 44. ఓదెల 45. రామగుండం 46. కమాన్‌పూర్ 47. సుల్తానాబాదు 48.వెల్లటూరు 49.ధర్మారం 50.జూలపల్లి 51.మంథని 52.ముత్తారం 53.తాడిచర్ల 54.మహాదేవపూర్ 55. కాటారం 56. ముత్తావరం

**నదులు :-** గోదావరి, మానేరు

**పంటలు :-** వరి, జొన్న, మొక్కజొన్న పచ్చపెసలు, మిర్చి, ఉలవలు, నువ్వులు

**ఖనిజములు :-** ఇనుము, సున్నపురాయి, సోప్‌స్టోన్

**పరిశ్రమలు :-** కోళ్లపరిశ్రమ,ఉన్ని, నూలు, చేనేత.

**చూడదగిన ప్రదేశాలు :-** వేములవాడ, కాళేశ్వరం, ధర్మపురి, మంతెన, రామగుండంవద్ద సూపర్ థర్మల్ కేంద్రం, రసాయనిక ఎరువుల, ఫ్యాక్టరీ



**వరంగల్ జిల్లా :-** వరంగల్ జిల్లా వైశాల్యం 12,846 చ.కి.మీ జిల్లాకేంద్రం వరంగల్, వైశాల్యము 12,846

**మండలాలు - 50 :-** హనుమకొండ, చిట్యాల, మొగుళ్ళపల్లి,భూపాలపల్లి, పరకాల, సాయంపేట, రేగొండ,ములుగు,వెంకటాపూర్,తాడ్వాయ్,గోవింద రావుపేట,ఏటూరునాగారం,మంగంపేట,గూడూరు,ఖనాపూర్ కొత్తగూడెం, నర్సంపేట, నల్లబెల్లి,చెన్నారావుపేట, దుగ్గొండి, నెక్కొండ, హసన్‌పర్తి, ఆత్మకూరు, గీసుకొండ, జాఫర్‌ఘడ్, సంగం, ఘనాపూర్, ధర్మసాగర్, చర్యల్, బచ్చన్నపేట, నర్మెట్ట, మద్దూరు, వర్ధన్నపేట, పర్వతగిరి, రాయపర్తి, జనగాం, రఘు నాధపల్లి,లింగాల,కొడకొండ్ల,పాలకుర్తి,కొర్వి,దేవరుప్పుల,మరిపెడ, నర్సింహులు పేట, తొర్రూరు, మెహబూబాబాదు, డోర్నకల్, నెల్లి, కుదురు, కే. సముద్రం.



**నదులు :-** గోదావరి, వైరా, మున్నేరు, పాలేరు, ఆకేరు.

**ముఖ్యపంటలు :-** వరి, సజ్జ, జొన్న, వేరుశెనగ, నువ్వులు, పెసలు.

**ఖనిజములు :-** కట్టడపురాయి, ముడి ఇనుము, సున్నపురాయి, నేలబొగ్గు

**పరిశ్రమలు :-** నూలుబట్టలు, తివాచీ, తోళ్ళు

**దర్శనీయ స్థలములు :-** వరంగల్లు, రామప్పచెరువు, హన్మకొండ, ములుగు

**నియోజక వర్గాలు :-** శాసన సభ-13, లోక్‌సభ-2

**ఖమ్మంజిల్లా :-** ఖమ్మంజిల్లావైశాల్యం 16,029చ.కి.మీ.కొండలు,మన్య ప్రాంతం ఎక్కువగా గల జిల్లా. ఈ జిల్లా కేంద్రం ఖమ్మం.

**మండలాలు 46 :-** ఖమ్మం అర్బన్, ఖమ్మం రూరల్, ముదిగొండ, నేలకొండ పల్లి, కొనిజర్ల, చింతకాని, కూసుమంచి, తిరుమలాయపాలెం, ఎర్రిపాలెం, మధిర, బోనకల్లు, వైర, కల్లూరు, పెనుబల్లి, వేమ్సూరు, సత్తుపల్లి, దమ్మపేట,



అశ్వారావుపేట, ములకలపల్లి, ఇల్లెందు, సింగరేణి, కామేపల్లి, గార్లబయ్యారం, గుండాల, టేకులపల్లి, కొత్తగూడెం, పాల్వంచ, జూలూరుపాడు, చంద్రు కొండ,పల్లాడ,వాజీడు,ఎన్కూరు,బూర్గంపాడు కుకునూరు,వేలేరుపాడు,మంగూరు, అశ్వాపురం,పినపాక,దమ్ముగూడెం,భద్రా చలం,కూనవరం,వరరామచంద్రపురం చింతూరు, వెంకటాపురం, వర్లం.

**నదులు :-** మున్నేరు,కిన్నెరసాని, వైరా, శబరి, పాలేరు, గోదావరి

**ముఖ్యపంటలు :-** జొన్న, వరి, వేరుశనగ, పొగాకు, మామిడి, పెసలు.

**ఖనిజములు :-** రాగి, గ్రాఫైట్స్, ముడి ఇనుము, సున్నపురాయి, నేలబొగ్గు, కోరండం కట్టడపు రాయి.

**పరిశ్రమలు :-** సిమ్మెంటు, బేరియం, విద్యుత్తు.

**చూడదగ్గ ప్రదేశములు :-** ఖమ్మం, భద్రాచలం, చర్ల.

**నియోజకవర్గాలు :-** శాసనసభ-9, లోక్‌సభ-2.



**నల్గొండ జిల్లా :-** ఈ జిల్లావైశాల్యం 14,240 చ.కి.మీ. ఈ జిల్లా కేంద్రం నల్గొండ.

**మండలాలు 59 :-** నల్గొండ, యాదగిరి గుట్ట, ఆలేరు, రాజంపేట, తొక్కపల్లి, భువనగిరి, గొండాల, బొమ్మల రామారం, భూదాన్, పోచంపల్లి, బీబీనగర్, రామన్నపేట, వలిగొండ, చౌటుప్పల్, మోత్కూరు, ఆత్మకూరు, తుంగతుర్తి, తిరుమలగిరి, నూతనకల్లు, అరవపల్లి, సూర్యాపేట, పెన్‌పహాడ్, మోతే, చివ్వెల్ల, నక్రేకల్, కౌతపల్లి, శాలిగౌరారం, కట్టంగూరు, చండూరు, మునుగోడు, నారాయణపూర్,నార్కేడ్‌పల్లి, కనగల్, తిప్పర్తి, చిట్యాల, నాంపల్లి, చింతపల్లి,గుర్రంపోడ్,మర్రిగూడ, దేవరకొండ, పెద్దఅడిసెర్లపల్లి, చెన్నంపేట,గొండ్లపల్లి,నిడువూనూరు,పెద్దమార,అనుమల,త్రిపురారం, మిర్యాల గూడ,దామరచర్ల,వేములపల్లి, హుజూర్‌నగర్, నేరేడుచర్ల, గరుడేపల్లి, మఠంపల్లి, కోదాడ, మేళ్ళచెరువు, చిడుతూరు, నడిగూడెం, మునగాల.



**పంటలు :-** వరి, జొన్న, పప్పుధాన్యాలు, నూనెగింజలు

**ఖనిజములు :-** సీసం, పింగాణిమట్టి

**నదులు :-** మూసీ, కృష్ణా, ఆలేరు, పాలేరు

**పరిశ్రమలు :-** ఉన్ని, చేనేతవస్త్రములు, బెల్లము, తోళ్లు, సిమెంటు

**దర్శనీయ స్థలాలు :-** నాగార్జునసాగర్ డ్యాం, నాగుర్జున కొండపై పురాతన వస్తుశాల, పోచంపల్లి

**నియోజకవర్గాలు :-** శాసనసభ-12, లోక్‌సభ -2

# ప్రపంచ విశేషములు

## దేశములు - పట్టణములు - వాటి కొత్తపేర్లు

| | పాతపేరు | | కొత్తపేరు |
|---|---|---|---|
| 1. | అబిసీనియా | - | ఇథియోపియా |
| 2. | అంగోరా | - | అంకారా |
| 3. | ఔరంగాబాద్ | - | సంభాజీనగర్ |
| 4. | బెనారస్ | - | వారణాశి |
| 5. | బరోడా | - | వాదోదర |
| 6. | బసుతోల్యాండ్ | - | తెలిసోథో |
| 7. | బెఛాతనాల్యాండ్ | - | బోట్స్‌వానా |
| 8. | బటవియా | - | జకర్తా |
| 9. | బ్రిటీష్ గయానా | - | గయానా |
| 10. | బాంబే | - | ముంబయి |
| 11. | బర్మా | - | మయన్మార్ |
| 12. | కేప్‌కనవెరల్ | - | కేప్‌కేనడీ |
| 13. | కవున్‌పూర్ | - | కాన్పూర్ |
| 14. | కాలికట్ | - | కోజీకోట్ |
| 15. | సెంట్రల్ ప్రావిన్సస్ | - | మధ్యప్రదేశ్ |
| 16. | క్రిస్టినా | - | డాస్‌లో |
| 17. | సిలోన్ | - | శ్రీలంక |
| 18. | కొచ్చిన్ | - | కోచి |
| 19. | కాంస్టాంటినోపిల్ | - | ఇస్తాన్‌బుల్ |
| 20. | కాంగో | - | జైర్ |
| 21. | డహోమి | - | బెకిన్ |
| 22. | డక్క | - | ఢాకా |
| 23. | డచ్ ఈస్ట్ ఇండీస్ | - | ఇండోనేసియా |
| 24. | ఈస్ట్ తైమూర్ | - | లోరోసి |
| 25. | డచ్ గయానా | - | సురినేమ్ |
| 26. | ఎల్లీస్ ఐలాండ్ | - | టువలు |
| 27. | గౌహతి | - | గువహతి |
| 28. | గోల్డ్‌కోస్ట్ | - | ఘన |
| 29. | ఫరేమోసా | - | తైవాన్ |
| 30. | హాలాండ్ | - | నెదర్లాండ్స్ |

| | | | |
|---|---|---|---|
| 31. | ఐవరాకోస్ట్ | - | కోట్‌డిఐవరి |
| 32. | నిప్పన్ | - | జపాన్ |
| 33. | జలున్‌దర్ | - | జలంధర్ |
| 35. | మడగాస్కర్ | - | మలగసి |
| 36. | మద్రాస్ | - | చెన్నై |
| 37. | లియోపోల్డ్ విల్లీ | - | కిన్‌షాసా |
| 38. | మెసపటోమియా | - | ఇరాక్ |
| 39. | మన్‌చుకు | - | మన్‌చూరియా |
| 40. | నార్త్ రొడేషియా | - | జాంబియా |
| 41. | న్యూహెబ్రిడెస్ | - | వను ఆటు |
| 42. | న్యాసాలాండ్ | - | మాలవి |
| 43. | ఉదకమండలం | - | ఊటీ |
| 44. | పెకింగ్ | - | బీజింగ్ |
| 45. | పాన్‌జిం | - | పానాజి |
| 46. | పెట్రోగార్డ్ | - | లెనిన్ గార్డ్ |
| 47. | పర్థియా | - | ఇరాక్ |
| 48. | పూన | - | పూనె |
| 49. | క్విలోన్ | - | కొల్లం |
| 50. | మన్‌గాన్ | - | రంగూన్ |
| 51. | రొడేషియా | - | జింబాబ్వే |
| 52. | సైగాన్ | - | హోచిమిన్ సిటీ |
| 53. | సలీస్ బర్రీ | - | హరారే |
| 54. | సాడ్‌విచ్ ఐలాండ్ | - | హవాయిలాన్ ఐలాండ్ |
| 55. | సియమ్ | - | థైలాండ్ |
| 56. | స్పానిష్ గయాన | - | ఈక్వటోరియల్ గయానా |
| 57. | సౌత్ వెస్ట్ ఆఫ్రిక | - | నమీబియా |
| 58. | సిమ్లా | - | షిమ్లా |
| 59. | తంగన్యా కమరియుజన్ జీబర్ | - | తాంజేనియా |
| 60. | స్టాలిన్ గార్ట్ | - | వోల్గోగ్రాడ్ |
| 61. | త్రిచూర్ | - | త్రిసూర్ |
| 62. | తాంజోర్ | - | తంజావూరు |
| 63. | త్రివేంద్రం | - | తిరువనంతపురం |
| 64. | వైజాగ్ | - | విశాఖపట్నం |
| 65. | ఉప్పర్ వోల్టా | - | బౌర్‌కినా ఫాసో |
| 66. | యునైటెడ్ ప్రావిన్సెస్ | - | ఉత్తరప్రదేశ్ |

# ప్రపంచములో వింతలు

ప్రాచీన కాలంలోమానవుడు నిర్మించిన అద్భుతమైన కట్టడాలుగా పేరుగాంచిన ప్రపంచ వింతలు

1. ఈజిప్టులోని పిరమిడ్లు, ముఖ్యంగా గిజాలో వున్న పిరమిడ్లు, త్రిభుజాకృతిలో నిర్మించిన కట్టడాలు ఈ పిరమిడ్లు.
2. బాబిలోనియాలోని వేలాడే ఉద్యానవనాలు. నెబుచెడ్నజూర్ అనే రాజు వీటిని నిర్మించాడు. దీని ఎత్తు 400 అడుగులు.
3. ఆసియా మైనర్‌లోని ఎఫిసన్ వద్దనున్న డయానా (అర్టిమస్) దేవాలయం. యూఫియస్ అనే రాజు నిర్మించాడు.
4. ఆసియా మైనర్‌లోని హాలికార్నసన్‌లో వున్న మాసొలస్ సమాధి ఇది.
5. రోడ్స్ దీవిపై నున్న అతిపెద్ద విగ్రహం. అపోలో పేరుతో నిర్మితమైన ఈ విగ్రహం గ్రీకుల ఆరాధించే సూర్యభగవానునికి చిహ్నం.
6. ఒలింపియా నగరంలో దంతం, బంగారంతో తయారుచేసిన జేయక్ విగ్రహం. ఫీడియస్ అనే శిల్పి చెక్కిన ఈ గొప్ప విగ్రహం గ్రీకుల ఆరాధ్య దేవత. దీని ఎత్తు 40 అడుగులు.
7. అలెగ్జాండ్రియాలోని ఫారోస్ దీవిపైనున్న వైట్ మార్బుల్ లైట్‌హౌస్. దీని ఎత్తు 147 మీటర్లు.
8. **స్టోన్ హెంజ్ :-** ఇవి లండన్ నగరానికి 90 మైళ్ళు వాయవ్యంగా వున్న పెద్దపెద్దరాళ్ళ సముదాయం. ఇవిప్రాచీన డ్రూయిడ్ దేవాలయ శిథిలాలుగా అనుకొంటున్నారు. (కాలం క్రీ॥పూ॥ 1800)
9. **టెంపుల్ ఆఫ్ కార్నక్ :-** ఇది 3,500 సంవత్సరాల పూర్వం ఈజిప్టులో నిర్మించబడింది.
10. **ది గ్రేట్ వాల్ ఆఫ్ చైనా :-** ఇదిచైనా చుట్టూవున్న అతి పెద్దగోడ. దీని పొడవు 2150మైళ్ళు. 320అడుగులవెడల్పు,16అడుగులఎత్తువుంటుంది.
11. **మాక్జిమస్ సర్కస్ :-** ఇది రోమ్‌లో రాజు టార్క్విన్ క్రీ.పూ. 605లో నిర్మించాడు.
12. **తాజ్‌మహల్ :-** షాజహాన్‌చక్రవర్తి తన భార్య ముంతాజ్ మహల్ స్మృత్యర్థం ఆగ్రాలో నిర్మించిన పాలరాతి భవనం (1658)
13. **లీనింగ్ టవర్ పీసా :-** ఇటలీలోని ఎత్తయిన బెల్ టవర్. 188 అడుగుల ఎత్తు. ఇది రోజురోజుకూ వాలుతూ వున్నదంటారు.
14. **వాటికన్ పాలెస్ :-** ప్రపంచలోకెల్లా అపురూపమైన పాలెస్. ఇందులో పోప్ నివాసముంటారు.

# ప్రపంచ చరిత్రలో ముఖ్య యుద్ధములు

1. మారథాన్ యుద్ధం :- క్రీ.పూ. 490
2. సలామీస్ యుద్ధం :- క్రీ.పూ. 480
3. హేస్టింగ్స్ యుద్ధం :- క్రీ.శ. 1066
4. ఆర్లియన్ ముట్టడి :- క్రీ.శ. 1428-29
5. కాన్‌స్టాంటి నోపుల్ ముట్టడి :- క్రీ.శ. 1453
6. ఆంగ్లేయ యుద్ధం :- క్రీ.శ. 1588
7. బెలెన్ హోమ్ యుద్ధం :- క్రీ.శ. 1704
8. క్యూబెక్ యుద్ధం :- క్రీ.శ. 1759
9. బంకర్ హిల్ యుద్ధం :- క్రీ.శ. 1775
10. సరటోగా యుద్ధం :- క్రీ.శ. 1777
11. యార్క్‌టౌన్ యుద్ధం :- క్రీ.శ. 1781
12. నైల్ యుద్ధం :- క్రీ.శ. 1798
13. ట్రఫల్గర్ యుద్ధం :- క్రీ.శ. 1805
14. ఆస్టర్‌లిట్జ్ యుద్ధం :- క్రీ.శ. 1805
15. బొరో డినో యుద్ధం :- క్రీ.శ. 1812
16. లీంజింగ్ యుద్ధం :- క్రీ.శ. 1813
17. వాటలూ యుద్ధం :- క్రీ.శ. 1815
18. నవరినో యుద్ధం :- క్రీ.శ. 1827
19. గెట్టిస్ బర్గ్ యుద్ధం :- క్రీ.శ. 1963
20. మార్నెయుద్ధం :- క్రీ.శ. 1914
21. వెర్డం యుద్ధం :- క్రీ.శ. 1916
22. సోమ్మె యుద్ధం :- క్రీ.శ. 1916
23. జట్‌లాండ్ యుద్ధం :- క్రీ.శ. 1916
24. పాసిచిండాకల్ యుద్ధం :- క్రీ.శ. 1917
25. బ్రిటన్ యుద్ధం :- క్రీ.శ. 1940
26. కొరల్ సీ యుద్ధం :- క్రీ.శ. 1942
27. ఎల్ అలామిన్ యుద్ధం :- క్రీ.శ. 1942
28. స్టాలింగ్ గార్డే యుద్ధం :- క్రీ.శ. 1942-43
29. నోర్మనన్ డీయుద్ధం :- క్రీ.శ. 1944
30. డైన్ బిన్ పూ యుద్ధం :- క్రీ.శ. 1954

# భారత స్వాతంత్ర్య సమర యోధులు

| పేరు | జననం-మరణం |
|---|---|
| అరుణ అసఫ్ ఆలీ | 1910-1996 |
| తాంతియా తోపే | మరణం-1859 |
| రాజారామ్‌మోహన్‌రాయ్ | 1772-1833 |
| సయ్యద్ అహమద్ ఖాన్ | 1817-1898 |
| ఈశ్వరచంద్ర విద్యాసాగర్ | 1820-1891 |
| నానాసాహెబ్ | 1821-1839 |
| దయానంద సరస్వతి | 1824-1883 |
| దాదాబాయి నౌరోజీ | 1825-1917 |
| ఎ.ఓ.హ్యూమ్ | 1829-1912 |
| ఝాన్సీలక్ష్మీబాయి | 1835-1858 |
| బంకించంద్ర చటర్జీ | 1838-1894 |
| మహదేవ గోవింద రానడే | 1842-1901 |
| డబ్ల్యు.సి. బెనర్జీ | 1844-1906 |
| ఫిరోజ్ షా మెహతా | 1845-1915 |
| అనిబిసెంట్ | 1847-1933 |
| సురేంద్రనాథ్ బెనర్జీ | 1848-1925 |
| బాలగంగాధర్ తిలక్ | 1856-1920 |
| బిపిన్ చంద్రపాల్ | 1858-1920 |
| మోతీలాల్ నెహ్రూ | 1861-1931 |
| రవీంద్రనాథ్ టాగూర్ | 1861-1941 |
| మదన మోహన్ మాలవ్యా | 1861-1946 |
| రమాబాయి రానడే | 1862-1924 |
| లాలాలజపతిరాయ్ | 1865-1928 |
| గోపాలకృష్ణగోఖలే | 1866-1915 |
| కొండా వెంకటప్పయ్య | 1866-1948 |
| కాశీనాథుని నాగేశ్వరరావు | 1867-1938 |
| చిలకమర్తి లక్ష్మీనరసింహం | 1867-1946 |
| కస్తూర్బా గాంధి | 1869-1948 |
| చిత్తరంజన్ దాస్ | 1870-1925 |
| అరవింద ఘోష్ | 1872-1950 |
| టంగుటూరి ప్రకాశం పంతులు | 1872-1957 |

| పేరు | జననం-మరణం |
|---|---|
| మహమ్మద్ ఇక్బాల్ | 1873-1933 |
| విఠల్‌భాయ్ పటేల్ | 1873-1933 |
| షౌకత్ ఆలీ | 1873-1938 |
| ఉన్నవ లక్ష్మీనారాయణ | 1873-1958 |
| మహమ్మదాలీ జిన్నా | 1875-1948 |
| వల్లభాయ్ పటేల్ | 1875-1950 |
| మౌలానా మహమ్మద్ ఆలీ | 1878-1931 |
| రాజగోపాలాచారి (రాజాజీ) | 1878-1972 |
| ముట్నూరి కృష్ణారావు | 1879-1945 |
| సరోజినీ నాయుడు | 1879-1949 |
| సి.వై. చింతామణి | 1880-1941 |
| భోగరాజు పట్టాభి సీతారామయ్య | 1880-1959 |
| సుబ్రహ్మణ్య భారతి | 1882-1921 |
| ఖాన్ సాహెబ్ | 1883-1958 |
| వినాయక్ దామోదర్ సావర్కర్ | 1883-1966 |
| బాబూ రాజేంద్రప్రసాద్ | 1884-1963 |
| పింగళి వెంకయ్య | 1885-1963 |
| మాడపాటి హనుమంతరావు | 1885-1965 |
| త్రిపురనేని రామస్వామి | 1886-1943 |
| ఎమ్.ఎన్.రాయ్ | 1886-1954 |
| బులుసు సాంబమూర్తి | 1886-1958 |
| సత్యమూర్తి | 1887-1943 |
| మౌలానా అబుల్ కలామ్ అజాద్ | 1888-1958 |
| జె.బి. కృపలానీ | 1888-1982 |
| దుగ్గిరాల గోపాలకృష్ణయ్య | 1889-1928 |
| ఆచార్యనరేంద్ర దేవ్ | 1889-1956 |
| జవహర్‌లాల్ నెహ్రూ | 1889-1964 |
| బూర్గుల రామకృష్ణారావు | 1889-1967 |
| ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ | 1890-1993 |
| బి.ఆర్. అంబేద్కర్ | 1891-1956 |
| అనంత శయనం అయ్యంగార్ | 1891-1978 |

| పేరు | జననం-మరణం |
|---|---|
| గరిమెళ్ళ సత్యనారాయణ | 1893-1952 |
| వరాహగిరి వెంకటగిరి | 1894-1980 |
| వినోభా బావే | 1895-1982 |
| మెరార్జీ దేశాయి | 1896-1995 |
| ఎన్.జి. రంగా | 1896-1995 |
| సుభాష్ చంద్రబోస్ (నేతాజీ) | 1897-1845 |
| అల్లూరి సీతారామరాజు | 1897-1924 |
| గుల్జారీలాల్ నందా | 1897-1997 |
| ఉద్దామ్ సింగ్ | 1899-1940 |
| కళా వెంకట్రావు | 1900-1958 |
| కల్లూరి సుబ్బారావు | 1900-1959 |
| పద్మజానాయుడు | 1900-1975 |
| విజయలక్ష్మి పండిట్ | 1900-1994 |
| పొట్టి శ్రీరాములు | 1901-1952 |
| మొసలికంటి తిరుమలరావు | 1901-1979 |
| కామరాజ్ నాడార్ | 1902-1975 |
| జయప్రకాష్ నారాయణ్ | 1902-1979 |
| మోటూరి సత్యనారాయణ | 1902-1995 |
| స్వామి రామానందతీర్థ | 1903-1972 |
| పుచ్చలపల్లి సుందరయ్య | 1903-1985 |
| లాల్ బహుదూర్ శాస్త్రి | 1904-1966 |
| చంద్రశేఖర్ అజాద్ | 1906-1931 |
| భగత్‌సింగ్ | 1907-1931 |
| బెజవాడ గోపాలరెడ్డి | 1907-1997 |
| దుర్గాబాయి దేశ్‌ముఖ్ | 1909-1981 |
| న్యాపతి సుబ్బారావు పంతులు | 1856-1941 |
| రామమనోహర్ లోహియా | 1910-1968 |
| ప్రతివాది భయంకరాచారి | 1910-1978 |
| రామస్వామి వెంకట్రామన్ | 1911- |
| రాజ్‌గురు | 1911-1931 |
| నీలం సంజీవరెడ్డి | 1913-1996 |
| ఇందిరాగాంధి | 1917-1984 |

# మన ప్రధానుల పదవీకాలాలు

| | |
|---|---|
| జవహర్ లాల్ నెహ్రూ | :- (1947 ఆగష్టు 15 నుండి 1964 మే 27 వరకు) 6,131 రోజులు అధికారంలో ఉన్నారు |
| లాల్ బహదూర్ శాస్త్రి | :- (1964 జూన్ 9నుండి 1966 జనవరి 11 వరకు) 582 రోజులు అధికారంలో ఉన్నారు |

1964, 1966 సం॥లో గుల్జారిలాల్ నందా 2 సార్లు భారతదేశానికి ఆపద్ధర్మ ప్రధానిగా వ్యవహరించారు.

| | |
|---|---|
| ఇందిరాగాంధీ | :- (1966 జనవరి 24 నుండి 1977 మార్చి 24వరకు) 4,078 రోజులు అధికారంలో ఉన్నారు |
| మురార్జీదేశాయ్ | :- (1977 మార్చి 24 నుండి 1979 జూలై 28 వరకు) 857 రోజులు అధికారంలో ఉన్నారు |
| చరణ్ సింగ్ | :- (1979 జూలై 28 నుండి 1980 జనవరి 14 వరకు) 171 రోజులు అధికారంలో ఉన్నారు. |
| ఇందిరాగాంధీ | :- (1980 జనవరి 14 నుండి 1984 అక్టోబర్ 31వరకు) 1,753రోజులు అధికారంలో ఉన్నారు. |
| రాజీవ్‌గాంధీ | :- (1984 అక్టోబర్ 31నుండి 1989 డిశంబర్ 2 వరకు) 1859 రోజులు అధికారంలో ఉన్నారు |
| వి.పి.సింగ్ | :- (1989 డిశంబర్ 2 నుండి 1990 నవంబర్ 10 వరకు) 344 రోజులు అధికారంలో ఉన్నారు |
| చంద్రశేఖర్ | :- (1990 నవంబర్ 10 నుండి 1991 జూన్ 21 వరకు) 224 రోజులు అధికారంలో ఉన్నారు |
| పి.వి నరసింహారావు | :- (1991 జూన్ 21నుండి 1996 మే 16 వరకు) 1792 రోజులు అధికారంలో ఉన్నారు |
| అటల్ బిహారి వాజ్‌పేయి | :- (1996 మే 16 నుండి 1996 జూన్ 1 వరకు) 17 రోజులు అధికారంలో ఉన్నారు |
| హెచ్.డి.దేవెగౌడ | :- (1996 జూన్ 1 నుండి 1997 ఏప్రియల్ 21 ) 325 రోజులు అధికారంలో ఉన్నారు |
| ఐ.కె.గుజ్రాల్ | :- (1997 ఏప్రియల్ 21 నుండి 1998 మార్చి 19 వరకు) 333 రోజులుఅధికారంలో ఉన్నారు |
| ఎ.బి.వాజ్‌పేయి | :- (1998 మార్చి 19 నుండి 1999 ఏప్రియల్ 17వరకు ) 395 రోజులు అధికారంలోఉన్నారు |
| ఎ.బి.వాజ్‌పేయి | :- నేతృత్వంలో 1999 అక్టోబర్ 13న సంకీర్ణ ప్రభుత్వం అధికారం చేపట్టింది |

# మన కవులు - ఏ శతాబ్ధమువారు 

**నన్నయ్య భట్టారకుడు** :- 11వ శతాబ్ధమువాడు. రాజమహేంద్రవరము రాజధానిగా తూర్పుచాళుక్య సామ్రాజ్యమును పరిపాలించిన వేంగి ప్రభువు రాజరాజనరేంద్రుని ఆస్థానకవి. కులబ్రాహ్మణుడు నన్నయ్య. ఆదికవి, వాగనుశాసనుడు (శబ్దశాసనుడు) నన్నయ్య బిరుదులు. ఆంధ్రశబ్దచింతామణి అను వ్యాకరణగంధ్రము రచించెను. నానారుచిరార్థసూక్తి మిథిత్వము, అక్షరరమ్యత మున్నగునవి నన్నయ్య కవితాల క్షణములు. నన్నయ్య ఆంధ్రమహాభారతము నందు ఆదిసభాపర్వములు, అరణ్య పర్వమునందు నాలుగవ అశ్వాసములో 142వ పథ్యం వరకూ రచించెను.

**తిక్కనసోమయాజి** :- 13వ శతాబ్ధమువాడు. మహాకవి తిక్కన నెల్లూరుని పరిపాలించిన మనుమసిద్ధిరాజువద్ద మంత్రిగానుండెను. వీరి వంశము వారు తరతరాలుగా కవులుగా, మంత్రులుగా, దండనాథులుగా ఖ్యాతిగాంచినారు. తిక్కన హరిహరనాథుని భక్తుడు. తిక్కనకు కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుడు అను బిరుదులున్నవి. ఈయన నిర్వచోత్తరరామాయణము, భారతములోని విరాటపర్వం మొదలు స్వర్గారోహణపర్వం వరకూ రచించెను. తిక్కన కవిత్వములో సందర్భోచిత పదప్రయోగం, రసానుగుణరచన, నాటకీయశైలి, చిత్తవృత్తి ప్రకటనము, వర్ణనా సామర్థ్యము అను గుణములు కనబడును.

**ఎఱ్ఱాప్రగడ** :- 14వ శతాబ్ధి. ఎఱ్ఱన ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవి. 1323లో కాకతీయ సామ్రాజ్య పతనానంతరం 1325లో అద్దంకి రాజధానిగా రెడ్డిరాజులు స్థాపించబడెను. ప్రోలయ వేమారెడ్డి తమ్ముడైన మల్లారెడ్డిద్వారా ఎఱ్ఱన రాజాశ్రయం పొందెను. ఎఱ్ఱన తల్లి ప్రోలాంబ, తండ్రి సూరన. గురువు శంకరస్వామి. పాకనాటియందున్న గుడ్లూరు ఎఱ్ఱన జన్మస్థానం.రామాయణము, హరివంశము, అరణ్యపర్వశేషము, నృసింహపురాణం అను గ్రంథములనురచించెను. ప్రబంధపరమేశ్వరుడు, శంభుదాసుడు ఇతనిబిరుదులు. రసభూషణ, వర్ణనాబాహుల్యము, వస్త్వైక్యము అనుమూడు గుణములు ఎఱ్ఱన కవిత్వములో కలవు.

**బమ్మెరపోతన** :- బమ్మెరపోతన క్రీ.శ. 1420లో పుట్టాడు. ఆయనది నిరుపేద కుటుంబమని, వృత్తి వ్యవసాయమని ప్రసిద్ధి. ఆయన ఏకశిలా నగరంగా ప్రఖ్యాతి పొందిన ఓరుగల్లు(వరంగల్లు) ప్రాంతానికిచెందినవాడు. ఈయనసహజకవి. ఈయన భక్తకవిపోతనగా, బమ్మెరపోతనగా, పోతనామాత్యునిగా, పోతరాజుగా అనేక పేర్లతో పిలువబడ్డాడు. ఈయన వీరభద్రవిజయం, నారాయణశతకం, భోగినీదండకం, శ్రీమహాభాగవతం రచించాడు. ప్రాచీనకవులలో సామాన్యజనులలో పోతనకున్న ప్రచారం మరొక కవికి లేదు.

**శ్రీనాథుడు** :- 15వ శతాబ్ధములో కొండవీటి రెడ్డిరాజుల ఆస్థానకవి. శ్రీనాథుడు మహా పండితుడు, మహాకవి. ప్రౌడడిండిమభట్టు కంచుడక్కను పగులగొట్టించెను. కనకాభిషేకం పొందెను. కొండవీటి రెడ్డిరాజులు అంతమొందిన తరువాత శ్రీనాథుడు పెక్కుచోట్లసంచ రించెను. చివరి దినములలో కష్టముల పాలయ్యెను. శృంగారనైషధము, భీమకండము, కాశీఖండము, హరవిలాసము, శివరాత్రిమహత్యము, పల్నాటివీరచరిత్ర అను కావ్యములను శ్రీనాథుడు రచించెను. ఈయనకు ఈశ్వరార్చనకళాశీలుడు అను బిరుదు కలదు.

**శ్రీకృష్ణదేవరాయలు** :- 16వ శతాబ్ధపువాడు. ఈయననేఆంధ్రబోజుడందురు. దక్షిణదేశ మును పరిపాలించిన సార్వభౌముడు. సరసకళాపోషకుడు, కళాహృదయుడు. ఆముక్తమాల్యద అనుపేరుతో గోదాదేవివిష్ణువును వివాహం చేసు కున్న కథను కావ్యంగా రచించెను.

**అల్లసాని పెద్దన :-** 16వ శతాబ్ధము ఇతని కాలం. శ్రీకృష్ణదేవరాయుల ఆస్థాన మందలి అష్టదిగ్గజాలలో ప్రథముడు. రాయలచే కవి గండపెండేరములను, అగ్రహార ములను పొందెను. స్వారోచితమనుసంభవమును రచించెను. ఈకృతినిరాయలవారికి అంకితమిచ్చెను. ఆంధ్రకవితా పితామహుడిగా పేరుగాంచెను.

**తెనాలి రామకృష్ణుడు :-** 16వ శతాబ్ధపు కాలమువాడు. గుంటూరు మండలమునందలి తెనాలి ఇతని నివాసము. ఇతడు మొదట సైవుడు. రామలింగమనుపేర భరగి ఉద్భటారాధ్య చరిత్రమును రచించెను. తరువాత వైష్ణవమతమును స్వీకరించి పాండురంగ మహత్యము, ప్రౌఢప్రబంధము రచించెను.

**పింగళి సూరన్న :-** 16వ శతాబ్ధమువాడు. ఇతడు అష్టదిగ్గజములలో ఒకడు. కళాపూర్ణోదయము, అద్భుతకథా కల్పనావిలసితము, ప్రభావతీ ప్రధ్యుమ్న అను కావ్యము, గరుడపురాణము ఇతని రచనలు.

**ధూర్జటి :-** ఇతడు రాయల ఆస్థానమందలి అష్టదిగ్గజములలో ఒకడు. శివభక్తుడు. కాళహస్తీశ్వర మహత్యమును కావ్యముగా రచించి, శ్రీకాళహస్తీశ్వరునికే అంకితమిచ్చెను. రాజాశ్రయమును, సంసారమును వదిలి శ్రీకాళహస్తీశ్వర శతకము రచించెను.

**క్షేత్రయ్య :-** 17వ శతాబ్ది ప్రారంభమువాడు. కృష్ణాతీరవాసి అగు ఈ వాగ్గేయకారుడు తంజావూరును పరిపాలించిన రఘునాధరాయులు, విజయరాఘవనాయకుల కాలమువాడు. మువ్వగోపాలముద్రలో శృంగారపురములను ఎక్కువగా రచించెను.

**కాకర్ల త్యాగరాజు :-** ఈయన 18వ శతాబ్దం తంజావూరుని పాలించిన మహారాష్ట్రరాజగు శరబోజీకాలమున ఉండెను. వేలాది కృతులను రచించిన గొప్ప రామభక్తుడు. కాకా చరిత్రము, ప్రహ్లాదచరిత్రము అనుయక్షగానములనురచించెను. ఇతను గొప్ప వాగ్గేయకార సార్వభౌముడు.

**పిల్లలమర్రి పినవీరభద్రుడు :-** 14వ శతాబ్ధపు విజయనగరమును పరిపాలించిన సాళ్వనరసింహరాయుని కాలమునందున్నవాడు. జైమినీ భారతమందలి అశ్వమేధపర్వమును రచించెను. కాళిదాసు సాకుంతలమును కొంతవరకూ అనుసరించి శృంగార సాకుంతలము అను స్వతంత్రకావ్యమును రచించెను.

**జంటకవులు :-** నంది మల్లయ్య, గంట సింగన జంటకవులుగా ప్రసిద్ధిపొందినారు. 16వ శతాబ్ధం ప్రారంభమున విజయనగర సామ్రాజ్యమును పాలించిన సాళ్వనరసరాజుకు వరాహపురాణమును రచించి సమర్పించిరి. ప్రభోదచంద్రోయమను నాటకమును వీరు శ్రవ్యకావ్యముగా రూపొందించిరి.

**నాచన సోమన :-** 14వ శతాబ్ధములో ఆనెగొందిని పరిపాలించిన బుక్కరాయుల కాలమువాడు. ఈయన ఉత్తరహరివంశము, అనంత విలాస కావ్యమును రచించిరి. పురాణ మును కావ్యశైలిలో రచించుటలో ఇతడే ప్రథముడు.

**పాల్కురికి సోమనాధుడు :-** 12వ శతాబ్ధముచివరివాడు. బసవపురాణం,పండితా రాజ్య చరిత్రఇతనిముఖ్యకావ్యాలు. ఇతనురచించినవృషాదీపశతకమే తెలుగులోమొట్టమొదటి శతకం.

**గోగులపాటి కూర్మనాథకవి :-** విశాఖపట్టణ ప్రాంతమువాడు. మృత్యుంజయ విలాసము, లక్ష్మీనారాయణ సంవాదము, సింహాద్రి నారసింహ విజయము, యక్షగానము, సుందరీమణి శతకములు పెక్కు గేయములు. సింహాచలక్షేత్రమును తురుష్కులు దొంగిలించుటకు వచ్చినప్పుడు స్వామివారిని వ్యాజనిందయొనర్చుచూ ఇతనొక శతకమును చెప్పగా ఆ కొండపై గుంపులు గుంపులుగా కందిరీగలు పుట్టుకొనివచ్చి తురుష్కులను ముట్టడించి పారద్రోలెను. ఇది వీరరసప్రధానమగు శతకము.

**భద్రభూపాలుడు (బద్దెనకవి) :-** ఈయన 13వ శతాబ్ధములోనివాడు. సుమతీశతకమును రచించెను. ఇందలి నీతులు, ధర్మములు సమయోచితాలై ప్రజలందరికీ ఉపయోగపడేట్లుగా వ్రాయబడ్డాయి.

**వేమన :-** 15వ శతాబ్ధంలో కొండవీటి ప్రాంతమును పరిపాలించిన రెడ్డిరాజుల వంశంలోని వాడు. ఇతడు యోగియై లోకవృత్తాంతములను, వేదాంతములను, మూఢనమ్మకాలనూ పరిహరించుచూ, వేలకొలదిగా ఆటవెలదులను రచించెను. ఆటవెలది పద్యాలలో నిత్యజీవితానికి పనికివచ్చే ఎన్నో నీతులను పొందుపరిచాడు. మరియు వేమనశతకమును రచించెను. ఆ పధ్యములు తెలుగునాట ఆణిముత్యాలు. అవి ఇప్పటికీ నిత్యమూ అందరి మనస్సులలో చిరస్థాయిగా నిలిచిపోయినాయి.

**ఫక్కి అప్పలనర్సయ్య :-** ఈయన 20వ శతాబ్ధము కాలమువాడు. ఈయన ఇరవైఐదు గ్రంధాలకు పైగారచించాడు. అందులో ముఖ్యంగా కుమారశతకం ఒకటి. వీరి కుమారశతకం బహుళప్రచారం పొందింది. నిర్వచన హేమలతాకావ్యము, ముకుందమాల, వల్లభరాయ శతకం, బాలకృష్ణ కీర్తనం మొదలగునవి వీరి ఇతర ప్రత్యేక రచనలు. ఈయన రచనలన్నీ భక్తినీ, నీతిని ప్రభోదించేవిగా ఉన్నాయి.

**మారద వెంకయ్య :-** ఈయన 17వశతాబ్ధపువాడు. ఈయన భాస్కరశతకం రచించెను. నీతిశతకాల్లో భాస్కరశతకం బహుళవిశిష్టమైనది. ఇందు నీతిబోధ చక్కగా చేయబడింది.

**భర్తృహరి :-** ఇతను సుభాషితత్రిశతిని రచించెను. ఇది సంస్కృత లఘుకావ్యము. దీనిలో నీతి, శృంగారం, వైరాగ్యములనే మూడుభాగాలున్నాయి. భర్తృహరి సుభాషితములను తెలుగులోనికి అనువాదము చేసినవారు ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన, ఏనుగు లక్ష్మణకవి ముఖ్యులు.

**కంచెర్లగోపన్న (రామదాసు) :-** ఈయన17వశతాబ్ధపువాడు. ఈయననే రామదాసని కూడా అంటారు. ఈయన శ్రీరాముని భక్తుడు. దాశరథిశతకమును రచించెను. భక్తిశతకాలలో దాశరథిశతకం ఒకటి. ఇందులో ప్రతిపధ్యం, ప్రతీపదం భక్తిని, వైరాగ్యాన్ని కలిగిస్తుంటాయి.

**తాళ్ళపాక అన్నమాచార్యులు (అన్నమయ్య) :-** పద్నాలుగువందల ఇరవైనాలుగు నుంచి పదిహేనువందల ముప్పై మధ్యకాలమువాడు. ఈయన జన్మించింది కడపజిల్లా తాళ్ళపాకలో. తెలుగులో మొదట వాడుకభాషలో తెలుగు నుడికారంతో జానపద బాణీలలో సామాన్య ప్రజలకుఅర్థమయ్యేటట్లుగా పాటలనురచించెను. ఈయనతిరుమలతిరుపతి వెంకటేశ్వరస్వామి భక్తుడు. పన్నెండుకుపైగా శతకములు రచించెను. సుమారు 32వేల సంకీర్తనలను రచించెను. అన్నమయ్య వైష్ణవభక్తి మతాన్ని ప్రచారం చేసి సర్వసమానత్వాన్ని ప్రభోదించాడు.

**ఆతుకూరి మొల్ల :-** 16వ శతాబ్ధము చివరిలో ఈ కవయిత్రి జీవతము ఉండెనని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఈమె కుమ్మరి కులస్థురాలు. ఈమె రచించిన మొల్ల రామాయణం ప్రసిద్ధి చెందింది.

**తిరుపతి వేంకటకవులు :-** దివాకరుల తిరుపతిశాస్త్రి. (1871 - 1900), చల్లపల్లి వెంకటశాస్త్రి (1850 -1950). గోదావరి మండలమున తిరుపతి వేంకటేశ్వరకవులను పేర ప్రసిద్ధికెక్కినారు. అష్టావధానం, శతావధానాలు జంటగా చేసినారు. ఆంధ్రకవితకు నూతనజీవనం కల్పించినస్వతంత్రుడు. దేవీ భాగవతమును ఆంధ్రీకరించిరి. శ్రవణానందము, బుద్ధచరిత్ర కావ్యములను రచించిరి. వృశ్యఘటిక, బాలరామాయణం, ముద్రా, రాక్షసాది నాటకములు, హరిచరిత్ర, విక్రమాంకదేవచరిత్ర మొదలగువి తెలుగులోవ్రాసిరి.

**వేంకట పార్వతీశ్వరకవులు** :- బాలాంత్రపు వేంకట్రావు (1880), ఓలేటి పార్వతీశం (1882 -1956). వీరిద్దరూ పిఠాపుర ప్రాంతీయులు, జంటకవులు. కవిరాజహంస అను పేరు పొందిరి. బృందావనం, కావ్యకుసుమావళి, ఏకాంతసేవ మున్నగు పద్యకృతులు రచించినారు.

**దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి** :- (1891-1982)పిఠాపురనివాసి. వీరితండ్రి, పెదతండ్రి కూడా పిఠాపురం ఆస్థానకవులు. సంఘసంస్కార, కృష్ణపక్షం, ఊర్వశి, ప్రవాసం వీరి కృతులు. గేయకవితలు వీరిసొత్తు. రేడియో నాటికలు కూడాకలవు. ప్రసిద్ధిచెందిన ప్రసంగికుడు.

**బసవరాజు అప్పారావు** :- (1894 - 1933) కృష్ణాజిల్లా నివాసి. కొంతకాలం ఆంధ్ర పత్రికా కార్యాలయమున ఉపసంపాదకత్వము, కొంతకాలం న్యాయవాదవృత్తి చేపట్టిరి. కృతులు, గీతములు, వాయుసందేశములు వీరుచేసిన రచనలు.

**బాలగంగాధరతిలక్** :- అమృతం కురిసిన రాత్రి గ్రంథకర్త. ఆంధ్ర, ఆంగ్ల, తమిళ భాషలందు ప్రావీణ్యం కలదు. కందకృతులు, గేయములు, నవలలు వీరి రచనలు.

**పరవస్తు చిన్నయసూరి** :- ఈయన 1806వ సంవత్సరంలో తమిళనాడులోని చెంగల్‌పట్టు జిల్లా శ్రీపెరంబదూర్‌లో జన్మించాడు. తల్లి శ్రీనివాసాంబ, తండ్రి పరవస్తు వేంకటరామానుజాచార్యులు. సంస్కృతం, తెలుగు, తమిళ భాషలలో గొప్ప పండితుడు. చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణం ప్రాచీన కావ్యభాషకు ఈ రోజుకీ ప్రమాణంగా భావించే వ్యాకరణం అది. సంస్కృతంలో విష్ణుశర్మ రచించిన పంచతంత్రాన్ని తెలుగుభాషలోకి వచనరూపంలో అందించాడు. సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం, ఆంధ్ర ధాతుమాల, నీతిచంద్రిక మున్నగునవి ఈయన రచనలు. ఈయన 1862లో మరణించాడు.

**దూపుర్తి రామిరెడ్డి** :- ఈయన 1895లోనెల్లూరుజిల్లాలో జన్మించారు. తల్లి లక్ష్మీదేవమ్మ, తండ్రిసుబ్బారెడ్డి. అనేకకావ్యాలు, నాటకాలు,వ్యాసాలు రచించాడు. జలదాంగన, వానాకాలపు వరిచేలు, నలజారమ్మ అగ్నిప్రవేశము, వనకుమారి, పానశాల, కడపటి వీడుకోలు మున్నగు నవి ఈయన కావ్యాలు. కృషీవలుడు, కాంగ్రెస్‌వాలా, కుంబరాణా, సీతావనవాసం ఈయన రచించిననాటకాలు. ఈయనకు కవికోకిల అనే బిరుదుంది. ఈయన 1947లో మరణించాడు.

**విశ్వనాధసత్యనారాయణ** :- 20వ శతాబ్ధి. ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవిగా, అత్యున్నత అవార్డు జ్ఞానపీఠఅవార్డుగ్రహీతగా తెలుగుజాతికి పేరుప్రఖ్యాతలు తెచ్చిన మహాకవి విశ్వనాథ సత్యనారాయణగారు కృష్ణాజిల్లా, నందమూరులో 1893లో జన్మించారు. బందరు, గుంటూరు, విజయవాడలలో ఆంధ్రోపాసకులుగా, కరీంనగర్ కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. 1971లో జ్ఞానపీఠ అవార్డు పొందారు. వీరి రచనల్లో రామాయణకల్పవృక్షకావ్యం ముఖ్యమైనది. ఆంధ్రప్రసక్తి, కిన్నెరసాని పాటలు, ఋతుసంహారం, వేయిపడగలు, ఏకవీర, చెలియలికట్ట, మాబాబు, ధర్మచక్రం, బద్దన సేనాని, హాహా హూహూ. నర్తనశాల, వేనరాజు, తెరచిరాజు మొదలైన రచనలు విశేష ప్రజాదరణ పొందాయి.

**పానుగంటి లక్ష్మీనరసింహారావు** :- 1865 - 1940 మధ్యకాలంలో పిఠాపుర సంస్థానకవులు. నర్మదా పురుకుత్సీయము, పాదుకా పట్టాభిషేకం, ప్రచండచాణక్యము, బుధబోధసుధ, విజయరాఘవము మొదలైన స్వతంత్రరూపకములను రచించెను.

**రాయప్రోలు సుబ్బారావు** :- 20వ శతాబ్ధి. అభినవాంధ్రచరిత్రకు ఆచార్యులు రాయప్రోలు సుబ్బారావుగారు. ఈయన 1892 మార్చి 13వ తేదీన గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా గార్లపాడులో జన్మించారు. ఆధునికాంధ్రకవితకు తొలితొడిమ అయిన "లలిత" అనే కావ్యాన్ని 1909లో రచించారు. ఆ తదుపరి ఇంకనూ అనేక కావ్యాలు రచించారు.

**గుఱ్ఱం జాషువా** :- 20వ శతాబ్ది. 1895లో గుంటూరుజిల్లా వినుకొండలో జాషువాకవి జన్మించారు. ఉపాధ్యాయుడిగా, రేడియో ఉద్యోగిగా పనిచేశారు. సంప్రదాయరీతిలో ఆధునిక భావాలలో ఉత్తమకవితలు అనేకం రచించారు. జాషువా రచించిన కండకావ్య సంపుటలు 7భాగాలు. ఫిరదౌసీ,గబ్బిలము, ముంతాజ్‌మహల్, బాపూజీ, నేతాజీ, ముషాఫర్‌లు, కాందీశీకుడు, నాగార్జునసాగరము మున్నగున్నవి. గిజిగాడు, గౌతమబుద్ధుడు, వివేకానందస్వామి, స్మశానవాటిక, శిల్పి, శిశువు మొదలగు కవితాసంపుటికలు ప్రశంశలు పొందాయి.

**నాయని కృష్ణకుమారి** :- నాయని కృష్ణకుమారిగారు రచయిత్రిగా, కవయిత్రిగా, కథారచయిత్రిగా సుప్రసిద్ధురాలు. 1930లో జన్మించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు విభాగం ప్రొఫెసర్‌గా రిటైర్డ్‌అయి ప్రస్తుతం హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. వీరు సుప్రసిద్ధ భావకవి, కళాప్రపూర్ణ నాయని సుబ్బారావుగారి కుమార్తె. ఈమె రచించిన కాశ్మీరదీపకళిక, అగ్నిపుత్రి, ఏం చెప్పను నేస్తం, మానసలీల అనేవి ముఖ్యమైనవి.

**చిలకమర్తి లక్ష్మీనరసింహం** :- ఈయన 1867 సెప్టెంబర్ 26 నుండి 1946 జూన్ 17 వరకూ వీరి జీవితకాలం. ఈయన రాజమండ్రి నివాసి. ఈయన గొప్ప రచయిత, సంఘసంస్కర్త, పేదవారికి విద్యాదానం చేసిన మహానుభావుడు. స్వప్నవాసవదత్త, గయోపాఖ్యానం వంటి నాటకాలను సౌందర్యతిలక, గణపతి మొదలగు నవలలను అనేక జీవిత చరిత్రలను రచించారు.

**గురజాడ అప్పారావు** :- ఈయన 1862 సెప్టెంబర్ 21న జన్మించాడు. తల్లి కౌసల్యమ్మ, తండ్రి వెంకటరామదాసు. ఈయన కన్యాశుల్కం (నాటకం), దిద్దుబాటు (కథ), ముత్యాలసరాలు (గేయం), కన్యక (గేయం), పూర్ణమ్మ (గేయం) మొదలైనవి ప్రసిద్ధాలు. ఈయన గొప్ప సంఘ సంస్కర్త. మానవతావాది. ఈయనకు కవిశేఖర, మహాకవి, అభ్యుదయ కవితా పితామహుడు బిరుదులు. ఈయన 1915 నవంబర్ 30న మరణించాడు.

**శ్రీశ్రీ** :- పూర్తిపేరు శ్రీరంగం శ్రీనివాసరావు. ఈయన 1910లో జన్మించారు. ఈయన తెలుగుసాహిత్యంలో తనదైన ఒక ప్రత్యేక బాణీతో కవితాసృష్టిచేసి అభ్యుదయకవి శ్రీశ్రీగా నిలిచారు. ఈయన చందస్సులో, భావనలో, శబ్దప్రయోగంలో కొత్తదనం చూపారు. ఈయన ప్రభావ (కండకావ్యం), మహాప్రస్థానం (గేయసంపుటి), ఖడ్గసృష్టి (గేయసంపుటి), సిరిసిరిమువ్వ (శతకం) మొదలైనవి రచించారు. ఈయన 1983లో మరణించెను.

**ముళ్ళపూడి వెంకటరమణ** :- ఈయనప్రఖ్యాతరచయిత. ఈయనఅద్భుతసృష్టి 'బుడుగు'. ఈయన రచనలో హాస్యం, సంప్రదాయం అంతర్లీనంగా ఉంటాయి. పెద్దలంటే గౌరవం, పిల్లలమీద అభిమానం ఇవన్నీ ఈయన రచనలో కన్పిస్తాయి. నిజం ఎప్పుడు చెప్పాలి, అబద్ధం చెప్పవచ్చా? అనే విషయాలమీద మనకు చాలా సాహిత్యం ఉంది. కానీ, అసలు నిజం ఎప్పుడూ చెప్పకూడదని కాదు. అస్తమానం, ఎప్పుడూ అనే బుడుగు వ్యాఖ్యానానికి ఒక ప్రత్యేకత కనపడుతుంది.

**విద్వాన్ విశ్వం** :- పత్రికా ప్రపంచమున లబ్ధప్రతిష్ఠులైన విద్వాన్ విశ్వంగారు సాహిత్య ప్రపంచంలో విశిష్టస్థానం సంపాదించి కళాప్రపూర్ణ గౌరవం అందుకున్నారు. సంస్కృతాంధ్ర, ఆంగ్లభాషలలో గొప్ప ప్రముఖులు. ఆంధ్రప్రభ వారపత్రికలో మాణిక్యవీణ శీర్షిక బహుళప్రజాదరణ పొందింది. భూమి, విరికన్నె, స్టాలిన్ మొదలైన గ్రంథాలు వీరు రచించారు. పెన్నేటిపాట అనేవీరి కండకావ్యం రాయలసీమనుగూర్చి వ్రాసినారు. ఒకనాటి రత్నాలసీమ నేడు రాళ్ళ సీమయై ఎట్టిదీనస్థితిలోఉన్నదో ఈకండికతెలియజేస్తుంది. ఊహకన్నా భావంకన్నా అనుభవమే ముఖ్య మూలాధారంగా వెలువడిన రచన ఇది.

# కంప్యూటర్ విజ్ఞానము

మొట్టమొదట ఈ కంప్యూటరు యొక్క పరిమాణము చాలా పెద్దదిగా ఉండి, ఎక్కువ స్థలము ఆక్రమించి, బరువే కాక పెద్ద మొత్తంలో ఒక ఊరికి సరిపడు కరెంటును వినియోగించుకొనేది. సమస్యలను సాధన చేయుటలో కూడా ఎక్కువ కాలం పట్టేది.

"ఛార్లెస్ బాబేజి" అను "కంప్యూటరు పితామహుడు" చేసిన పరిశోధనల ఆధారంగా ఈ కంప్యూటరు యొక్క పరిమాణము తగ్గింది.

క్రమేణా అనేకమంది పరిశోధనల ఫలితంగా ఈనాడు కంప్యూటరు చేతిలో ఇమిడిపోయే సాధనంగా లభ్యమవుతోంది.

అయితే, నేడు కంప్యూటరుకు ఉన్న ముఖ్య లక్షణములు పరిశీలిస్తే.

**1.వేగం :-** సెకనుకు మిలియన్లు, బిలియన్లు సమస్యలను సాధించగలదు.

ఒక మనిషి అనేక సంవత్సరముల కాలం పనిచేసిన పనిని కంప్యూటర్ కొన్ని నిమిషములలోనే చేయగలదు. కంప్యూటర్ వేగమును సెకండ్లుకంటే తక్కువ యూనిట్లలో క్రింది విధముగా వుండును.

$\frac{1}{1,000}$ సెకండ్=మిల్లీ సెకండ్ $\frac{1}{10,00,000}$ సెకండ్=మైక్రోసెకండ్

$\frac{1}{1,00,00,00,000}$ సెకండ్=నానోసెకండ్ $\frac{1}{10,00,00,00,00,000}$ సెకెండ్=పికోసెకండ్

**2.సరైన సమాధానములు :-** దీనినే ఏక్యురసీ అంటారు. ఇప్పటి కంప్యూటర్లు సమస్యలకు నూటికి నూరు శాతం సరైన సమాధానములు ఇచ్చును.

**3.నిల్వలు :-** దీనిని స్టోరేజ్ అంటారు. అవసరమైన సమాచారములను మరల వాడుకొనుటకు కంప్యూటర్‌లోనే నిల్వ ఉంచుకొను అవకాశమున్నది.

**4. అన్ని రంగములలోను వినియోగం :-**కంప్యూటర్లను నేడు అన్ని రంగముల లోను వాడుతున్నారు. ఉదాహరణకు : ముద్రాణా రంగం, రైల్వే రిజర్వేషన్, వైద్య రంగం, విద్యా రంగం, రక్షణ రంగం, సమాచార రంగం, న్యూస్ ప్రింటింగ్, ట్రాఫిక్ నియంత్రణ రంగం, వ్యవసాయ రంగం, బ్యాంకింగ్ రంగం ఇలా ఎన్నో రంగాలలో వాడుతున్నారు.

కంప్యూటరుయందు ముఖ్యంగా మూడు భాగాలుంటాయి. వాటిని ఈక్రింది విధంగా సూచించవచ్చు.



మెమరీ కంట్రోల్ యూనిట్, ALU

**1. ఇన్‌పుట్ :-** కంప్యూటర్‌లోనికి సమాచారంఅనగాడేటాను అందిం చేందుకు ఉపయోగించే సాధనం. ఈ ఇన్‌పుట్ యూనిట్‌లు అనేకం ఉన్నాయి.

వీటిలో కొన్ని కీబోర్డు, మౌస్, స్కేనర్, జాయ్‌స్టిక్, వాయస్ ఇన్‌పుట్ సిస్టమ్.

**2.సి.పియు :-** దీనినే సెంట్రల్ ప్రాసెసింగ్‌యూనిట్ అంటారు. ఇదే కంప్యూటరకు అతి ముఖ్యమైన భాగం. ఇది మనిషికి మెదడులాంటిది. దీనినే కంప్యూటరు యొక్క మెదడు అంటారు. ఇందులో మళ్ళీ మూడు భాగాలు ఉన్నాయి.

**ఎ. మెమరీ :-** కంప్యూటర్ నందు సమాచారము నిల్వ ఉంచు విభాగము.

**బి.కంట్రోల్ యూనిట్ :-** ఇది కంప్యూటర్ యొక్క శక్తి సామర్థ్యాలను ఆధారంగా చేసుకొని మొత్తం కంప్యూటరును దాని భాగాలను, వాటి పనితీరును పరిశీలించి నియంత్రించగల భాగము.

**సి. ఎ.యల్.యు :-** అనగా అర్థమెటిక్ లాజిక్ యూనిట్. దీనిలోనే గణితము మరియు ఇతరమైన క్లిష్ట సమస్యలన్నీ సాధించబడి వాటి సమాధానములను అవుట్‌పుట్ యూనిట్ ద్వారా మనకు అందచేస్తుంది.

**3. అవుట్‌పుట్ యూనిట్ :-** సిపియులో సాధన చేయబడిన సమాధానములు దీని ద్వారా బయటకు వచ్చును. అవుట్‌పుట్ యూనిట్‌లు కూడా అనేకం ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనవి మానిటరు, ప్రింటరు.

## స్టోరేజి

### కంప్యూటర్‌లోని మరొక ముఖ్యమైన అంశం స్టోరేజి

కంప్యూటరు సిపియులోమెమరీఉన్నప్పటికీ ఇదికేవలంకరెంటు ఉన్నంత వరకు మాత్రమే సమాచారమును నిల్వ ఉంచుకోగలదు. కరెంటు పోయిన యెడల నిల్వచేసినసమాచారము తిరిగిపొందుటవీలుగాదు. అందువల్లకరెంటు పోయినప్పటికీ సమాచారము నిల్వ ఉంచవలసిన అవసరం ఉన్నప్పుడు ఈ స్టోరేజి పరికరములను తప్పక వాడవలయును. వీటిలో ముఖ్యమైనవి "ఫ్లాపీడిస్క్" మరియు "హార్డుడిస్క్" అవసరమైన టేపు రికార్డరులో వాడే క్యాసెట్లపై కూడా సమాచారమును నిల్వ ఉంచవచ్చును. వీటిలో అవసరమునుబట్టి ఉన్నసమాచార మును చెరిపివేసి తిరిగిక్రొత్త సమాచా రమును ఎక్కించి నిల్వ ఉంచవచ్చును.

### కంప్యూటర్ పరికరములు (భాగములు)



**కీబోర్డు :-** ఇదిటైపురైటరు కీబోర్డువలెనేకీస్ (అక్షరాలమీటలు)కలిగి ఉంటుంది. దీనిద్వారా కంప్యూటరుకు అవసరమైన సమాచారమును అందించుటకు వీలు పడును. ఇవి 5 భాగములు. 1.స్టాండర్డ్ టైప్ రైటర్ 'కీ'లు 2. ఫంక్షన్ 'కీ'లు 3.స్పెషల్ 'కీ'లు 3.స్పెషల్ పర్పస్ 'కీ'లు 4.కర్సర్మూమెంట్ 'కీ'లు 5. న్యూమరిక్ 'కీ'లు

**మౌస్ :-** దీనిఆధారంగా కర్సర్ను ఎక్కడకు కావాలంటే అక్కడకు కదపవచ్చును.

**కర్సర్ :-** కర్సర్ అనగా కీ బోర్డుపై సమాచారమును టైపు చేయుచుండగా అక్షరము తరువాత అక్షరమునకు ''___ÑÑ ఖాళీ చూపెడి గుర్తు.

**స్కానర్ :-** ఫొటోలను, చిత్రాలను కంప్యూటర్లోనికి ఎక్కించడానికి ఉపయోగపడు సాధనం.

**జాయ్స్టిక్ :-** కంప్యూటర్పై వీడియో గేములు ఆడేటప్పుడు పావులను అతి సులభంగా కదుపుటకు వాడే సాధనం.

**బార్కోడ్ రీడర్ :-** విదేశీ వస్తువులపై ఉండే బార్కోడ్స్ను ఈ పరికరం ద్వారా ఇన్పుట్లా కంప్యూటర్కు అందించి ఆ వస్తువు యొక్క ధరను కంప్యూటరుపై బిల్ వచ్చేలా చేయు సాధనం.

**మాడెమ్ :-** రెండు కంప్యూటర్ల మధ్య పరస్పర సమాచార నిర్వహణకు టెలిఫోన్ ద్వారా వాటిని కలుప గల సాధనం.

**మానిటర్ :-** ఇది చూచుటకు టివి లాగానే ఉంటుంది. కంప్యూటరు ద్వారా సాధన చేయబడిన సమాధానములను దీనిపైనే మనము చూడగలము. ఇది అవసరమైన బొమ్మలను సహితం చూపించగలదు. దీనినే **VDU** అని, స్క్రీన్ అనీ, **CRT** అని కూడా పిలుస్తారు. ఇవి **CGA, VGA, EGA** అను రకాలలో లభ్యమవుతాయి.

**ప్రింటరు :-** కంప్యూటరు ద్వారా సాధన చేయబడిన సమాధానములను కాగితంపై ముద్రించు సాధానం. ఈ ప్రింటర్లు అనేక రకములు డేజీవీలు ప్రింటరు, లేజరు ప్రింటరు, డాట్ మాట్రిక్స్ ప్రింటరు, ఇలా అనేకం ఉన్నాయి. ప్రింటరుపై ముద్రించబడిన కాగితాన్ని "ప్రింట్ అవుట్ అంటారు" దీనిని **Hard Copy** అని కూడా అంటారు.

**చిప్ :-** ఇది సిలికాన్తో తయారు చేయబడిన ఎలక్ట్రానిక్ సర్క్యూట్గల పరికరము. దీనిలోనే సమాచార విశ్లేషణ జరపబడును.

**ఫ్లాపీడిస్క్ :-** సమాచారాన్ని నిల్వ చేయుటకు వాడే సాధనం. ఇది 8".5.25", 3.5", 2.5" సైజులలో లభిస్తాయి. ఇవి డబుల్డెన్సిటీ, హైడెన్సిటీ అని రెండు రకములు, హైడెన్సిటీ ఫ్లాపీడిస్క్లలో ఎక్కువ సమాచారాన్ని నిల్వ చేసుకోవచ్చును.

**ఫ్లాపీల మెయింటెనెన్స్లో తీసుకోవలసిన జాగ్రత్తలు :-**

1. ఫ్లాపీ డిస్క్లను ఎల్లప్పుడూ మాగ్నెట్లు, మాగ్నెటిక్ ఫీల్డులనుండి దూరంగా వుంచవలెను. 2. వేడి, పొగ, దుమ్ము వాతావరణంలో వుంచకూడదు. 3. డిస్క్లను తడితగిలే ప్రదేశంలో వుంచకూడదు.

**హార్డ్ డిస్క్ :-** ఇది కూడా సమాచారాన్ని నిల్వ ఉంచుటకు వాడే సాధనం. ఇది కంప్యూటరు లోపల సిపియులో అమరుస్తారు. దీనిలో కెపాసిటీని బట్టి 2,000 నుంచి 80,000 ఫ్లాపీ డిస్క్‌లో నిల్వ ఉంచగల సమాచారాన్ని ఈ హార్డు డిస్క్‌లో నిల్వ ఉంచవచ్చును.

**సి.డి. రామ్ - కాంపాక్ట్ డిస్క్ రీడ్ ఓన్లీ మెమరీ :-** ఇదికూడా సమాచారాన్ని నిల్వఉంచగలసాధనం. ఇదిమామూలు గుండ్రని డిస్క్‌వలె 4.6" వ్యాసం కలిగి ఉంటుంది. ప్రస్తుతంఅనేక సినిమాలు, సాఫ్ట్‌వేర్‌లు వీటిలోనే లభ్యమవుతున్నాయి.

**బిట్ :-** కంప్యూటరులోనుఫ్లాపీలోను, హార్డ్‌డిస్క్‌లోను, నిల్వ ఉంచే సమాచారాన్ని కొలుచుటకువాడే పదం.

**బైట్ :-** 8 బిట్స్ కలిపి 1 బైట్

1 **KB :** 1024 బైట్స్

1 **MB :** 1024 **KB (Kilo Bites)**

1 **GB :** 1024 **MB (Megabites) GB (Gigabyte)**

1 **TB :** 1024 **GB (TB = Terabyte)**

**డిస్క్‌డ్రైవ్ :-** ఇది సిపియులో ఉంటుంది. ఇందులో ఫ్లాపీడిస్క్‌ను ఉంచుటకు వాడుతాము. ఈ ఫ్లాపీ డిస్క్ డ్రైవ్‌లు కూడా మూడు రకములు. వివిధ ఫ్లాపీలను బట్టి 8", 5.25", 3.5", 2.5" డిస్క్ డ్రైవ్‌లు లభ్యమవుతున్నాయి.
(**గమనిక :-** హార్డుడిస్క్‌కు వేరే డ్రైవ్ ఉండదు. ఇది సిపియు లోపల అమర్చబడి ఉంటుంది.)

**సిడి రామ్‌డ్రైవ్ :-** ఇది కూడా సిపియు నందు అమర్చుకొనుటకు వీలు కలిగి ఉంటుంది. మనం సిడిలు వాడవలసి వచ్చినప్పుడు ఈ డ్రైవ్ ఉండి తీరాలి. ఇందులోసిడిలుఉంచి మల్టీ మీడియా ద్వారా సినిమాలు సహితం చూడవచ్చును.

**స్పీకర్లు :-** మల్టీమీడియాకు సంబంధించి, చిత్రంతోపాటు ధ్వని కోసం వీటిని వాడతాం. వీటిని కూడా సిపియుకు కలుపుతారు.

కంప్యూటరులో ఉపయోగించే ప్రతిభాగాన్ని సిపియుకు అనుసంధానం చేయడం ద్వారా మాత్రమే కంప్యూటరు పనిచేస్తుంది. అనగా సిపియు అనునది కంప్యూటరు నందు అతి ముఖ్యమైన విభాగము.

**ROM** :- అనగా రీడ్ ఓన్లీ మెమరీ. ఇది సిపియులో ఉండే మెమరీలో ఒక భాగం. ఇందులో సమాచారాన్ని కేవలం కంప్యూటర్ మాత్రమే చదవగలదు. ఇందులోని సమాచారాన్ని చదవడం ద్వారా మాత్రమే కంప్యూటరు పనిచేయడం ప్రారంభమవుతుంది. దీనినే **Booting** అంటారు.

**RAM** :- అనగా రేండమ్ ఏక్సెస్ మెమరీ. ఇది సిపియులో ఉండే మెమరీలో రెండవభాగం. ఇందులోనేమనంచేయు ప్రోగ్రామింగ్,డేటా అన్నీ నిల్వ ఉంటాయి. కరెంటు పోయినప్పుడు దీనిలో నిల్వచేసిన వన్నీ పోతాయి. కనుకనే ఫ్లాపీ డిస్క్‌ను గాని, హార్డుడిస్క్‌ను గాని వాడుతాము.

# కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ మరియు హార్డువేర్

**హార్డువేర్ :-** కంప్యూటర్‌లో ఉండే వివిధ భాగాలనే హార్డ్‌వేర్ అంటారు.

**సాఫ్ట్‌వేర్ :-** సాఫ్ట్‌వేర్ అనగా మనం వ్రాసే ప్రోగ్రాములు, మనం వాడే కంప్యూటర్ లాంగ్వేజీలు, మనం కంప్యూటర్‌కు అందించే సమాచారము. వీటినే సాఫ్ట్‌వేర్‌గా చెప్పవచ్చును. ఈ సాఫ్ట్‌వేర్‌లు మూడు రకాలు.

**1. ఆపరేటింగ్ సిస్టమ్‌లు 2. కంప్యూటరు లాంగ్వేజీలు 3. ప్యాకేజీలు**

## ఆపరేటింగ్ సిస్టమ్‌లు

ఆపరేటింగ్ సిస్టమ్, సాఫ్ట్‌వేర్ లేనిదే ఏ కంప్యూటరూ పనిచేయదు. ఇది కంప్యూటర్‌లో జరిగే అన్ని కార్యకలాపాలను నియంత్రించుతుంది. ఇందులో ముఖ్యమైన ఆపరేటింగ్ సిస్టమ్‌లు మూడు గలవు.

1.**MS-Dos** :- దీనినే మైక్రోసాఫ్ట్ డిస్క్ ఆపరేటింగ్ సిస్టమ్ అంటారు. ఇది ఒక యూజర్‌కు మాత్రమే పనికివస్తుంది.

2.**UNIX** :- ఇది అనేక మంది యూజర్స్‌కు పనిచేస్తుంది. దీనిని మల్టీ యూజర్ ఆపరేటింగ్ సిస్టమ్ అంటారు.

3.**Windos** 95, 98, 2000 లు కూడా ఆపరేటింగ్ సిస్టమ్‌లే.

## కంప్యూటరు లాంగ్వేజీలు (కంప్యూటర్ భాషలు)

**ఇవి ముఖ్యంగా రెండు రకములు.**

**1.లోలెవెల్ లాంగ్వేజీలు :-** కంప్యూటరు కేవలం ఈ లోలెవెల్ లాంగ్వేజీలనే అర్థం చేసుకోగలదు. వీటిని "మిషన్ లాంగ్వేజీ" అనికూడా అంటారు.

**2.హై లెవెల్ లాంగ్వేజీలు :-** మనం అనగా యూజర్స్ అర్థం చేసుకుని, ప్రోగ్రాములు వ్రాయగలము. ఇవి అనేక రకములు. వీటిలో కొన్ని:-

**1.బేసిక్ :-** బిగనర్స్ ఆల్ పర్పస్ సింబాలిక్ ఇన్‌స్ట్రక్షన్ కోడ్ (BASIC)

**BASIC = BEGINNERS ALL PURPOSE SYMBOLIC INSTRUCTION CODE**

కంప్యూటర్ నేర్చుకొనువారు ముందుగా ఈ బేసిక్ ప్రోగ్రామును నేర్చి, తరువాత యితర ప్రోగ్రామ్సు నేర్చుకొనుటకు అనువుగా వుండును.

ఇపుడు అందుబాటులో వున్న **BASIC** రకములు :- **BASIC, BASICA, MS-BASIC, IBM BASIC, GW-BASIC, VISUAL BASIC**

TURBO-BASIC, ఈభాషలోఆటలుప్రోగ్రాములు,సంగీతస్వర కల్పన లోనుఉపయోగపడుతున్నది-ఈప్రోగ్రామ్స్‌తోరోజుఅంతాకాలక్షేపం చేయుచున్నారు.

**2.కోబాల్ :-** కామన్ బిజినెస్ ఓరియెంటెడ్ లాంగ్వేజీ (**COBOL**) దీనిని వర్తక వ్యాపారాలలోవచ్చే అనేకసమస్యలను సులువుగాసాధన చేయుటకు ప్రోగ్రామింగ్ ద్వారా ఉపయోగిస్తారు. అందుబాటులో వున్న COBAL రకములు.

COBAL 74, COBAL 85, MS COBAL, OCU COBAL 99

**3. పాస్కల్ :-** దీనిని అన్ని రకముల సమస్యల సాధనకు వాడవచ్చును.

**4. ఫోర్ట్రాన్ :-** ఫార్ములా ట్రాన్స్‌లేషన్ (Fortran). ఈ లాంగ్వేజీని సైంటిఫిక్, రీసెర్చి సమస్యల సాధనలో వాడుతారు. చిన్న పిల్లలు నేర్చుటకు బాగుగా ఉపయోగపడును.

**5.లోగో :-** ఇది చిన్నపిల్లలు బొమ్మలు గీయడం ద్వారా నెమ్మదిగా కంప్యూటరు ప్రోగ్రామ్‌లు వ్రాయుట నేర్పడానికి వాడుతారు.

**6.సి :-** ఇది కంప్యూటర్ లాంగ్వేజీలు వాడకంలో అతి ముఖ్యమైన కంఫైలర్స్‌ను, అసెంబ్లర్స్‌ను, ఇతర సాఫ్ట్‌వేర్స్ తయారు చేయడానికి వాడుతారు.

**ప్రోగ్రాము :-** పై ఏదేని ఒక లాంగ్వేజిని ఉపయోగించి ఏదైనా సమస్యను కంప్యూటర్‌పై సాధించుటకు వ్రాయు కమాండ్లు మరియు సూచనలను, ఒకదాని తరువాత ఒకటి వ్రాయుటను ప్రోగ్రాము అని చెప్పవచ్చును.

**ట్రాన్స్ లేటర్స్ :-** ఇవి కంప్యూటర్ లాంగ్వేజీల విషయంలో అతి ముఖ్యమైన పాత్ర వహిస్తాయి. ఇవి హైలెవెల్ లాంగ్వేజీలలో వ్రాయబడిన ప్రోగ్రాములను లోలెవెల్ లాంగ్వేజీలలోనికి తర్జుమా చేసి కంప్యూటర్లు అర్థం చేసుకునే లాగా చేస్తాయి. అప్పుడేమనము ఏసమస్యనైనాకంప్యూటర్‌లో సాధన చేయగలుగుతాము. ఇవి లాంగ్వేజీలతో పాటే వస్తాయి. ఇవి రెండు రకములు 1. కంఫైలర్స్ (Compilers) 2. ఇంటర్ ప్రీటర్స్ (Interpreters)

## కంప్యూటర్ ప్యాకేజీలు

లాంగ్వేజీలకు, ప్యాకేజీలకు తేడా ఏమిటంటే, ప్యాకేజీలలో కమాండ్స్ ఎలా వాడాలో ఉదాహరణలతో సహా హెల్ప్ ఉంటుంది. ఈ హెల్ప్ కొంత వరకు మానిటరుపై కనబడుతూనే ఉంటుంది. ఈ ప్యాకేజీలలో కొన్ని :

**1. డిబేస్ :-** డేటాబేస్. ఇది ఒక విషయంపై సేకరించిన వివిధ అంశములను ఒక పట్టిక రూపంలో తయారు చేసి కంప్యూటర్‌లో సమాచార రూపంలో భద్రపరుస్తారు. దీని ఆధారంగా అనేక గణనలు జరుగుతాయి. ఉదాహరణకు జనాభాలెక్కల సేకరణ మున్నగున్నవి.

**2. వర్డ్‌స్టార్ :-** దీనినే వర్డ్ ప్రాసెసర్ అని కూడా అంటారు. ఇది ఆఫీసులలో నిత్యం వాడే డాక్యుమెంట్లు, ఉత్తర, ప్రత్యుత్తరాలు వ్రాసి వాటిని నిర్వహించడానికి వాడుతారు.

**3.లోటస్ 123 :-** ఇది కూడా పై విధంగానే డిబేస్‌లో లాగానే సమాచారం నిల్వ ఉంచి అవసరమైతే కంప్యూటర్ గ్రాపులను కూడా తీసుకొనుటకు వాడుతారు.

# ఇతర సాఫ్ట్‌వేర్స్

**డి.టి.పి. :-** అనగా డెస్క్‌టాప్ పబ్లిషింగ్. కంప్యూటరు సహాయంతో నేడు ముద్రణ వ్యవస్థ. ఈ డిటిపి ద్వారానే జరుగుతున్నది. దీనిలో బొమ్మలు సహితం ఇష్టమైన సైజులలో ఇష్టమైన రంగులలో ప్రింటింగ్ చేయవచ్చును. వెంచూరా, పేజ్‌మేకర్ వంటి సాఫ్ట్ వేర్‌లు వినిమయంలో ఉన్నాయి.

**మల్టీమీడియా :-** ధ్వని, చిత్రాలు, ఏనిమేషన్ (చిత్రాల కదలిక), గ్రాఫిక్స్ వంటి అన్ని సౌకర్యాలు కలగలపి ఉంటాయి. ఇవి సి.డి రామ్‌లలో ఉంటాయి.

**విండోస్ :-** చిత్రాల సహాయంతోను మౌస్‌ను ఉపయోగించి కర్సర్‌ను కదిలించి ఆపరేట్ చేయగల సాఫ్ట్‌వేర్. దీనిని ఉపయోగించుట వలన మనకు పని సులభంగా పూర్తవుతుంది. ఇది 3.1, 3.11, విండోస్ 95, విండోస్ 98, విండోస్ 2000 రూపాలలో లభ్యమవుతుంది. ఇందు 95 మొదలుకొని అన్నీ ఆపరేటింగ్ సిస్టమ్‌లుగా పరిగణించబడినాయి.

**MS ఆఫీస్ :-** ఇది విండోస్ ద్వారా ఆపరేట్ చేసే సాఫ్ట్‌వేర్. ఇందులో 3 సాఫ్ట్‌వేర్‌లు ఇమిడిఉన్నాయి.

**1.MS ఎక్సెల్ 2. MS వర్డ్ 3. పవర్‌పాయింట్.**

**MS Excel** :- ఇది లోటస్ 123ను పోలి వుంటుంది. కాని ఇది చాలా అడ్వాన్స్‌డ్ వెర్షను.

**MS-Word** :- ఇది వర్డ్ ప్రాసెసర్‌ను పోలి ఉంటుంది. ఇది కూడా చాలా అడ్వాన్సుడు వెర్షను.

**Power Point** :- ఇది బిజినెస్ వ్యవహారాలలో స్లైడులు, క్యాప్షన్స్ తయారు చేయుటకు ఉపయోగిస్తారు.

**Foxpro** :- ఇది డిబేస్‌కు అడ్వాన్సుడు వెర్షను.

**RDBMS** :- దీనిని రిలేషనల్ డేటాబేస్ మేనేజ్‌మెంట్ అంటారు. ఇది కూడా డేటాబేస్‌లా ఉపయోగించుకుంటారు.

**Oracle** :- ఇది కూడా **RDBMS** కు సంబంధించిన సాఫ్ట్‌వేర్.

**Net Work** :- వివిధ ప్రాంతాలలో గల కంప్యూటర్లకు అనుసంధానించి సమాచారమును ఒకచోట నుండి ఒకచోటకు అందించు వ్యస్థను నెట్‌వర్కు అంటారు. ఇది రెండు రకములు.

**1.Lan** :- లోకల్ ఏరియా నెట్‌వర్క్. ఒకప్రదేశములో గల పది, పది హేను కంప్యూటర్లను వైర్స్ ద్వారా కలుపు పద్ధతి.

**2.Wan** :- వైడ్ ఏరియా నెట్‌వర్క్. వివిధ ప్రదేశములలో గల కంప్యూటర్లను కేబుల్ వైర్స్ ద్వారా గాని, శాటిలైట్స్ ద్వారా గాని అనుసంధానించే పద్ధతి.

**ఇ-మెయిల్ :-** దూర ప్రాంతాలలో గల కంప్యూటర్లకు టెలిఫోన్ ద్వారా సమాచారాన్ని పంపుటకు వీలగును. దీనిని "ఇ-మెయిల్ అడ్రసు" అని ఉంటుంది. ఆ అడ్రసు ఆధారంగా సమాచారమును లిఖిత పూర్వకంగా పంపవచ్చును. తిరిగి పొందవచ్చును.

**ఇంటర్‌నెట్ :-** ఇంటర్నేషనల్ నెట్‌వర్క్. అను ఈ పద్ధతి దేశ, విదేశాలలో గల కంప్యూటర్లను సహితం అనుసంధానించడం ద్వారా సమాచారాన్ని ఉత్తర, ప్రత్యుత్తరాల మాదిరిగా కొన్నినిముషాలు, సెకన్లలో సంపాదింపవచ్చును.

ఇందు **W.W.W.** అనగా వరల్డ్‌వైడ్‌వెబ్ అంటారు. ఇందు వివిధ రకాల వెబ్‌సైట్స్ ఉంటాయి. ప్రతి వెబ్‌సైట్‌లోను సమాచారం నిల్వ చేసి ఉంటుంది.

ఇందు మనం కూడా వెబ్‌సైట్స్‌ను సృష్టించవచ్చును. దీనికి గాను **JAVA, HTML** అను ప్రత్యేకమైన కంప్యూటరు లాంగ్వేజీలు వాడవలసి ఉంటుంది.

కంప్యూటర్లు అనేది ఒక ఎలక్ట్రానిక్ సాధనము. దీనిని ఉపయోగించి మనము అనేక విధములగు గణిత సమస్యలను సాధించవచ్చును. ఇది క్లిష్టమైన సమస్యలను సహితం "లాజిక్" ద్వారా నిర్ణయించి అతి సులువుగా సమాధానములను ఇచ్చును.

మొదట్లో ఈ కంప్యూటర్ యొక్క పరిమాణము చాలా పెద్దదిగా ఉంది. ఎక్కువ స్థలము ఆక్రమించి, బరువే కాక పెద్ద మొత్తంలో ఒక ఊరికి సరిపడు కరెంటును వినియోగించుకొనేది. దీనిలో వాక్యూమ్ ట్యూబ్స్ ఉండేవి. ఇవి తరచుగా పనిచేసేవి కావు. తరువాత ట్రాన్సిస్టర్స్‌ని వాడేవారు.
చివరికి **IC** (ఇంటిగ్రేటెడ్ సర్క్యూట్స్‌ని) వాడుతున్నారు.

"చార్లెస్ బాబేజి" అను "కంప్యూటరు పితామహుడు" చేసిన పరిశోధనల ఆధారంగా ఈ కంప్యూటరు యొక్క పరిమాణము తగ్గింది.

క్రమేణా అనేక మంది పరిశోధనల ఫలితంగా ఈనాడు కంప్యూటర్లు చేతిలో ఇమిడిపోయే సాధనంగా లభ్యమవుతోంది.

**నిల్వలు :-** సమాచారం ఇప్పుడు బైట్ల రూపంలో నిల్వ అవుతుంది.

1 **KB** : 1024 బైట్స్
1 **MB** : 1024 **(Kilo Bites)**
1 **GB** : 1024 **(Megabites) GB (Gigabyte)**
1 **TB** : 1024 **GB (TB = Terabyte)**

**1. ఇన్‌పుట్ :-** కంప్యూటర్‌లోనికి సమాచారంఅనగాడేటాను అందిం చేందుకు ఉపయోగించే సాధనం.

**ఉదాహరణ:-**ఎవరికైనా మనం ప్రశ్నవేస్తే వాళ్ళు ఆలోచించి సమాధానం ఎలా ఇస్తారో అలాగే కంప్యూటరు కూడా **input** తీసుకొని పనిచేసి **O/P** ని ఇస్తుంది.

**కీబోర్డు :-** ఇన్‌పుట్ సాధనము. ఇది సమాచారమును కంప్యూటర్‌కి పంపడానికి వీలుగా ఉంటుంది.

**మానిటరు :-** ఇది అవుట్‌పుట్ సాధనము. **CRT** అనగా కాథోడ్ రే ట్యూబ్ అంటారు. ఇది **TV** స్క్రీన్‌లా ఉంటుంది. అవుట్‌పుట్‌ని చూడడానికి ఉపయోగపడుతుంది.

**హార్డువేర్ :- H/W** లో ప్రాసెసర్, మదర్‌బోర్డ్, **RAM** చిప్స్, సాకెట్స్, **IC** చిప్స్, బాటరీ, ఫాన్ మొదలగునవి ఉంటాయి.

**సాఫ్ట్‌వేర్ :- Ms-Dos :-** దీనిని కీ బోర్డు ద్వారా చేయగలము మరియు ఇందులో ఇంటర్నల్ మరియు ఎక్స్‌టర్నల్ కమాండ్స్ కలవు.

**UNIX:-** ని చాలా మంది ఉపయోగించవచ్చు. ఒకే సమయంలో వివిధ వ్యక్తులు, వివిధ కంప్యూటర్లతోను ఉపయోగించవచ్చు. ముఖ్యంగా ఒక సర్వర్‌లో మాత్రమే డేటాఅంతా నిల్వఅవుతుంది. ఒకే సర్వర్‌తో చాలామంది క్లైంట్స్ పనిచేయవచ్చు.

**కంప్యూటర్ లాంగ్వేజీలు :-** ఇవి ముఖ్యంగా రెండు రకాలు. అవి 1.లో లెవల్ లాంగ్వేజ్ మరియు హైలెవల్ లాంగ్వేజ్. కంప్యూటర్ కేవలం ఈ లోలెవల్ లాంగ్వేజీలనే అర్థం చేసుకోగలదు. దీనిని "మిషన్ లాంగ్వేజ్" అని కూడా అంటారు. ఎందుకంటే ఇందులో డేటా మొత్తం బైనరీ కోడ్‌లో ఉంటుంది. బైనరీ అనగా 0.1. డేటా మొత్తం 0.1తోనే నిల్వ అవుతుంది. దీనిని బైనరీ లాంగ్వేజ్ అని కూడా అంటాము. ఈ బైనరీ కోడ్‌ని అసెంబ్లర్స్ అసెంబ్లీ కోడ్‌లోకి మార్చి లోలెవల్ కోడ్‌గా మారుస్తుంది. ఆ లాంగ్వేజీని మిషన్ మాత్రమే అర్థం చేసుకోగలదు.

**NETWORK :**

**గేట్‌వే :-** ఇది రెండు నెట్‌వర్క్ కనెక్షన్‌లను కలుపుతూ ఒక చోట నుండి మరొక చోటికి సమాచారాన్ని అందచేస్తుంది. ఇది ఒక **HUB** లా పనిచేస్తుంది.

**MS-Word :-** ఇందులో టైప్ చేయడానికి ఉపయోగపడుతుంది మరియు ఫాంట్స్ సైజులు, మోడల్స్ కూడా మార్చవచ్చు.

**ప్రింటర్:-** ప్రింటర్ అనునది అవుట్‌పుట్ సాధనము. ఇది డేటాను పేపర్ల మీద కూడా చూడవచ్చు. ప్రింట్ చేయవచ్చు.

**Ms-Excel :-** మాథమెటికల్ ఫంక్షన్స్‌ని చేయవచ్చు.

# ఆంధ్ర దేశంలో ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు

**తిరుమల :-** విశేష జనావళికి ఆరాధ్యుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయం ఉంది. ప్రతినిత్యం విశేష భక్తజనావళి నిరంతరం గోవిందనామాలతోఘోషిస్తుంటుంది.

**తిరుపతి :-** తిరుపతిలో గోవిందరాజస్వామి, కోదండరామస్వామి కపిలేశ్వరస్వామి ఆలయాలు ఉన్నాయి. ఇక్కడ విశ్వవిద్యాలయం కూడా ఉంది.

**తిరుచానూరు :-** తిరుపతికి 5 కి॥మీ॥ దూరంలో ఉంది. ఇక్కడ శ్రీనివాసుని సతీమణి అలివేలుమంగా (పద్మావతి) దేవాలయం ఉంది.

**శ్రీకాళహస్తి :-** తిరుపతికి 38 కి॥మీ॥దూరంలో దక్షిణకాశీగా పేరొందింది. శ్రీకాళహస్తీశ్వర ఆలయం ఉంది. బాగా పురాతనమైన శిల్పసంపద.

**శ్రీశైలం :-** కర్నూలుకు 180 కి॥మీ॥ దూరం. ద్వాదశ (12) జ్యోతిర్లింగాలలో శ్రీశైలం ఒకటి. శ్రీ మల్లిఖార్జునస్వామి, శ్రీభ్రమరాంబ అమ్మవారి ఆలయాలు ఉన్నాయి. శ్రీశైల శిఖర దర్శనం చేస్తే పుణ్యగతులు ప్రాప్తిస్తాయి అని మన పురాణాలు చెబుతున్నాయి.

**విజయవాడ :-** దేశంలో పెద్ద రైల్వేస్టేషనులలో ఒకటి, పెద్ద జంక్షన్. దేశంలో అన్నిచోట్లకు వెళ్ళే అనువైన జంక్షన్. ఇక్కడ కనకదుర్గా ఆలయం ప్రసిద్ధి. ఇంద్రకీలాద్రిపై భ్రమరాంబికా మల్లేశ్వర – కనకదుర్గా – విజయేశ్వర స్వామి ఆలయం ఇక్కడకు సమీపంలో గాంధీపర్వతం, కృష్ణాబ్యారేజ్ ప్రసిద్ధి.

**అన్నవరం :-** రాజమండ్రికి 80 కి॥మీ॥ దూరంలో రత్నగిరిపై హరిహర హిరణ్యగర్భాత్మక శ్రీ సత్యనారాయణస్వామి అనంతలక్ష్మి, సత్యవతిలు ఉన్న క్షేత్రం. ఇక్కడ ఎండనుబట్టి టైము తెలిపే 'సన్‌డయల్' ఉంది.

**మహానంది :-** నంద్యాలకు 16 కి॥మీ॥ దూరంలో దట్టమైన అడవుల సమూహములతో, మహానందీశ్వరాలయంఉంది. ఈప్రాంతానికి 16కి॥మీ॥ చుట్టూ తొమ్మిది నందులు ఉన్నాయి. వీటినే నవనందులు అని అంటారు. ఇక్కడ కోనేరులో స్నానమాచరించడం ప్రసిద్ధి

**మంత్రాలయం :-** ఆదోనికి 57 కి॥మీ॥ దూరంలో రాఘవేంద్రస్వామి గుడి అత్యంత ప్రాముఖ్యత కలిగినది.

**భద్రాచలం :-** ఇక్కడ గోదావరి ఒడ్డున రామదాసు నిర్మించిన రామాలయం ఉంది. ఈ ఆలయంలో రామునికి 4 చేతులుంటాయి. చతుర్భుజ రామచంద్రుడు అని అంటారు.

**పర్ణశాల :-** భద్రాచలానికి 32 కి॥మీ॥ దూరం. అరణ్యవాస సమయంలో శ్రీరాముడు నివాసమున్నది ఇక్కడే అని చెబుతారు.

**వేములవాడ :-** ఇక్కడ రాజరాజేశ్వర స్వామి ఆలయం ప్రసిద్ధి. ఇది కరీంనగర్ పట్టణానికి చేరువలో ఉంది.

**బాసర :-** నిజామాబాద్‌కు 50కి॥మీ॥ దూరంలో శ్రీ సరస్వతిదేవి దేవాలయం ఉన్నది ఇది బాగా ప్రసిద్ధి చెందిన దేవాలయం. చిన్నపిల్లలకు అక్షరాభ్యాసము ఇక్కడ ఎక్కువగా చేయిస్తారు.

**యాదగిరిగుట్ట :-** హైదరాబాద్‌కు 64 కి॥మీ॥ దూరం. శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయం ప్రసిద్ధి.

**అరసవెల్లి :-** శ్రీకాకుళంకు 2 కిలోమీటర్లు దూరం. శ్రీ సూర్యనారాయణస్వామి దేవాలయం, దేవేంద్రుడే ఈదేవాలయం నిర్మించాడని చెబుతారు. మనరాష్ట్రంలో అత్యంత ప్రసిద్ధి చెందిన సూర్యదేవాలయం.

**శ్రీకూర్మం :-** శ్రీకాకుళంకు 15 కి॥మీ॥ దూరం దశావతారంలో గల కూర్మరూపమే శ్రీకూర్మనాథ దేవాలయం. ఇక్కడ ఉన్న శిల్ప సంపద మరే దేవాలయంలోనులేదు.

**సింహాచలం :-** విశాఖపట్నంకు 16 కి॥మీ॥దూరం. శ్రీవరాహలక్ష్మినరసింహస్వామి విగ్రహం ప్రతిరోజుపూసేచందనంతోకప్పబడిఉంటుంది. ప్రతిసంవత్సరంవైశాఖమాసంలో చందనోత్సవం జరుగుతుంది. ఆరోజుస్వామివారిచందనము తొలగించి నిజరూపదర్శనం కల్పిస్తారు.

**మందపల్లి :-** రావులపాలెంకు 6 కి॥మీ॥ దూరం. శనీశ్వరాలయం ప్రసిద్ధి. శనిదోషనివారణకు ఈఆలయంలో తైలాభిషేకం ప్రసిద్ధి. దేవతలే ఈ ఆలయాన్ని ప్రతిష్ఠించారని చెబుతారు.

**అంతర్వేది :-** రాజోలుకు 25 కి॥మీ॥దూరం. సముద్రతీరంకుచేరువలోశ్రీ లక్ష్మినృసింహస్వామి దేవాలయం బాగా ప్రసిద్ధి.

**కోటిపల్లి :-** రాజమండ్రికి 60 కి॥మీ॥ దూరం. సోమేశ్వర ఆలయం ప్రసిద్ధి. ఈ శివలింగం పాతాళం నుండి ఉందని మనపూర్వికులు చెబుతారు.

**ద్రాక్షారామం :-** కోటిపల్లికి 13 కి॥మీ॥ దూరంలోఉంది. ఇదిదక్షిణకాశీగా పంచారామాలలో ఒకటి శ్రీ భీమేశ్వరాలయం. అతిపురాతనమైన దేవాలయం.

**రాజమండ్రి :-** పురాతనమైన నగరం. ఇక్కడ కోటిలింగేశ్వర ఆలయం, మార్కండేయస్వామి ఆలయం, వేణుగోపాలస్వామి ఆలయంప్రసిద్ధి. ఇక్కడ గోదావరి నది బాగా ప్రసిద్ధి చెందింది. రోడ్-కమ్ రైలు బ్రిడ్జి అతి పొడవైనది. ఇంకనూ పుష్కరసందర్భంగా నగరంలో అనేక సుందరప్రాకారాలు ఇవి దర్శనీయాలు.

**ద్వారకాతిరుమల :-** ఏలూరుకు 40 కి॥మీ॥ దూరంలో చిన్న తిరుపతిగా పేరు గాంచింది. ఇక్కడ శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం ఉంది.

**పెనుగొండ :-** తాడేపల్లిగూడెంకు 35 కి॥మీ॥ దూరం. వాసవీకన్యకా పరమేశ్వరిఆలయం ప్రసిద్ధి.

**పాలకొల్లు :-** నరసాపురంకు 8 కి॥మీ॥ దూరం. పంచారామాలలో గల ఒకటి. శ్రీ క్షీరారామేశ్వర దేవాలయం ప్రసిద్ధి.

**మంగళగిరి :-** విజయవాడకు 8 కి॥మీ॥ దూరంలో ఉంది. పానకాల నరసింహస్వామి దేవాలయం ఉంది. పానకం తయారుచేసి స్వామి నోట్లో పోస్తే సగం బయటకు వస్తుంది. దీనినే ప్రసాదంగా ఇస్తారు. బెల్లం పానకం నైవేధ్యంగా పెడుతున్నా ఒక్క చీమ కూడా ఉండదు. ఇదే ఇక్కడ విశేషం

**అమరావతి :-** గుంటూరుకు 35 కి॥మీ॥ దూరం. అమరేశ్వరస్వామి ఆలయం ప్రసిద్ధి భారతదేశంలోని 4 బౌద్ధక్షేత్రాలలో అమరావతి ఒకటి.

**పుట్టపర్తి :-** అనంత పురమునకు 25 కి॥మీ దూరంలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ప్రశాంత నిలయముంది. ఇక్కడే ప్రఖ్యాతిగాంచిన సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రికూడా ఉంది.

**బ్రహ్మంగారి మఠం :-** బ్రహ్మంగారి మఠంగా పిలవబడే కర్నూల్ జిల్లాలో కందిమల్లయ్యపల్లి రమణీయమైన ప్రకృతి సౌందర్యంతో విలసిల్లుతుంటుంది. బ్రహ్మంగారు కాలజ్ఞానం వ్రాసిన ప్రాంతమిదే ఈ ప్రాంతం చూడడానికి భక్తులు అశేషంగా వస్తుంటారు.

**పట్టిసీమ :-** రాజమండ్రికి 20 కి॥మీ॥ దూరంలో గోదావరి మధ్యలోవెలసిన శ్రీ వీరభద్రేశ్వ స్వామి దేవాలయం ఉంది. ఇది అతిపురాతనమైన దేవాలయం.

**ర్యాలి :-** రావులపాలెంకు 5 కి॥మీ॥దూరంలో ఈ గ్రామంలో శ్రీ జగన్మోహినీ కేశవస్వామి ఉమాకమండలేశ్వర స్వామి దేవాలయం ప్రాచీనమైనవి.

